

మహర్షి సద్గురు

# శ్రీ మలయాళస్వామి చరిత్రము

అను

# అసంగానంద విజయము

రచయిత:

పండిత సత్కవి శ్రీ నారు నాగనార్య గారు.

నాగవరము.

ప్రకాశకులు:

శ్రీ వ్యాసాశ్రమము

వ్యాసాశ్రమం - పోస్టు, మార్గము - ఏర్పేడు (చిత్తూరుజిల్లా.)

1971

తొలి కూర్పు — 1971 - వ సం॥రం రెండువేలు ప్రతులు.

వెల రు. 4—00.



# ఆ వి ష్క ర ణ ము

34 - వ శ్రీమదఖండగురుపూజాసందర్భము

స్వస్తిశ్రీ సాధారణనామ సం॥రం మాఘ శుద్ధ త్రయోదశి సోమవారము - (8-2-1971).

ప్రకాశకులు :—

శ్రీ వ్యాసాశ్రమము వారు.

ప్రతులకు :—

మేనేజరు - శ్రీ వ్యాసాశ్రమము,
వ్యాసాశ్రమం - పోస్టు, మార్గము - యేర్పేడు.
చిత్తూరు జిల్లా. (ఆం. ప్ర.)

ముద్రణ - శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ
వ్యాహరన్మామనుస్మరన్ ।




యః ప్రయాతి త్యజన్దేహం
స యాతి పరమాం గతిమ్




శ్రీ వ్యాసాశ్రమ సంస్థాపకులగు
బ్రహ్మీభూత మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారు.
ఏష ఆగచ్ఛతి శ్రీమానసజ్ఞానన్ద సద్గురుః ।
దూరం ధావత దర్పాన్ధా శ్శుష్క-వేదాన్తి దన్తినః ॥

ఓం

# విషయసూచిక



## ప్రథమ ఘట్టము



## ద్వితీయ ఘట్టము

## తృతీయ ఘట్టము



## చతుర్థ ఘట్టము

## పంచమ ఘట్టము



## షష్ఠ ఘట్టము

## సప్తమ ఘట్టము



## అనుబంధము

ఓం

శ్రీ గురుశ్శరణమ్

# తొలి పలుకు

అఖ్యాపిత చరిత్రాయ సుచరిత్రానుమోదినే।
అదమ్యాయ సువృత్తాయ గురుదేవాయ తే నమః॥

అనన్యగురుభక్తియుతులగు ప్రియాత్మ సోదరీ సోదరులారా!

పవిత్రమగు భారతదేశమున నెందఱో మహాత్ము లవతరించి తమ దివ్యసందర్శనముచే, భవ్యతర సదుపదేశములచే, ఆదర్శవంతమగు సదాచరణచే, అనుకరణీయ శీల సంపదచే లోకమును పునీతమొనర్చి యశఃకాయులైరి. అందు ఆధునిక మహాపురుషుల కొందఱి జీవిత విశేషములు దెలిసినను ప్రాచీనులగు ఋషుల జీవితములగూర్చి విశదముగా దెలియరాదు. కాని వారి కృతులు, బోధలు మాత్రము సులభగ్రాహ్యములై యున్నవి. అట్టి మహనీయులు యెచ్చట, యేవంశమున, యెవరికి, యెపుడు జన్మించిరి అను శుష్కాన్వేషణముకన్న, వారు లోకమున కేమి మేలొనర్చిరి? వారి చర్య యెట్టిది? వారాచరించి చూపిన దివ్యపథమెట్టిది? లోకోద్ధరణకొఱకై వారొనర్చిన దివ్యకార్యములెవ్వి? వాటిని మనమనుగమించుటెట్లు? — అను విచారమే ముఖ్యమైనది. కొందఱు ఒక మార్గమును, మఱికొందఱు వేరొక మార్గమును అనుసరించుచుందురు. విశేషించి మహాత్ముల జీవితచరిత్ర లన్నియు సంశయాత్మకములు, ఊహానిర్మితములే యనదగును.

19-వ శతాబ్దాంతమున జన్మించిన మహాత్ములలో అన్యతములైన అస్మద్గురుదేవుల (బ్రహ్మీభూత మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారి) జీవితమున్ను యింతవఱకు నస్పష్టమై, అనూహ్యమయ్యే యుండెను. శ్రీవారు ఆధ్యాత్మికముగా, సాంస్కృతికముగా, సాంఘికముగా, విద్యావిషయకముగా, స్త్రీ శూద్ర జనతా సముద్ధరణాత్మకముగా ఆంధ్రదేశమునకు జేసిన సేవ అపారము, అనన్యసాధారణము, కాని స్వసేవా ప్రభావముచే, తపశ్శక్తిచే, సత్యనిష్ఠచే, త్రికరణశుద్ధిచే, సదాచార సంపత్తిచే ఆంధ్రప్రజల నయస్కాంతమువలె నాకర్షించినను నీ మహనీయునిగూర్చి ఆంధ్రలోకము అజ్ఞాతమయ్యే యుండుట కడు ఆశ్చర్యము. చివరికి నామమాత్రమైనను దెలియక భక్తకోటి ఆ మహనీయుని దేశనామముచే 'శ్రీ మలయాళస్వామి' యని పిలువ నారంభించెను గాని అసలు పేరును గుర్తింప జాలదయ్యె. ఆ మహనీయు డొనర్చు మహత్కార్య ఫలము ననుభవించుచు మైమఱచి వేనోళ్ల పొగడుట దప్ప వేరొండు నూహింప జాలదయ్యె. ఎవరేని గురుదేవుని దివ్యచరిత్ర నుల్లేఖింప నుత్సాహముతో శ్రీవారిని ప్రశ్నించిరేని — మనము లోకమునకు నెట్టి సేవ జేసితిమని మా జీవితమును రచింప దలంచితిరి? పూర్వకాలీన మహాత్ముల జీవితములతో వారొనర్చిన లోకసేవతో తులతూచి చూచిన మా జీవితము మాచేసిన సేవ అణుమాత్రముగూడ తుల్యము కాదే! అని నిరహంకారులై,

ఆత్మశ్లాఘాదూరులై ప్రశ్నకర్తల నిరుత్సాహపరచెడువారు. తమ జీవితము నంతయు లోకసేవకై సమర్పించియు ఊరు - పేరు దెలియని అనామక వ్యక్తియే యైరి. నామరూపరహిత పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొని "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అన్నటుల నామరహితులై, భక్తులు ప్రీతితో పిలచిన 'మలయాళస్వామి' అను వ్యావహారిక నామమునే స్వకీయ నామముగా గ్రహించి మురిసిపోయి అవ్యక్తులుగా నుండి అవ్యక్తములో గలసిపోయిన శ్రీగురుదేవుల నిరహంకార వృత్తితో గూడిన దివ్యజీవితమెంత పావనమైనది? ఋషి మూల మును, నదీ మూలమును నన్వేషింపరాదని శాస్త్రవచనము గదా! శాసకులగు దేశికేంద్రుల దివ్యభావ మెవరికెఱుక? ప్రాసంగికముగా శ్రీవారు తెలుపుచుండిన కొన్ని జీవిత విశే షములను స్మరించుచు, ప్రత్యక్షమగు శ్రీవారి పునీత చరిత్ర మును తిలకించుచు భక్తులు పరవశులగుచుండిరి. శ్రీవా రున్నంతవఱకును తెవరికిని సమగ్రజీవితమును తెలిసికొను టకుగాని, కథించుటకుగాని మనస్సు ప్రవృత్తము కాదాయెను! కాని శ్రీగురుదేవుల నిర్యాణానంతరము 'తజ్జీవిత చరిత్ర' ఉండిన బాగని భక్తులందఱికిని జిజ్ఞాస ఉదయించినది. ఎంతో మంది శ్రీవారి జీవిత చరిత్రమును గుఱించి యేదేని గ్రంథము ఉన్నదా అని వ్యాసాశ్రమమునకు జాబులు వ్రాయుచుండిరి. ఇయ్యది ఆశ్రమమునకు లోటుగా కనిపించెడిది. ఈ లోటును దీర్చివలయుననను సంకల్పము నాకును చాల కాలము నుంచి

యుండెను. కాని యెంత ప్రయత్నించినను యింతవఱకు అట్టి మహోన్నత గ్రంథ రచనను పూర్తి గావించ లేకపోయినందు లకు విచారముగానే యున్నది. ఎప్పటికైనను ఆ పని జరుగ వలసియే యున్నది. కాని క్షుత్పిపాసా బాధితులగు వ్యక్తుల నెంతవఱకు వారించగలము? వారికి పంచభక్ష్యపరమాన్నము లవసరము లేదు. క్షుద్బాధా నివృత్తికై వారికి గంజి అయి నను చాలును కదా! అట్లే భక్తుల ఉత్కంఠను జిజ్ఞాసను, ఉత్సాహమును నిరోధించుటగూడ భావ్యముగాదు సాధ్యము కాదు గూడా! అందులకే కాబోలు శ్రీ గురుదేవులు అనన్య గురుభక్తులగు వైద్య విద్వత్కవి పండిత శ్రీ నారునాగనార్యుల హృదయములో ప్రవేశించి యీ 'శ్రీ మలయాళస్వామి చరిత్రము'ను రచింపజేసి అనతికాలముననే స్వచరిత్రమును బహిర్గత మొనర్చిరి. దీనిని చూచినదే నెత్తి నున్న భారము తొలగినటుల విశ్రాంతి నొంది మహదానందము ననుభవింప గలిగితిని. కొంతవఱకు భారము క్షుడనైతినని భావించితిని.

ఆంధ్రభాషలోనేగాదు మఱి యే భాషలోగాని సాహి త్యము సామాన్యముగా పద్యాత్మకముగానే ప్రవృత్తమగుట సహజము. ఇందుకు భారత రామాయణాది ఉద్గ్రంథములే సాక్షి. తదనుగుణముగానే శ్రీవారి చరిత్రమున్ను ప్రథమ మున పద్యాత్మకముగా వెలువడుట పరంపరాను సరణమునకు తార్కాణము. అందును గ్రంథకర్త తమ సహజ మధుర కవితా సరణితో గద్యపద్యాత్మిక ప్రబంధ రీతిలో నీ రచనను గావించుట మహా విశేషము. పూర్వమీ కవిమహాశయులు శ్రీరమణ, శ్రీ రామకృష్ణ, శ్రీ గాంధీ చరిత్రలనేగాక అచ్చ

తెనుగున సయిత మనేకగ్రంథములను (మొత్తము అరువది గ్రంథములను) రచించిన దిట్టకవి. భావకవి. మధురకవి. సరసకవి. భాగవతము అంతవఱకు యేలకో తెలుగున అనువదింపబడలేదు. నా అదృష్టమేనని పోతన ఉప్పొంగిపోయెను. ఈనాడు నిజముగా యేలకో యింతవఱకు శ్రీవారి దివ్య చరిత్రమున్ను యెవరిచేతను వ్రాయబడలేదు. ఇయ్యది శ్రీ నారు నాగనార్యుల అదృష్టమే అనవచ్చును. ఈ అదృష్టమునకు వారును పోతనవలె ఉప్పొంగుచుండవచ్చు. కాని శ్రీవారి చరిత్రను రచించవలయునను కుతూహలముగల నాబోటి కొందఱికిమాత్రము యీ చరిత్రావిష్కారమునుజూచి యీర్ష్యకలుగకపోదు. కాని 'నాన్ద్యన్తే సూత్రధారః' అన్నటుల యీ శ్రీవారి దివ్యచరిత్ర పద్యాత్మకమగుటచే సంక్షిప్తమే కాబట్టి నియ్యది సూత్రధారవచనమువలె సూచనామాత్రమే కాగలదని ఆశయము. ఇయ్యది పూర్వరంగము మాత్రమే శ్రీ గురుదేవుని అనుగ్రహముచే మహానాటకరూపమగు సువిస్తృత జీవితచరిత్ర మికమీదట త్వరలోనే బహిర్గతము కాగలదని విశ్వాసము. ఈలోపల భక్తులనోదార్చుటకై యీ దివ్యచరిత్రమును రచించిన శ్రీనారు నాగనార్యులు సంస్తుత్యులు. తమ సహజమగు అసహజపదగుంభనమును, అశ్వధాటీసమానమగు కవితాధాటిని నిగ్రహించి, భాషాప్రవేశములేని భక్తులను దృష్టిలోనుంచుకొని సరళమగు శైలిలో రచనను సాగించిన కవివరులు శ్లాఘనీయులు. శ్రీవారి జీవితములోని ముఖ్యముఖ్యఘట్టములు మాత్రము యిందు పేర్కొనబడినవి. పద్యరచన, ప్రబంధరీతి కాబట్టి

యింతకంటె వివరముగ వర్ణించుట కవకాశము లేదు. కాన భక్తులు అది లేదు యిది లేదని శంకింపబని లేదు. కావ్యజీవిత మగు రసోత్కర్షకు న్యూనత నాపాదింపక వివిధాలంకార ములతో నేర్పుతో కావ్యరచనను సాగించిరి. సొంపైన రచనకు భావముతోడై బంగారునకు తావి అబ్బినట్లైనది. భక్తులు తన్మయియా భావముతో పఠించి ఆనందించవలసినదే.

ఈ మహాకవి యీ గ్రంథమును సప్తజ్ఞాన భూమికలను దృష్టియందిడుకొని కాబోలు సప్తఘట్టాన్వితముగ రచించిరి. జ్ఞానభూమికల నధిరోహించిన సాధకుడు మాత్రమే ముక్తి సౌధము నధిరోహించగలిగినటుల యీ సప్తఘట్టాత్మక సంపూర్ణగ్రంథమును పఠించిన మాత్రమున నే పాఠకుడు గురు తత్త్వమును అవగాహన మొనర్చుకొనగలడు. మఱియు దీనిలో ప్రతిఘట్టాంతమున కావ్యరీతిననుసరించి వృత్తమును మార్చుచు అన్నింటిని మకారాది వృత్తములనే (మకారము ఆదిగాగల వాటిని) సమకూర్చుట గొప్పవిశేషము. ఎట్లన (1) ప్రథమఘట్టాంతపద్యము మాలినీవృత్తమును, (2) ద్వితీయ ఘట్టాంతపద్యము మదనదర్పణములోను, (3) తృతీయ ఘట్టాంతపద్యము మత్తకోకిలలోను, (4) చతుర్థఘట్టాంత పద్యము మందాక్రాంతములోను, (5) పంచమఘట్టాంత పద్యము మానినీవృత్తములోను, (6) షష్ఠఘట్టాంతపద్యము మణిభూషణ వృత్తములోను, (7) సప్తమ ఘట్టాంత పూర్వ పద్యము మణిమాలలోను సమకూర్చబడినది. ఇట్లు ఆకస్మిక ముగా సమకూడుట కవిగారికే ఆశ్చర్యకరమైనది. ఇయ్యది గురుకటాక్షములోని మహిమ కావచ్చు. గ్రంథము 'మలయాళ

స్వామి చరిత్ర' కాబట్టి తదనుగుణముగా యీ సప్తమకా రాది వృత్తములుగూడా సమకూడినవి. శ్రీ గురుదేవుని దివ్య నామమే మకారాదియై సర్వమంగళకరమై యొప్పినది. మకా రమే మంగళకరము 'మంగళాదీని మంగళాన్తాని' అన్నటుల ప్రతి ఘట్టాంతమున మంగళకరమగు మకారాది వృత్తము సహజముగ సంభవించుటచే యీ గ్రంథము సర్వజన మంగళ ప్రదమనుటలో సందియము లేదు. అందులకే సద్గురు మంగళా శాసనములో

మఙ్గళం దర్శనం దేవ! మఙ్గళం త్వత్పదాశ్రయః।
మఙ్గళం త్వత్పదస్పర్శో మఙ్గళం తవ భాషణమ్॥
మఙ్గళం తవసాన్నిధ్యం మఙ్గళం తవ సేవనం।
మఙ్గళం త్వత్కృపావాప్తిర్మఙ్గళం తవభక్తతా॥
మఙ్గళం హిత్వదాచారో మఙ్గళం శరణం తవ।
సకలం త్వత్కృపాలభ్యం కృపాపాత్రం హిమఙ్గళమ్॥

అని స్తుతించుట 'మధురాధిపతేరఖిలం మధురం' అన్నటుల శ్రీ గురుదేవునితోటి సంబంధముగలదంతయు మంగళప్రదమే గదా! ఈ మకారాది వృత్తసంఘటనముగూడ నట్టిదే కావచ్చు. ఇంతేకాక గ్రంథాంతమున చిట్టచివరి వృత్తము కవి మహాశయుని స్వకపోలకల్పితమైన 'అసంగానందవృత్తము' నూతనమై ఛందశ్శాస్త్రమునకే నూతన శోభను చేకూర్చు చున్నది. ఇన్నివిశేషములతోగూడిన యీ గురుదేవుల 'దివ్య చరిత్ర' భక్తకోటికేగాక, భాషాకోవిదులగు సాహితీపరులకును

నాదరపాత్రమై చిరకాలము వర్ధిల్లగలదని దృఢవిశ్వాసము. ఇట్టి నూతన చమత్కృతులతో గ్రంథరచనమొనర్చి, భక్తులకు, భావుకులకు, విద్వాంసులకును మనస్సంతోషమును జేకూర్చిన సత్కవిని శ్రీగురుదేవుడు చిరాయురారోగ్యముల' భక్తిజ్ఞానవైరాగ్యముల నితోధికముగా ప్రసాదించి అనుగ్రహించుగాక !

మఱియు నీరచనకై ప్రోత్సహించి ప్రేరేపించిన గురుభక్తియుతులు, విద్యావినమ్రులు, విద్వచ్ఛిరోమణియునగు శ్రీసముద్రాల లక్ష్మణయ్యగారు గ్రంథకారయితలై సమశ్రములై గ్రంథకర్తతోటి సమభాగులైరి. ఉభయుల శ్రమఫలితమే యీ శ్రీవారి మధురతర జీవిత చరిత్రము. గురుపదాభిరతులగు శ్రీలక్ష్మణయ్యగారిని సయితము భక్తిజ్ఞానాభివృద్ధియగునటుల శ్రీగురుదేవుడనుగ్రహించుగాక !

మధురం గురుదేవస్య చరితం మధురాస్పదం ।
నాగనార్యకృతం భూరితాపత్రయ నివారకమ్ ॥
శ్రుతిమాత్రేణ యత్పుంసాం శాన్తిముక్తిప్రదాయకం ।
భక్త్యా శ్రుణుత హేభక్తాః! మధురం మధురాన్వితమ్॥

ఓం జయ్ గురుదేవ్

ఓమ్.

శ్రీ వ్యాసాశ్రమము.
సాధారణ మకరసంక్రాంతి.
14—1—1971.

విమలానందస్వామి.

ఓం

ఓం నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

# నివేదనము

శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు, ఎమ్.ఏ., 'సాహిత్యశిరోమణి'
లెక్చరర్, శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ కాలేజి. తిరుపతి.

ఆత్మస్వరూపులగు సోదరీ సోదరులారా!

భారతదేశమునకుఁ జెందిన పరమోత్కృష్ట సంపదలలో నన్నింటికన్న మిన్నయైనది యధ్యాత్మవిద్యాసంపద. విద్యా తపస్సులచే పూతాత్ములైన మహనీయులెందఱో తమ పుట్టుకచే నీ దేశమునకు పవిత్రతం జేకూర్చి తోడి మానవుల కధ్యాత్మవిద్య నందఁజేసి యదృశ్యులైపోయిరి. అట్టి మహామహుల కోవకుఁ జెందిన యొక మహితాత్ముని దివ్యచరిత్రమే మీ కరకమలముల నలంకరించియున్న యీ భవ్య గ్రంథరాజము.

ఉపనిషద్విజ్ఞానమున కాలవాలమైన భారతభూమిలో సైత మంధపరంపరా ప్రాప్తములై కాలక్రమమున కరుడుగట్టుకొనిపోయిన మూఢాభిప్రాయములను, జడవాదములను నశింపఁజేయుటకు విప్లవాత్మకమగు నొక మహాపరిణామ మత్యావశ్యకమైనది. దానిని సాధించుటకే శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానందస్వామి, నారాయణ గురుదేవుఁడు,

గాంధీ మహాత్ముఁడు, మహర్షి శ్రీ మలయాళస్వాములవారు మున్నగు జ్ఞాననిధులీ యుగమున జన్మించిరి.

శ్రీ శంకరుని జన్మభూమియైన కేరళమున జన్మించి, లేఁబ్రాయముననే వివేకవైరాగ్యములఁ జూఱఁగొని, పాదచారియై సమస్తభారతావనిని తీర్థయాత్రోన్ముఖుఁడై పర్యటించి, చైతన్యవాద నిరోధకములై వివిధరూపముల విలయతాండవమాడుచు భారతజాతిని పట్టి పీడించుచున్న జడవాదముల యొక్క తీరు తెన్నులను చక్కగా నవగతము గావించుకొని, తత్పరిహారణమే తన జీవితలక్ష్యముగా నిశ్చయించుకొని, గోగర్భమున ద్వాదశవర్షములు తీవ్రతపో నిరతుఁడై యుండి యాత్మసాక్షాత్కారమునొంది, పిమ్మట లోకోద్ధరణ కార్యక్రమములకు కేంద్రముగా శ్రీ వ్యాసభగవానుని పేరనొక విశిష్టమగు నాశ్రమమును స్థాపించి, తన సర్వస్వమును బహుముఖముల దీనానాథజనుల సేవకును, తదీయాత్మోన్నతికిని వ్యయించి స్వీయపరమలక్ష్యముల నన్నింటిని సాధించుకొని తుదకు భౌతికకాయమును పరిత్యజించిన యవతారపురుషుని జీవితచరిత్రమగు నీ గ్రంథరాజమాంధ్ర సాహిత్యమున కొక యపూర్వాలంకారమై వెలుగొందఁగలదు.

జాత్యహంకారుల స్వార్థభావము, శుష్కవేదాంతుల నిరర్గళప్రవర్తన, ఆత్మవికాసావకాశమునకు నోచుకొనని స్త్రీ శూద్రాదుల దయనీయ స్థితి, ఆధ్యాత్మిక జ్ఞాన గంధ

విసుమంతయు లేని సంసార తాపతప్తుల యార్తనాదము మున్నగు శోచనీయావస్థలే 'చరాచరసుఖాభిలాషి'యగు శ్రీ మలయాళయతీంద్రుని లోకోద్ధరణమునకు పురికొల్పినవి. అపారమైన తపోబలము, అకలంకమగు ననుష్ఠానము, హేతువాదముతో మేళవింపఁబడిన శాస్త్రవాదము, ఆశ్రమస్థాపన గ్రంథవిరచన – వేదాంతసభానిర్వహణ–గీతాప్రచారాద్యనేక నిర్మాణాత్మక కార్యక్రమములును శ్రీ గురుదేవునకు పై పరిస్థితుల నెదుర్కొనుటలో పరమ సాధనములైనవి. విప్లవాత్మకమైన తనను హోద్యమము ఫలవంతమగుటను కన్నులారఁగాంచి యానందించిన కారణజన్ముఁడు గదా శ్రీ గురుదేవుఁడు! 'భగవద్గీతకు భాష్యమే శ్రీ మలయాళస్వామి జీవితమ'ని పలికిన శ్రీ శివానందయోగీంద్రుని పలుకులు సదా స్మరణీయములు. కేరళమున జన్మించియు శ్రీ సద్గురుమూర్తి యాంధ్రభూమిని తన యాధ్యాత్మిక సేవాక్షేత్రముగా నెన్నుకొనుట ఆంధ్రప్రజల యనంత సుకృతఫలమని చెప్పక తప్పదు.

బుద్ధతుల్య చరిత్రుండగు నీ 'చరాచర సుఖాభిలాషి' జీవిత చరిత్రమేనాడో వెలువడి యుండవలసినది. కాని స్వోత్కర్షము నేమాత్రము సహింపని యమ్మహాత్ముఁడెంద ఱెన్నివిధముల వేడినను తన జీవితచరిత్రమును ప్రకటించుట కంగీకరింపక పోయెను. కావున వేలకొలది భక్తజనుల కోరిక నేఁటివరకు తీరకయే పోయినది. సుసమగ్ర

ముగా గాకపోయినను సాధ్యమైనంతవఱకు సర్వాంగసుందర
ముగా నేటి కీచరిత్రము వెలువడుటెంతో ముదావహము.

ఈ గ్రంథకర్త యాధునికాంధ్రకవులలో నగ్రశ్రేణికి చెందినవారు. ఇది వీరి యిరువది యొకటవకృతి యనుటచేతనే ఆంధ్రసాహిత్యరంగమున వీరికిఁగల స్థానమెట్టిదో స్పష్టము కాగలదు. స్వతంత్రముగా ననేకగ్రంథములను రచించుటయే కాక మనుచరిత్ర-పారిజాతాపహరణాది గ్రంథముల నచ్చ తెనుఁగున రచించి పేరుగన్న వీరి కవితాప్రతిభ యనన్య సామాన్యమైనదని ప్రశంసకెక్కినది. గోగర్భమున తప మొనర్చుచుండిన కాలమునందే శ్రీ గురుదేవునితో వీరు పరిచయము కలిగించుకొని యత్యంతభక్తితో శ్రీవారిని భజించుచుండిరి. ఈ మహాకవిపై నాకుఁగల ప్రగాఢ గౌరవమును. వీరికి నాపైఁగల యవ్యాజానురాగమును పురస్కరించుకొని శ్రీ వ్యాసాశ్రమ పూర్వవిద్యార్థినగు నేను శ్రీ గురుదేవుని చరిత్రమును కావ్యరూపమున రచించుడని వీరిని సవినయముగా ప్రార్థించితిని. అంతకుముందే వారి హృదయగతమగు నీ సంకల్పము నా ప్రార్థనతో కార్యరూపముఁదాల్చినది.

ముఖ్యముగా శ్రీ గురుదేవుని 'బాలయోగిని' మున్నగు రచనలను, ప్రామాణికులైన తదంతరంగ భక్తుల వచనములనుమూలముగాఁ జేసికొని రచింపఁబడిన యీ గ్రంథము పూజ్యపాదులు శ్రీ విమలానందస్వాములవారి సూచనల ననుస

రించి చక్కగా పరిష్కరింపఁబడినది. ఏతద్గ్రంథమాలమున శ్రీ నారు నాగనార్యులవారు శ్రీ గురుదేవుని దివ్యానుగ్రహమునకు సంపూర్ణముగా పాత్రులగుటయేకాక తద్భక్తుల హృదయములలో శాశ్వతమైన స్థానమును సంపాదించుకొన్నారు.

పూజ్యపాదులు శ్రీ విమలానందస్వాములవారి సత్సంకల్ప ఫలముగా త్వరలో సరళసుందరమైన గద్యరూపమున సువిశదముగా వెలువడనున్న శ్రీ గురుదేవుని జీవిత చరిత్రమునకు గద్యపద్యాత్మకమై కావ్యధోరణిలో సాగిన యీ కృతి పూర్వరంగమును సిద్ధపఱచుటలో కృతకృత్యమైనది. కాన భక్తుల యాదరణమునకు పాత్రము కాగలదనుట నిస్సంశయము.

తిరుపతి,
7-11-1970.

ఇట్లు,
శ్రీ సద్గురు చరణపరాగము,
సముద్రాల లక్ష్మణయ్య.

నమః శ్రీమాత్రే



# కవి నుడి

అధ్యాత్మ విజ్ఞాన సుశోభితులగు పాఠకమహాశయులారా!

మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వామి చరిత్రమను "అసంగానంద విజయము" 1969 సంవత్సరముననే విరచింపఁబడెను. అంతకు ముందే (1) శ్రీ రమణ (2) శ్రీ రామకృష్ణ (3) శ్రీ గాంధీమహాత్మ — చరిత్రములఁ బద్యకావ్యములుగా వ్రాసియున్నందున, శ్రీ స్వామివారి జీవిత చరిత్రమునుకూడా వ్రాసిన బాగుండునని సర్వదా సర్వథా భావించుచుంటిని. ఇంతలో — శ్రీ సముద్రాల లక్ష్మణ శిరోమణి M.A., గారి ప్రేరణాబలమున నచిరకాలములోనే వ్రాసి ముగించి శ్రీ గురుదేవుని — పుణ్యారాధనములలో 1, 2 పర్యాయములు, కావ్యగాన మొనర్పఁబడినది. పలువురు భక్తులు — శ్రవణమాత్రమున నానంద తుందిలహృదయులైరి. నాకు నుత్సాహము పొంగిపొరలినది. ఏతద్గ్రంథముం బ్రకటింప శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులగు — శ్రీ శ్రీ శ్రీ విమలానందస్వాములవారిని వేడికోలొనర్పఁ దక్షణమ వారంగీకారముద్ర నొసంగిరి. దీని

యందు మార్పులు చేర్పులు - తీర్పుల విషయమై శ్రీ స్వామి వారెంతయేని దోడ్పడిరి. మఱియు నియ్యది రచనము మొదలిడి తుది యగు దనుక, శ్రీ సముద్రాల లక్ష్మణ శిరోమణి యనన్యగురుభక్తియుక్తుఁడయి సహకార సంపత్సమృద్ధు లొడఁగూర్చుటచే వారికి నేనెంతయు ఋణపడియున్నాఁడ. ఇట్టి మిత్ర సత్తమునికి శ్రీ సద్గురుఁడాయురారోగ్య భాగ్యము లితోధికముగా నొసంగి రక్షించు గాత! ఇఁక నేతద్గ్రంథ ముద్రణావసర ద్రవ్య మొసంగిన వదాన్య శేఖరులకా గురు వరేణ్యుం డఖిల భోగ భాగ్య విభవ విజ్ఞాన పరంపర లొసంగి కాపాడుఁగాతమని యర్థించుచు, నింతటితో లేఖినికి విశ్రాంతిఁ గల్పించుచున్నాఁడను.

ఇట్లు,
సుధీ విధేయుఁడు,
పండిత నారునాగనార్య.

శ్రీ వ్యాసాశ్రమము,
1-11-1970.

ఓం తత్సత్.

శ్రీ

# ప్రకాశకుల మనవి



పరిశుద్ధజ్ఞానస్వరూపులగు ఆత్మసోదరీ సోదరులారా!

కరుణామూర్తియగు సర్వేశ్వరుని కృపచేతను, లోకపావనతత్పరులగు మహర్షుల కరుణచేతను, శ్రీ గురుదేవుని దివ్యానుగ్రహముచేతను యీ నాటికి శ్రీ గురుదేవుని దివ్య చరిత్రమును (పద్యకావ్యమును) భక్తులకందించు సదవకాశము గలిగినందులకెంతయు సంతసించుచున్నాము. ఇంతవఱకు యెంతోమంది పరిచితులు అపరిచితులు శ్రీవారి జీవిత చరిత్రమేదేని గలదా అని అడుగుచుండిరి. శ్రీవారి నిర్యాణానంతరము భక్తుల జిజ్ఞాస మఱింత అధికమైనది. శ్రీ విమలానందస్వాములవారు అందుకై ఉద్యుక్తులయ్యు అంతకన్న ముఖ్యమగు శ్రీవారి అధిష్ఠాన మందిర నిర్మాణమునందు సంలగ్నులై యున్నందున యింతవఱకు చరిత్ర రచనా కార్యమును నిర్వర్తింపజాలరైరి. కాని యింతలో సద్గురు ప్రేరణచే పండిత సత్కవి శ్రీ నారునాగనార్యులుగారు యీ సత్కార్యమును పూరించి భక్తుల హృదయమునకు ఆనందమును చేకూర్చినందులకు వారెంతయు శ్లాఘనీయులు. శ్రీవారు

గోగర్భమునందున్నప్పటినుండియు నాగనార్యులుగారు శ్రీవారితో పరిచయ భాగ్యము గలవారగుటచే శ్రీవారి పునీత జీవితమును బాగుగ నవగాహనమొనర్చుకొన్న ధీశాలురు. అందుకనియే గ్రంథము స్వాభావికేతివృత్తముతో అతిశయోక్తిరహితముగ నడచినది.

రెండు సంవత్సరముల క్రితము శ్రీవారి పుణ్యారాధన శుభసమయమున సంక్షిప్తముగ భక్తులకీరచన వినిపింపబడగా నందఱును మిక్కిలి యానందించి కవిగారి మనమున కెనలేని యుత్సాహమును గూర్చిరి. తదుత్సాహ ప్రేరణలతో యీ సంవత్సరము అష్టమ పుణ్యారాధన శుభసమయమున గ్రంథము పూర్తి జేయబడి అందు ముఖ్యఘట్టములు వినిపింపబడినవి. శ్రీవారి చరిత్ర యను సంగతి దెలియుటతోడనే భక్తులెల్లరు దీని ముద్రణకై యథోచితముగా శక్తికొలది విరాళముల నొసగి మఱింత ఉత్తేజమును గలుగజేసిరి. కవిగారి ఉత్సాహము, రచనా ప్రవణత, భక్తుల ఉత్ప్రేరణ వీటితో యీ నాటికీ గ్రంథమీరీతిగ భక్తులముందుంచబడుచున్నది. ఉదారులగు ఆ భక్తుల పేర్లు యితరత్ర ప్రకటింపబడినవి. ప్రతి గురు కార్యమునందును తృణమో పణమో తమది చేరవలయునను ఉత్సాహముతో, భక్తితో, అహ

మహిమకై భావముతో ముందంజ వేయుచు చేయూత నిచ్చుచున్న భక్తజనుల నందఱిని శ్రీ గురుదేవుడు కరుణతో ననుగ్రహించుగాక! మఱియు చిరవాంఛితమగు యీ పవిత్ర చరిత్రను పఠించి, స్మరించి భక్తులు ధన్యులు కాగలరని విశ్వాసము.

ఈ గ్రంథ రచనతో శ్రీ వ్యాసాశ్రమ ప్రచురణలలో గల లోటును దీర్చి గ్రంథమును నిస్స్వార్థభావముతో గురు సేవాసక్తత మొనర్చిన ఉదార చరితులగు మహాకవి శ్రీ నారు నాగనార్యులను శ్రీ గురుదేవు డనుగ్రహించుగాక!

కరుణామూర్తియగు సర్వేశ్వరుని కృపచే లోకములో శాంతియు, కరుణయు, సద్భక్తియు, విరక్తియు విజ్ఞాన బోధయున్ను వర్ధిల్లునుగాక!

ఓం లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు

ఓం శాంతిః శాంతిః శాంతిః

॥ ఓం తత్ సత్ ॥

శ్రీ వ్యాసాశ్రమము
సాధారణ మకర సంక్రమణము
14–1–1971 } ప్రకాశకులు.

ఓం

"ఓం నమో భగవతే శ్రీ మలయాళయతీంద్రాయ"

# శ్రీ గురుదేవుని దివ్యచరిత్ర ముద్రణకై విరాళములొసంగిన పుణ్యాత్ముల పేర్లు.

1. శ్రీ బి. పార్వతమ్మగారు, పులిచర్లపోస్టు, చిత్తూరుజిల్లా. 216_00
2. ,, పరమేశ్వరస్వాములవారు – శ్రీ వ్యాసాశ్రమము. 116_00
3. ,, మన్నెం సీతారామమ్మగారు. ,, 116_00
4. ,, [illegible] రెడ్డి, బి. చంద్రశేఖరరెడ్డిగార్లు ,, 116_00
5. ,, కె. చంగల్రాజు, రామచంద్రరాజుగార్లు. ,, 116_00
6. ,, ముప్పాళ్ళ రామమ్మగారు. ,, 116_00
7. ,, మద్దాల రామమ్మగారు. ,, 116_00
8. ,, నెల్లూరు పుల్లమ్మగారు. ,, 116_00
9. ,, గౌతమీబాయమ్మగారు. ,, 116_00
10. ,, సముద్రాల లక్ష్మణయ్యగారు లెక్చరర్, శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ కాలేజి_తిరుపతిపోస్టు, చిత్తూరుజిల్లా. 116_00
11. ,, పి. రామచంద్రయ్య, పి. సుబ్రమణ్యంగార్లు, కాళహస్తి. 116_00
12. ,, బిరుదవోలు పిచ్చమ్మగారి కుమార్తె శ్రీ సుబ్బమ్మగారు, గాంధీవిహార్_కసుమర్రిపాడు, నెల్లూరుజిల్లా. 116_00
13. ,, శ్రీ మలయాళస్వామి, ఓరియంటల్ కాలేజి సంఘం, ప్రొద్దుటూరు. 116_00
14. ,, డాక్టరు వి. రామాచారిగారు, ఓం వైద్యశాల షాద్‌నగర్, మహబూబ్‌నగర్ జిల్లా. 116_00

15. శ్రీ గూడవల్లి - మహాబాల త్రిపుర సుందరమ్మగారు c/o
శ్రీ టి-ఆర్-చౌదరిగారు, బి. ఏ., బి. ఎల్., 1-87
ఉప్పలరోడ్డు, లాలాగూడ - సికింద్రాబాద్ - 17. 116-00

16. ,, కంచర్ల శారదాంబగారు. కోలవెన్ను, కృష్ణాజిల్లా. 116-00

17. భువనగిరి వీరయ్యగారు, నాగార్జునసాగర్, నల్గొండజిల్లా. 116-00

18. ,, వి. వాసుప్రసాద్ గారు, చూలై - మదరాసు - 7. 116-00

19. ,, వి. కల్యాణబాయమ్మగారు, చూలై - మదరాసు-7. 116-00

20. ,, ముప్పాళ్ళ రంగారెడ్డిగారు, ఏకొల్లుపోస్టు, నెల్లూరుజిల్లా. 116-00

21. ,, కొండా నారాయణమ్మగారు, కొండావారిపాళెం,
నెల్లూరుజిల్లా. 116-00

22. ,, పి. చెంచు సుబ్బమ్మగారు, ఎమ్. ఏ. పి. హెచ్. డి.
నెల్లూరు. 116-00

23. ,, చోడే వెంకటరమణమ్మగారు, అనపర్తిసావరం
అనపర్తిపోస్టు, తూర్పుగోదావరిజిల్లా 116-00

24. ,, పేట సుబ్రహ్మణ్యంరెడ్డిగారు, రాఘవవారిపాలెం
ఆదూరుపోస్టు. నెల్లూరుజిల్లా. 116-00

25. ,, బండారు నరసమ్మగారు, పణతులవారివీథి - నెల్లూరు. 116-00

26. ,, శ్రీ తోట్టెంపూడి నాగాచ్యుతకుమారిగారు,
శ్రీ మైత్రేయాశ్రమం గూడవల్లిపోస్టు, తెనాలి
తాలూకా గుంటూరుజిల్లా. 116-00

27. సాగి చినవెంచెలునాయుడుగారు, ధర్మపత్ని
శ్రీ వజ్రమ్మగారు. మల్లిమాలపోస్టు, నెల్లూరుజిల్లా. 116-00

28. ,, జలగం రామనాథంగారి ధర్మపత్ని శ్రీ భూదేవమ్మ
గారు, పెన్నలపాడు, చిత్తూరుజిల్లా. 116-00

29. ,, పార్లపల్లి కాంతమ్మగారు, పెనుబర్తి మాదరాజు,
గూడూరుపోస్టు నెల్లూరుజిల్లా. 116-00

30. శ్రీ పెండ్లూరి శేషమ్మగారు, ఈశ్వరవాకపోస్టు, వయా
గూడూరు నెల్లూరుజిల్లా. 116_00

31. ,, కళత్తూరు వజ్రమ్మగారు, ఏకొల్లు - నెల్లూరుజిల్లా. 116_00

32. ,, చెరుకు కుమారస్వామిగారు వారి ధర్మపత్ని
శ్రీ చెల్లెమ్మగారు, పూడి చిత్తూరుజిల్లా. 116_00

33. ,, చెరుకు పెదపేరమ్మగారు, పూడి చిత్తూరుజిల్లా. 116_00

34, ,, గంగా లక్ష్మీనారాయణగారు, వారిధర్మపత్ని
శ్రీ బసవమ్మగారు, (వారి కుమారుడు శ్రీ శేషగిరిరావు
గారి సంస్మరణార్థం) శ్రీ వ్యాసాశ్రమం. 116_00

35. ,, యలకుర్తి వెంకట్రామయ్యగారు, (దిండిప్రాజెక్టు)
గుండాలపల్లిపోస్టు, దేవరకొండ తాలూకా
నల్గొండజిల్లా. 100_00

36. ,, కుమార్తె అన్నపూర్ణమ్మగారి సంస్మరణార్థము
తెలుగు లెక్చరర్ సాయం నారాయణచరణంగారు
శ్రీ మలయాళస్వామి, ఓరియంటల్ కాలేజి -
ప్రొద్దుటూరుపోస్టు, కడపజిల్లా. 58_00

37. ,, నామా యెరికలయ్యగారు, శ్రీ కృష్ణగీతాశ్రమము
ప్రొద్దుటూరు, కడపజిల్లా. 58_00

38. ,, శ్రీపురం రాజమ్మగారు, జెండావీధి చిత్తూరుజిల్లా. 58_00

39. ,, చెరుకు లక్ష్మయ్యనాయుడుగారి ధర్మపత్ని
శ్రీ వెంకటసుబ్బమ్మగారు, పూడి చిత్తూరుజిల్లా. 58_00

40. ,, పొన్నవోలు వెంకటసుబ్బమ్మగారు, c/o
శ్రీ బి. కృష్ణారెడ్డిగారు, గూడూరుపోస్టు, నెల్లూరుజిల్లా. 58_00

41. ,, ముప్పాళ్ళ దత్తయ్యగారి ధర్మపత్ని శ్రీ శ్రీదేవమ్మగారు,
అగ్రహారపేట నాయుడుపేటపోస్టు, నెల్లూరుజిల్లా. 58_00

42. శ్రీ వేమల పుల్లమ్మగారు, కోనుమళ్ళవారివీధి. కావలి పోష్టు, నెల్లూరుజిల్లా. 58_00

43. ,, చేబర్లు సుబ్బమ్మగారు, C/o రమణవిలాస్, ట్రంకురోడ్, నెల్లూరుజిల్లా. 58_00

44. ,, ఎస్. రుక్మిణమ్మగారు, గర్నిమిట్ట, కడపజిల్లా. 58_00

45. ,, అయ్యపు రామలింగారెడ్డిగారు, మిట్టపల్లి, కరసనపల్లి_పోష్టు, పుంగనూరు తాలూకా చిత్తూరుజిల్లా. 50_00

46. ,, దేవా సుబ్బమ్మగారు, పెదినేనికాల్వ_పోష్టు, కడపజిల్లా. 50_00

47. ,, కోశా ఆండాలమ్మగారు. శ్రీ వ్యాసాశ్రమము 50_00

48. ,, మాప్పాళ్ళ శేషమ్మగారు ,, 50_00

49. ,, చింతల చలమయ్యగారు, ఘంటసాలపాలెం, కృష్ణాజిల్లా. 50_00

50. ,, కె. వెంకటరెడ్డిగారు _ టీచరు, శ్రీ వ్యాసాశ్రమము. 80_00

51. ,, గంప నరసింహులుగారు, [illegible] (వయా) కల్వకుర్తి, మహబూబ్ నగర్ జిల్లా. 25_00

52. ,, కె. కృష్ణారెడ్డిగారు, (వయా) కల్వకుర్తి, మహబూబ్ నగర్ జిల్లా. 25_00

53. ,, వ్యాసా అన్నపూర్ణమ్మగార్లు, శ్రీ వ్యాసాశ్రమము. 25_00

54. ,, నల్లూరు కాంతమ్మగారు, పెదరావూరుపోష్టు, తెనాలి. 25_00

55. ,, పొన్నితోట సుబ్బమ్మగారు, జమలమడుగు. 25_00

56. ,, ఆరువేల రంగమ్మగారు _ పూడి, చిత్తూరుజిల్లా. 25_00

57. ,, గుమ్మళ్ళ పద్మమ్మగారు, పల్లిపాలెంపోష్టు, నెల్లూరుజిల్లా. 25_00

58. ,, [illegible] కృష్ణమనాయుడుగారు ,, ,, 25_00

59. ,, [illegible] దినటిక్కమ్మగార్లు, [illegible] పోష్టు, నెల్లూరుజిల్లా. 25_00

60. శ్రీ పేట వరలక్ష్మమ్మగారు, రాయవారిపాలెం, అయోధ్యపోస్టు, సూళ్ళూరుపేట - తాలూకా, నెల్లూరుజిల్లా. 25_00

61. ,, సాధు విరక్తిబాయిగారు, అనకాపల్లి పోస్టు, విశాఖపట్టణం జిల్లా. 25_00

62. ,, ముదనూరు సుబ్బరామరాజుగారు వారి ధర్మపత్ని శ్రీ పద్మావతిగారు, కోనేటిరాజుకండ్రిగ - పోస్టు, (వయా) రైల్వే కోడూరు, కడపజిల్లా. 20_00

63. ,, కొరడూరు జోసెఫ్ గారు, టీచరు, బాపట్ల. 20_00

64. ,, వేగూరు రమణమ్మగారు, బాలిరెడ్డిపాలెం - పోస్టు, కోవూరు తా॥ నెల్లూరు జిల్లా. 20_00

65. ,, కిలారు రామకోటయ్యగారు, [illegible] - పోస్టు, కృష్ణాజిల్లా. 20_00

66. ,, క. వీరాస్వామినాయుడుగారి ధర్మపత్ని శ్రీ క. సరస్వతమ్మగారు పల్లెలపప్పం, మేలుపట్టిపోస్టు, గుడియాత్తం తా॥ నార్త్ ఆర్కాడ్ జిల్లా. 20_00

67. ,, డి. రామయ్యనాయుడుగారు వారి ధర్మపత్ని శ్రీ సరోజమ్మగారు. పల్లెలపప్పం, మేలుపట్టి - పోస్టు, గుడియాత్తం తా॥ నార్త్ ఆర్కాడ్ జిల్లా. 20_00

68. ఇంటూరి రామస్వామినాయుడుగారి ధర్మపత్ని శ్రీ తులశమ్మగారు, పల్లెలపప్పం, మేలుపట్టి_పోస్టు, గుడియాత్తం తా॥ నార్త్ ఆర్కాడ్ జిల్లా. 20_00

69. ,, పెల్లేటి రామలక్ష్మమ్మగారు, శ్రీ వ్యాసాశ్రమం. 12_00

70. ,, తూము హైమవతమ్మగారు, మామిళ్ళగూడ, ఖమ్మం. 10_00

71. ,, అప్పిశెట్టి సుశీలమ్మగారు, సూర్యారావుపేట, విజయవాడ. 10_00

72. శ్రీ చినమాండ్ల రంగయ్యగారు, నాగిళ్ల - పోష్టు, (వయా) చింతపల్లి, దేవరకొండ తా॥ నల్గొండజిల్లా. 10-00

73. ,, అరిగెల ఈశ్వరమ్మగారు, రామలింగాపురం, 16-వ వార్డు ఇంటి నెం. 441., నెల్లూరు. 10-00

74. ,, బెలిదె నారాయణగారి కృష్ణయ్యగారు, చినతూండ్ల గ్రామం, [వయా] యాచారం - ఇబ్రహీంపట్నం తా॥ హైదరాబాద్ జిల్లా. 10-00

75. ,, గరికిపాటి బుల్లి వీరమ్మగారు, కాకుల ఇల్లింద్రపురం - పోస్టు, పశ్చిమ గోదావరిజిల్లా. 10-00

76. ,, బండా వెంకాయమ్మగారు, అలంపురంపోష్టు, ప.గో. జిల్లా 10-00

77. ,, అల్లూరి సుందరరామిరెడ్డిగారు, చెన్నూరుపోష్టు, నెల్లూరు జిల్లా. 10-00

78. ,, కొత్తపల్లి అన్నపూర్ణమ్మగారు, పెదరావూరు, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా. 5-00

79. ,, కన్నెగంటి వెంకటేశ్వరరావుగారు, కో-ఆపరేటివ్ సెంట్రలు బ్యాంక్, తెనాలి, గుంటూరుజిల్లా. 5-00

80. ,, సి. మాణిక్యంగారు, శ్రీ వేదవ్యాస ప్రెస్ మేనేజరు - చిత్తూరు. 5-00

81. ,, జి. వెంకటసామినాయుడు. శ్రీ వెంకటేశ్వర సంస్కృతోన్నతపాఠశాల, శ్రీ వ్యాసాశ్రమం-పోష్టు, చిత్తూరుజిల్లా (ఆం. ప్ర.) 5-00





మహర్షి సద్గురు

# శ్రీమలయాళస్వామిచరిత్రము

అను

# అసంగానంద విజయము

## ప్రథమ ఘట్టము

—: ప్రార్థనము :—

శ్రీలోకత్రయముఁ సృజింపఁ బ్రకృతి
శ్రీతోడు నీడై విశి
ష్టాలోక ప్రభవైక రక్షిత జగ
ద్వ్యాపార పారంగతుం
డై లోకేశ్వరుఁడై విరాట్టయి విభుం
డై స్వప్రకాశుండునై
త్రైలోక్యాధిపుఁడౌ మహేశుఁడు సమ
స్తక్షోణి రక్షించుతన్
శ్రీ మలయాళ సద్గురు వ
రేణ్యా! లసద్గుణగణ్యా! ధర్మసం
గ్రామ శరణ్యా! లోకహిత
కార్యకళా విభవానుగుణ్యా! జ్ఞా

నామృతతత్త్వబోధ సము
దగ్రవదాన్య! నిరూఢమాన్య! యో
స్వామి! రచించి తెచ్చితి భ
వచ్చరితమ్మిదె కొమ్ము సత్కృపన్. 1

—: కృత్యాది :—

అవధారు! దేశికాగ్రణి
భవదమలచరిత్ర తెలుగు ప్రజ తెలియంగన్
మిపుల రచించెద భక్తి
ప్రవణుఁడనై తెలిసినంతవఱకోర్మి మెయిన్. 2

కానుక లగ్రహారములుఁ
గాంచనరత్న విభూషణమ్ము లే
వేనియుఁ గోర నా మది నో
కించుక యీ భవబంధ బంధుర
గ్లాని నికృష్టకష్టము లె
కాయెకిఁ బో విరఁజిమ్మి కౌతుక
శ్రీ నిరవద్య సంస్థితికిఁ
జేర్చుటయే పదివేలు సద్గురూ! 3

సుకవీంద్రుల్ నుతిసేయఁజాల్ సుకృతుల
చ్చుం గుప్పనై వ్రాసిమున్
ప్రకటింతున్ మదిఁ దావకీనచరితా
ర్థ ప్రాజ్యసామ్రాజ్య మే

లోకో నిర్మింపఁ దలంపు పెంపుఁగొని నా
లోఁ బీటవెట్టిన్ కథా
నిక వోలెన్ రచియించి నేఁడు భవదం
తేవాసి నౌదున్ గురూ! 4

ప్రాచీనలక్షణాఢ్యము
లౌచిత్యసమన్వితమ్ము - లార్యుని కవితల్
శ్రీ చిక్కణ రసతుందిల
మై చవులెసఁ గొలుపు రసికు - లగు పఠితలకున్. 5

విదితావిదిత విషయములు
పదనిచ్చి రచింప సాధ్య - పడ దేరికిఁ బె
ల్లిదము స్వతఃస్ఫురణమ్మగు
హృదయంగమ కవిత దానిఁ - గృప నిమ్ము గురూ! 6

శ్రీరామకృష్ణ చరితము
శ్రీరమణ చరిత్ర భరత - చింతామణి గాం
ధీ రమ్యచరిత వ్రాసితి
నారయ నీ చరిత వ్రాయ - నారంభింతున్. 7

నా యనుభూతికిఁ దవిలిన
భూయశ్చరితలఁ జతుర్థ - మును వ్రాయుదు నిం
దే యెడ నెరసులు బెరసిన
నా యవిధే యని క్షమించి - ననుఁ బ్రోవు గురూ! 8

అరువది యొకటవ కబ్బము
దొరకొంటిన్ వ్రాయఁ గరుణ – తోఁ బరిపూర్తిన్
బొరయింపుము భక్తజనా
దరమేదుర సాధుబోధఁ – దని సనగ గురూ! 9

పెక్కు దినాలనుండి వల
పించి ననుం ద్వరపెట్టు కోర్కె నేఁ
డిక్కరణిన్ ఫలించెను మ
దీయుఁడు సంద్రము లక్ష్మణుండు స
మ్యక్కృతి కిచ్చఁ గోరె మధు
మాసవిశేషవికాసిత ప్రసూ
భాక్కమనీయ సౌరభ వి
భావితనవ్యకృతిన్ రచించెదన్. 10

రసికుల తల లూపింపని
పసలేని కవిత్వమేల? పసరము తవుడున్
మెసవదె? పసిగలదే? య
ప్పసము రసాభ్యుచితభావ – బంధము లేమిన్. 11

ఏనొక గొప్పవాఁడనని
యీ నలుదిక్కుల నన్ను మించువాఁ
డేని యొకండు లేడని మ
దించి కృతిన్ విరచించి సద్యశ

మూర్ఖానఁ దలంపు నింపను గు
　　రూ! తెలుఁగంచులు నాల్గు నించు వై
జ్ఞానిక తత్త్వబోధ లిటు
　　జాగృతిఁ గూర్చి హృదంతరమ్మునన్. 12

—: భూమిక :—

రమణం తేవసదగ్రగామి బహుధ
　　ర్మాధర్మమర్మజ్ఞతా
విమలోదాత్తమనీషి తత్త్వవిషయా
　　న్వేషి ప్రధానుండు ని
స్సమ నానాకృతి శిల్ప పారగుఁడు ప్ర
　　జ్ఞాప్రాభవాధిక్యుఁడౌ
గమ సంవిన్మతి నాగనార్యకవి యీ
　　కావ్యమ్ము నిర్మించెదున్. 13

కంటికిఁ గానవచ్చిన జ
　　గమ్ము తెలుంగు వెలుంగుఁ జూడ నీ
వంటి ప్రజాహితైషు లొక
　　వంకఁ బొనర్చిన మేల్మి దప్ప నే
యంటును సోంటుఁ గానఁబడ
　　దద్దిర! త్వన్మహిత ప్రబోధమిం
టింటి వెలుంగు దివ్వె యయి
　　యీడితవాంఛలు గూర్చె సద్గురూ! 14

శాంతికి జన్మభూమి విల
సద్గుణరాశికి నాలవాలముఁ
దాంతికి నాటపట్టు నిజ
ధర్మము పుట్టిన తావు ప్రేమకుఁ
సొంత బిడారు పట్టుదల
చొక్కపు టిక్కయహింసకాది సి
ద్ధాంతము నీకు నీవె సరి
తత్త్వసమీక్షణమందు సద్గురూ ! 15

ఎన్నోసంస్థలు పేరు పెంపున పురా
యించెఁ మహోచ్చస్థితిఁ
గన్నాకా భవదాశ్రమమ్మునకు వ
ర్ణించంప నొక్కండు లే
దున్నాయస్థితి వెల్గఁజాలునది నీ
యుత్సాహ దీక్షావిధా
నౌన్నత్యంబుల కేది సాటి? మహితాం
ధ్రం బెంత ధన్యంబొకో ! 16

నిన్నెట్టుల్ మఱువంగఁజాలుదుము తం
డ్రీ ! యాంధ్రిలో జ్ఞాన భి
క్షన్నొక్కల్పిన వాఁడవీవకద ! నీ
జ్ఞానప్రబోధమ్ము లే

కున్నన్ భౌతిక భోగ లాలసత మో
యుక్తుల్ స్వబోధక్షుధా
పన్నుల్ మన్ననఁబుఱింగి పోరెద పరత
త్త్వాలోక శూన్యాత్ములై ! 17

వానకుఁ దడియని వాఁడును
నీ నీతిని వినని వాఁడు - నేఁడాంధ్రి నొకం
డైనను గలఁడే వ్రేలిడి
జూపగఁ జూపించుటకు న - సంగానందా ! 18

నీయుపదేశవాక్యములు
నిత్యనవీనము లాశ్రితాళికిన్
ధ్యేయములున్ బ్రపన్నులకు
దివ్యదఖండపరార్థ విజ్ఞతా
ధ్యేయములున్ కళాత్మక ని
ధి ప్రతిమానము లార్ష భావ సం
ధాయకముల్ మహోపకృతి
దాయకముల్ బహుళాయముల్ గురూ ! 19

అలసాలోలమరుత్కుమార పరిరం
భానూన సౌఖ్యమ్ము ను
జ్జ్వల కర్పూర పరాగపాండుర రుచుల్
బ్రాలేయవార్బిందు బృం

దల సత్సార విశేషమైనఁ గొఱఁతయై
తక్కుక్ భవన్మాధురీ
లలితామోద సుధావచో గరిమకుఁ
లాతుల్ వినోదింపఁగన్. 20

పలువితముల్ వెతల్పడి త
పం బొనరించి లభించు శాంతి మం
జుల సుధఁబంచిపెట్టు గురు
సూక్తులఁ బ్రాగ్భవపుణ్యకర్మ ని
శ్చల మతిమై వినం గలుగు
సాధులు జన్మనిరోధులెట్టి నో
ములు బొనరించిరో యెఱుఁగఁ
బోలునె శాంతినిధాన! సద్గురూ! 21

గురుని కటాక్ష వీక్షణము
కొంత లభించిన వారు దవ్వు ద
గ్గఱ యని పేదసాదయని
కార్మికకర్షకులంచు భేదముల్
పొరయక సర్వతోముఖ వి
భూతి యెసంగఁ బ్రశాంతిజీవన
స్ఫురణము నొందుచుందు రను
భూతిఫలమ్మగుఁగాదె సద్గురూ! 22

గోగర్భాంతర సన్నివేశమున మఱి
గోప్యమ్ము లెన్నెన్ని యో
యాగర్భోక్తిఁ బల్కినట్టి వర రే!
యామూల చూడమ్ము మా
ర్గోన్నాగ స్వాత్మగుహాంతరాళమునఁ ద్వ
ద్బోధోల్లసద్గాథ లే
యోగీశా! గుణపారసూత్రమయి ని
త్యోపాధి పాత్రంబగుఁ. 23

సభలఁ జర్చల వేదికాంతరములఁ
జాత్యున్నతోద్దేశ వా
గ్విభవమ్ముల్ ప్రబలాధి వక్తలయి సం
ప్రీతిఁ వివాదింపనౌ,
నభముఁ బ్రీల నుపన్యసింపనగు నె
న్నఁ సత్క్రియాధుర్య కా
ర్యభరమ్మాని జయించుటన్న యతివ
ర్యా! నీక చెల్లుంజుమీ! 24

నిజముం జెప్పిన నిష్ఠురమ్మయినఁ గా
నీ జాత్యహంకారులౌ
కుజనుల్ సేయు దురుద్యమమ్ముల నెదు
ర్కొన్నట్టి మన్నట్టి నీ

విజయమ్ములఁ బ్రియసూక్తులఁ మఱువఁగా
　　వీలౌనె? యస్మాదృశుల్
సుజనాగ్రేసర ! దీనమానవజన
　　స్తోమైకరత్నామణీ ! 25

ఎక్కువయగు మా కులమని
తక్కిన కులముల నడంచి తామేల్బడి కై
పెక్కు మను జడుల తిమిరము
గ్రక్కునఁ బోఁగొట్టినట్టి - ఘనుఁడవు దేవా! 26

జగమే వంకకుఁ జూడఁజూచినను స్త్రీ
　　సంఘాభివృద్ధ్యర్థమై
వగపుంబొందినవారు లేరనియె సం
　　భావించి యాధ్యాత్మిక
ప్రగతుల్ లేక ముడుంగు వారలనుఁ గా
　　పాడఁ బ్రయత్నించి తి
వ్నగ దివ్యోపనిషద్రహస్యముల పూ
　　ర్ణంబౌ కృపఁ దెల్పవే. 27

ఆయన సత్కృపాఫలమె
　　యంచు మహాసభలందుఁబుణ్య దే
వాయతనమ్ములందు భజ
　　నాదు లొనర్చు స్థలమ్ములందునఁ

పాయక గీతలం జదువు
పట్ల సమాహితచిత్తవృత్తి స్త్రీ
లేయెడ భక్తి తత్పరత
నిచ్చ భజింతురు నిన్ను సద్గురూ! 28

నాటికి నేటికెవ్వరయి
నన్ సరియే నినుంబోల్ప నాంధ్ర బా
హాటముగా సభల్ జరిపి
యాత్మగవేషణశక్తిం జాటంగా
నేటయి వాఙ్ముఖోచిత వి
నిశ్చయ నవ్యసుధారసోర్మికా
ధాటిని జాలువార్చిన య
థార్థవచోరచనా ప్రచారకుల్. 29

నీ నిర్మాణపథ ప్రమాణరచనా
నిర్ణాయకమ్మిద్దియో
కానీ! నాటికి నేటికొక్కమొగి వ్యా
ఖ్యారూపమై భాసిలెన్
నానారూప వికాస హేతువయి ప్ర
జ్ఞాపూర్ణమై నైక వి
జ్ఞానానందఫల ప్రదమ్మయి యనూ
నానన్యచైతన్యమై. 30

విజయమ్మున్ బ్రియసూక్తులన్ మఱువఁగా
వీలౌనె? యస్మాదృశుల్
సుజనాగ్రేసర ! దీనమానవజన
స్తోమైకరక్షామణీ ! 25

ఎక్కువయగు మా కులమని
తక్కిన కులముల నడంచి తామేల్బడికై
పెక్కు మను జడుల తిమిరము
గ్రక్కునఁ బోఁగొట్టినట్టి - ఘనుఁడవు దేవా! 26

జగమే వంకకుఁ బాఱఁజూచినను స్త్రీ
సంఘాభివృద్ధ్యర్థమై
వగపుంబొందినవారు లేరనియె సం
భావించి యాధ్యాత్మిక
ప్రగతుల్ లేక ముడుంగు వారలనుఁ గా
పాడన్ ప్రయత్నించి తి
న్నగ దివ్యోపనిషద్రహస్యముల పూ
ర్ణంబౌ కృపన్ దెల్పవే. 27

ఆయన సత్కృపాఫలమె
యంచు మహాసభలందుఁ బుణ్య దే
వాయతనమ్ములందు భజ
నాదు లొనర్చు స్థలమ్ములందునన్

పాయక గీతలం జదువు
పట్ల సమాహితచిత్తవృత్తి స్త్రీ
లేయెడ భక్తి తత్పరత
నిచ్చ భజింతురు నిన్ను సద్గురూ! 28

నాటికి నేటికెవ్వరయి
నన్ సరియే నినుంబోల్ప నాంధ్రి బా
హాటముగా సభల్ జరిపి
యాత్మగవేషణశక్తిఁజాటఁగా
నేటయి వాఙ్ముఖోచిత వి
నిశ్చయ నవ్యసుధారసోర్మికా
ధాటిని జాలువార్చిన య
థార్థవచోరచనా ప్రచారకుల్. 29

నీ నిర్మాణపథ ప్రమాణరచనా
నిర్ణాయకమ్మొద్దియో
కానీ! నాటికి నేటికొక్కమొగి వ్యా
ఖ్యారూపమై భాసిలెన్
నానారూప వికాస హేతువయి ప్ర
జ్ఞాపూర్ణమై నైక వి
జ్ఞానానందఫల ప్రదమ్మయి యనూ
నానన్యచైతన్యమై. 30

తెలుఁగు పొలానఁ బెద్దలోక
తీవరపాటున దేశసేవ పే
రులు వెలయించి పాటువడి
ప్రొద్దులు పుచ్చరె యేండ్లు పూండ్లిటుల్
వెలలెను గాని నీవలె వి
వేకముఁ గూర్చిరె? యోర్మిఁదార్చిరే?
కలుషములార్చిరే? పృథు వి
కాసముఁ జేర్చిరె? కూర్మి నేర్చిరే? 31

సురభాషాభ్యసనాభిలాషులకు సం
స్తోత్రాదిక గ్రంథముల్
పరిశుద్ధమ్ముగ నచ్చువేసి ప్రకటిం
పన్ బూనుకొన్నట్టి నీ
పరిపూర్ణోపకృతిన్ నిరంతరమతిన్
వర్ణింపరే యాంధ్ర సో
దరులెల్లన్ బరమానుకూల నియతిన్
తత్తద్గతిన్ సుస్థితిన్. 32

ఔరా గట్టి సిమెంటు నేల కెనయై
యాధ్యాత్మికోద్బోధనా
దూరమ్మై చను తెల్గు సీమ భవదు
ద్బోధోల్లసత్కారణా

ప్రారంభమ్ముల సాగు భూమి యయి యా
త్మాన్వేషణోద్దీప్తి ము
క్కారుంబంట ఫలించె నేఁడదిర ! జా
గ్రద్వ్యగ్ర కార్యోగ్రతన్. 33

తెలుగు వలంతి నేలను ప
దింబదిగా వెలుఁగొందు ముద్దు గు
ఱ్ఱలఁ గరుణించి తీర్చితివి
రాజితశక్తి ననూనతత్త్వసం
కలితులు దీర్ఘదర్శులుఁ బ్ర
కాశిత తేజులుఁగాఁగ తావకో
జ్జ్వలమహిమాతిరేకమున
సర్వజగద్ధిత ముద్ధతిం గనన్. 34

మాకా దేవుని కెడమగు
ప్రాకుంబలె నడ్డమున్న మాయను వెలిగా
నూకించు కీలు దెలుపు కృ
పాకర ! నీసరి మఱొక్కఁ - డరయం గలఁడే? 35

ప్రాచీన మానుల ప్రతికృతి యెవఁడన
నతఁడితఁడని పల్కనైనవాఁడు
ఐదంయుగీన శివార్చకుండెవఁడన
నీతఁడే యని చూప నెసఁగువాఁడు

శాంత్యహింసాదయాచార పరాయణుం
డెవఁడనఁ జూపింపఁ దవినవాఁడు
నుపనిషదుక్తి నిత్యోపాధికాశ్రయ
మెవఁడన నితఁడు నా నెనయువాఁడు

విరతి విశ్రాంతి లేకయే వేదమాతృ
దివ్యసందేశమాంధ్రికందించువాఁడు
నీవకాకొరుఁడెవ్వఁడూహించి చూడ
దివ్యగుణ సాంద్ర! మలయాళ దేశికేంద్ర! 36

ఇచ్చోటనే కదా యిద్ధబుద్ధాకృతిఁ
గూర్చుండు మదినిండి గురువరుండు
ఇయ్యెడనే కదా హితమితాక్షరముగా
ఛాత్రావళికి బోధ సలుపుచుండు
ఈస్థలమ్మునఁగదా ప్రస్థానము త్రయమ్ము
మించి భక్తులకు బోధించు చుండు
ఈతావుననె కదా పూత పదాంక ము
ద్రా సూక్ష్మ చిహ్నముల్ దనరుచుండు

ఇచటనే కద నెలకొను నెల్ల వేళ
కలుషములడంచు మేల్మిగ్గ కాశిబుగ్గ
యనుచుఁ గొండాడుదురు భవదాశ్రయమ్ము
నపగత భవశ్రమమ్ము వ్యాసాశ్రమమ్ము 37

ఆశ్రమ నిర్మాతవని పల్క దశదిశా
క్రమితమౌ బహుళాశ్రమములె సాక్షి
సద్గురూత్తముఁడవై చరియించి తన నాంధ్రిఁ
గడ దాఁకఁ గల శిష్యగణమె సాక్షి
పండితాఖండల ప్రథితుండవన భవ
ద్విరచితమగు గ్రంథవితతి సాక్షి
ఆత్మానుభూతి పూర్ణాత్ముండవనుటకు
త్వదనుభవ ప్రబోధములె సాక్షి
ధర్మసంస్థాపకుండవై తనరితనుట
శాసనాతన సభలె ముఖ్యమగు సాక్షి
సాక్షులక దేమి కొఱఁత ధీసాక్షివగుట
నపరశుకరూప, తత్త్వవిద్యాప్రదీప ! 38

నీచూపు భారత నీతికి దరిదాపు
నీప్రాపు మతనిష్ఠ నెగడఁబ్రాపు
నీదీక్ష కార్యనిర్ణీత దృఢాపేక్ష
నీమృదుశిక్ష శ్రీరామరక్ష
నీభావ మజ్ఞాన నిర్భరాబ్ధికి నావ
నీత్రోవ సంసృతి నెట్టు చేవ
నీదీప్తి భవపంక నిశ్శోషకార్యాప్తి
నీ తృప్తి శాంతి సన్నిహిత గుప్తి

నీ వచశ్శక్తి తమము ద్రుంగించు యుక్తి
నీ వ్రతము ముక్తిఁగైదార్చి నెగ్గు ఋతము
అనుపమానుఁడ వీవన్నిటను గణింప
దివ్యమునిచంద్ర! మలయాళ దేశికేంద్ర! 39

నీవలనన్ గ్రహించిన వి
 నీతులు దేశము నల్వాలంకులం
దా విలపాటులేక భవ
 దాశయసిద్ధికిఁదోడుసూపి సే
వా విషయమ్ములన్ హితము
 ప్రజ్ఞయుఁదాల్మియుఁ బేర్మిగల్గియొం
తే విలసిల్లుచుండుట గ
 ణించిన మంచికి సంచకర్వగున్ 40

తెలుగులు వెల్గులేక యొక
 తీరున నంధ పరంపరా గత
మ్ములఁ బయనించుచుండ నిజ
 బోధ మొనర్చి వెలంది వెల్గులన్
నెల కొలుపన్ బ్రయత్నపడి
 నిర్భర దుర్భర నష్టకష్టముల్
కలఁగి నలంగి తుట్టతుద
 కారణజన్ముఁడవైతి సద్గురూ! 41

అనవరతాత్మతత్త్వరుచి
రాన్నము భోజనమింక తత్ప్రబో
ధనమె మధూదకమ్ము నిర
తమ్మనుభూతి విహారశయ్య గాఁ
దనరిన తావకీన చరి
తమ్ము పవిత్రతరమ్ము సుమ్ము స
జ్జనతతి కిట్టి సత్యహిత
సాధకుఁ డొక్కఁడెఁ కేడి సద్గురూ! 42

భవదాశీర్వచన ప్రభావమున స
ర్వాంధ్రప్రదేశమ్మునం
దవగీర్ణమ్మగు నాశ్రమావళి వెలుం
గం దేఁ శుభోదర్కమై
భవవార్ధ్యుద్ధరణ ప్లవాకృతిని దీ
వ్యత్సత్యధర్మ ప్రబో
ధ విశేషోద్యమ భార ధూర్వహ సము
త్సాహైక దీక్షఁ గురూ! 43

అంతేవాసుల యా జవంజవ మహీ
యః క్రూర నిస్సార దు
ర్దాంతాభీల కఠోర భూరి జలధిఁ
దాటింప వాంఛించి వి

నీ వచశ్శక్తి తమము ద్రుంగించు యుక్తి
నీ వ్రతము ముక్తిఁగైదార్చి నెగ్గు ఋతము
అనుపమానుఁడ వీవన్నిటను గణింప
దివ్యమునిచంద్ర! మలయాళ దేశికేంద్ర! 39

నీవలనఁ గ్రహించిన వి
నీతులు దేశము నల్వాలంతులం
దా విలపాటులేక భవ
దాశయసిద్ధికిఁదోడుసూపి సే
వా విషయమ్ములఁ హితము
ప్రజ్ఞయుఁదాల్మియుఁ బేర్మిగల్గియెం
తే విలసిల్లుచుండుట గ
ణించిన మంచికి సంచకర్వగుఁ 40

తెలుగులు వెల్గులేక యొక
తీరున నంధ పరంపరా గత
మ్ములఁ బయనించుచుండ నిజ
బోధ మొనర్చి వెలంది వెల్గులఁ
నెల కొలుపఁ బ్రయత్నపడి
నిర్భర దుర్భర నష్టకష్టముల్
కలఁగి నలంగి తుట్టతుద
కారణజన్ముఁడవైతి సద్గురూ! 41

అనవరతాత్మతత్త్వరుచి
రాన్నము భోజనమింక తత్ప్రబో
ధనమె మధూదకమ్ము నిర
తమ్మనుభూతి విహారశయ్య గాఁ
దనరిన తావకీన చరి
తమ్ము పవిత్రతరమ్ము సుమ్ము స
జ్జనతతి కిట్టి సత్యహిత
సాధకుఁడొక్కఁడిఁకేడి సద్గురూ! 42

భవదాశీర్వచన ప్రభావమున స
ర్వాంధ్రప్రదేశమ్మునం
దవగీర్ణమ్మగు నాశ్రమావళి వెలుం
గందెన్ శుభోదర్కమై
భవవార్ధ్యుద్ధరణ ప్లవాకృతిని దీ
వ్యత్సత్యధర్మ ప్రబో
ధవిశేషోద్యమ భార ధూర్వహ సము
త్సాహైకదీక్షన్ గురూ! 43

అంతేవాసుల యీ జవంజవ మహీ
యః క్రూర నిస్సార దు
ర్దాంతాభీల కఠోర భూరి జలధిన్
దాటింప వాంఛించి వి

శ్రాంతిం గోరక దివ్యబోధన విచా
ర ప్రేమ్ణ కార్యమ్ములన్
సంతోషించితి వెంత జాలి యెడదన్
జాల్వారెరా సద్గురూ! 44

నీ యాశీర్వచనమ్ము మోఘము భవ
న్నిర్మాణ కార్యక్రమం
బాయత్తంబయి బీరువోక సకలాం
ధ్రానీక సేవ్యమ్మునై
భూయస్త్వమ్ము ఘటించె భావి సమయ
మ్ముల్ గూడ విజ్ఞాన తే
జోయుక్తంబయి వెల్గుగాత! సుమన
స్స్వార్థమై సద్గురూ! 45

ఆమూలాగ్ర చరిత్ర మిందనుక లే
దాయెన్ భవజ్జీవిత
ప్రామాణ్య స్థితి గూర్చి యీ కొఱత దీ
ర్పన్ బూన దుస్సాధమౌ
స్వామీ! తావక పావనాచరణమే
సంపూర్ణ చారిత్రమై
ప్రాముఖ్యమ్మున వెల్గియీ కొఱత దీ
ర్పన్ జాలెనో సద్గురూ! 46

పలుమరు నిన్ దలంచునెడ
భావ పయోధితరంగ సంగతో
జ్జ్వల విభవంపు టూయెలల
పై పయి యూగిన బాగు దోచుత్వ
ద్విలసదపాంగ వీక్షణమొ
విశ్వసముద్ధరణార్థ సాధు బో
ధల మహిమమ్మొ! యిందలి య
థార్థము తోపదు నాకు సద్గురూ! 47

కలమున్ కాగితమందుకొన్న తఱి నీ
కల్యాణమాధుర్య మం
జుల శాంతిప్రియ బోధలెన్నియొ మన
స్సున్ నాచి తోడ్తోడవె
న్నెల జల్లుల్ వడఁబోసి యాసవము సం
ధింపన్ బురాయించు న
ట్లలవిన్ మీరు తలంపు గుంపు లొకపై
యావేశమా సద్గురూ! 48

నలుబది యేండ్ల నాడొక ది
నమ్మున త్వత్పదసన్నిధానమం
దొలసిన వాఙ్ముఖమ్ము మహి
మోన్నతిఁ జాటి తదేకబుద్ధినై

కలిగిన యోగమిప్పటికిఁ
గాని మదిన్ విడనాడిపోక యు
జ్జ్వల విభవాభిరామగతి
స్వానుభవమ్మొనగూర్చె సద్గురూ! 49

నాకుం దోఁచిన భావనాశబల నా
నా నూన మేధానిధా
నా కల్ప ప్రసవ స్రవన్మృదుమరం
దస్వాదు పద్యావళుల్
నీ కర్పింతు సనాతనర్షిమత ని
ర్ణిద్ర ప్రబోధాంబుధీ!
సాకల్యాభిమతార్థసిద్ధి నిఢువా!
సత్యస్వరూపా! గురూ! 50

అచ్చినో బుచ్చినో పద న
ఖాది శిఖాంతము దాక నూరకే
యిచ్చకు నచ్చు మచ్చున ను
తించి కృతుల్ విరచించుకంటె; న
త్యుచ్చచరిత్రుపై శతక
మో చరితమ్ము రచించుటొప్పదే
యెచ్చటఁగాని తత్కృషికి
నీ డోకదుండునే యెంచి చూడఁగన్. 51

కొలికికి రాని పూసలనుఁ
గూర్చి యెటో యొకదండఁ జేర్చి న
న్నెలమిని సద్గురూత్తముని
యిద్ధచరిత్ర జగమ్మెఱుంగ వీ
ల్గలుగక గుప్తపద్ధతి గ
లంగిన; దానినుపజ్ఞ చే సమా
కలన మొనర్చితిన్ విషయ
గౌరవమెంచి పఠింపఁగాఁదగున్. 52

వసుధాంతర విలసన్మణి
విసరము పసికట్టనెట్టు - వీలగునటుల
ప్పస మెఱుక వడని చరితము
వెసఁగూర్పఁగ సాధ్యమగునె - విధికయిన బళా! 53

ఏహో నేర్చినటుల్ లభించినటునా
యీ బుద్ధికిన్ దోఁచి న
ట్లా విఖ్యాత మనోఽభినేత్ర విదితం
బైనట్లు బ్రాహ్మీకృపా
వ్యావిద్ధామృతపానమత్త వివశం
బైనట్లు మత్పూర్వ పు
ణ్యావాప్తిన్ గుదురైనటుల్ రచనమున్
గావింతు స్వేచ్ఛాస్థితిన్. 54

పరమపదనాథ పాదాం
బురుహాంతర గళిత మధుర – పూరిత మకరం
ద రసాస్వాదన పరవశ
గురువర చరితములు దురిత – కోటి నడంచున్. 55

—: ష ష్ఠ్యం త ము లు :—

ఓంకార నిరతిశయ పద
పంకేజ మధుప్రసార – పానోత్సుకసో
హంకారున 'కహమస్మి'వ
శంకరునకు శంకరప్రసాదావధికిన్. 56

ఆర్షమతోద్ధారికిఁ బ్రతి
వర్ష సనాతనమత ప్ర – వణహారికి ను
త్కర్ష పరార్థ విచారికి
హర్షాబ్ధి ప్లవవిహారి – కతిధీరునకున్. 57

జ్ఞానికి 'త్వమేవ తత్' వి
జ్ఞానికి భక్తి ప్రధాప్ర – సన్న భవానీ
జానికి భక్తి నిధానికి
మానిత పరతత్త్వకంథి – మంథానునకున్. 58

నిరతాహింసా పరునకుఁ
బరతత్త్వరహస్యబోధపరునకుఁ గరుణా
పరునకు బుధవరునకు శ్రిత
హరునకు నిజభక్తజన కృ - తాఘహరునకున్. 59

కార్యాకార్య విచక్షణ
పర్యాప్తయశోవిశేషభావుకునకు మా
త్రార్యాధిప పదపంకజ
నిర్యన్మధుపానవశ గు - ణిత భావునకున్. 60

బహుళాశ్రమ నిర్మాతకు
సహనాశయ నేత కసమ - శర జేతకు దు
స్సహ కలుషత్రాతకు సం
గ్రహకార్యవిధాత కాంత - రస్ఫీతునకున్. 61

అంకితమ్ముగా నా యొనర్పం బూనిన
'మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వామి
చరిత్ర' మను అసంగానంద విజయమ్మున
కుఁ గథాక్రమమ్మెట్టిదనిన — 62

—: జ న న ము :—

ప్రవిమల విశ్వాహారమున
భారతమే పతకమ్ము మధ్యను
న్న వెలుగు లీను మానికము
నందగుఁ గేరళమందు దక్షిణం
బవు మలయాళభూమి గురు
వయ్యూరు క్షేత్రము చెంత సర్వసౌ
ఖ్యవిలసితమ్ము సజ్జనని
కాయ నివాస విభాసితమ్మునై. 63

పేరు పెంపు మదింపు సంస్కారసిద్ధి
రాణ గను నెనగండ్యూరు గ్రామ సీమ
సదమలఖ్యాతి గల్గు వంశమ్మునందు
జగదవన కార్యకర్తయే జననమందె. 64

సౌరమాన — 1060 వ సంవత్సరమునందు మీన మాసమున శుక్లపక్ష ద్వాదశీ యుక్తాశ్లేష నక్షత్రమున 15 వ తేదికి సరియగు క్రీ. శ. 29–3–1885 వ తేదీన శుక్రవారము నాఁడు తెల్లవారుటకు 7 ఘ. 15 విఘడియలుండు శుభ లగ్నమున — 65

ఓమ్

ఓం నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

శ్రీ గురుదేవుడు బ్రహ్మీభూత మహర్షి సద్గురు

శ్రీ మలయాళ స్వాములవారి

# జనన రాశి

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | 4 | 5 | 6 | |
| 3 | ర బు శు వు శి | | మ | | |
| 2 | గు | | | చం | 7 |
| 1 | ల మ | | | | 8 |
| | | | | స | 9 |
| | 12 | 11 | 10 | | |

సౌరమాన 1060 వ సం॥రం మీనమాసము 15 వ తేదికి సరియగు క్రీ. శ. 29–3–1885 వ సంవత్సరమున జననము,

[కేరళదేశమున సౌరమానము వ్యవహారమునందు గలదు. తదనుసారము రాశిచక్రము వ్రాయబడినది.]

# జనన సమయము

వృషభ శని కుంభ గురు – మీనమాసము 15–వ తేదీన గురువారము అస్తమానమై (పూర్తి అయి) శుక్రవారమున అనగా తెల్లవారుటకు 7 ఘుడియలు. 15 విఘుడియలు ఉండగా, ఆశ్లేష నక్షత్రమునందు, పూర్వపక్ష (శుక్లపక్ష) ద్వాదశిన, సింహాకరణ ధృతినామ నిత్యయోగముతో కూడిన యోగ మాయా సమయమున, మకర రాశియందు (ద్రేక్కాణంజ్యో) పురుష జననము. ఓమ్

జనని ''నొట్టియమ్మ; జనకుఁడు'' కరియప్ప
యనెడి దంపతులకు – జననమయ్యె
విశ్వశాంతినేత – శాశ్వతసుఖదాత
వికృతభావహర్త – సుకృతకర్త. 66

పేరు 'వేలప్ప' యనఁగ ను – ర్విని వెలుఁగు
లాలయఁగారణ జన్ముఁడే – యుద్భవించె
పూవు బుట్టిన యంతనే – తావి దెలియు
ననెడి లోకోక్తి కిరవయి – తనరె శిశువు 67

తల్లిదండ్రులు నైష్ఠిక – తత్పరులయి
దైవభక్తి ప్రపూతులై – దాత్మతామ
హిమ్మ నైష్ఠిక కార్యపటి – ష్ఠు లగుట
నానువంశిక గుణము జ – న్మాది కలిగె. 68

ఏటఁ బెరిగెడి వాఁడొక్క – పూటఁ బెరిగె
నవనవోన్మేష వంశాంకుర – విధ మలరి
తెలివితేటలలో దివ్య – తేజము ననుఁ
గూర్మి పేర్మల నర్మిలిఁ – గ్రొత్త దోఁచె. 69

తలలో నాలుకయై పె
ద్దలలో రాపొమ్మటంచుఁ – దనిసని పిలువన్
వెల్లలేని మనుగడన్ ని
చ్చలు లోగొను బాలుఁడలరెఁ జందన తరువై. 70

అందఱు రారమ్మని నీ
యందము చందమ్ము సంది - యంబేలర ! మా
డెందము లోఁగొనెనని మది
తొందర రావించి చూచు - దురు బంధుజనుల్. 71

అడఁకువ యను కలిమియుఁ బే
రుడుకువ గల జీవితప్రయోజనమును మేల్
నడవడి గల సంపద యా
బుడుతకుఁ దొలియుగ్గు నాఁడె-పొడమిన గుణముల్. 72

—: విద్యాభ్యాసము :—

అయిదేడుల యీడునకే
ప్రయత్నశీలురయి రక్షరాభ్యాస విధుల్
నయమునఁ గావింపఁగఁ బే
రయమున గురుడిచ్చె నక్షయంబక్షరముల్. 73

గురు శుశ్రూషామతి త
త్పరుఁడై శిష్యుండు పౌర - భాషాభ్యసన
త్వరమాణుండయి దినములు
గురుతర భక్తిన్ వ్యయించి - గొప్పగ నేర్చెన్. 74

నా నాటికి లౌకిక భా
షా నిరుపమ వాఙ్ముఖముల - జానపదుండై
మానిత గౌరవ నియమ
స్థానాక్రమణైక జీవితము గడియించెన్. 75

మితభోజియు మితభాషియు
మితగమనాగమనపార - మితదక్షుండై
మితహిత సహిత చరుండై
ఋతయుతుడై శిష్యుఁడొప్పెఁ బ్రియ మెసలారన్. 76

ప్రావృట్కాల చలన్నదు
లేవిధమునఁ బొంగి పాఱు - నీ బాలుండున్
ధీవిభవ సమృద్ధుల నటు
లేవిధముల శుక్లపక్ష - విధుఁడన నలరెన్. 77

జరఠపత్రమ్ములవి రాల - తరులుఁ జివురుఁ
దొడివి కుసుమించునట్లు - ప్రాబడిన తలఁపు
లుడుగ నిత్యనవీన భా - వోల్బణమ్ము
తోడ నవయౌవనమ్ము ప్రా - దుర్భవించె. 78

తన యింటఁ గలిగినది యని
తినుటకె పని పెట్టుకొనుచుఁ - దిని త్రేఁచి పరుం
డిన మోటు మానిపించలె
తనయునిఁ దీర్పరు పితాళ్లు - తత్ జ్ఞులై యొసగుటన్. 79

ఒక్కపూట యోగి - భోగి రెండు పూటలు
రోగి మూఁడు - పూటలు దిను
నెపుడుఁ దినెడువాని - నేమందురో యట్టి
తిండిపోతు మొండి - బండపశువె. 80

ఎడ తెఱపి లేక యెడ నెడఁ
గుడుచుచు విడివడని పసుల - కును దీటయి యె
ప్పుడుఁ గడుపు కక్కుఱితిఁబడు
బడవలు కోడి మెలకుఁ బాలు - పడు టెడరు గదా! 81

క్రమగతి నా బాలుఁడు వే
దము లుపనిషదాదికమ్ము - దర్శనములు ని
స్సమభక్తి శ్రద్ధాసం
గమ సునిశితబుద్ధిఁ జదివె - క్రమపరిణతుఁడై. 82

వయసుతో పాటు ననవద్యమయిన విద్య
విద్యతో పాటు సుగుణమ్ము విస్తరిలుట
నాఁడు నాటికి బాలుండు - నవక మెక్కి
క్రాలుఁ బున్నపు వెన్నెల - కందువోలె. 83

అట్టియెడ క్రొంజివురువంటి లేఁబ్రాయమున బాలునికి పితృవియోగ మొదవె తదుపరి తల్లియే అన్ని పాట్లుంబడి యా బిడ్డ విద్యాబుద్ధులు వృద్ధియగుటకై తాను సతమతయయ్యు నిరంతరము పరిశ్రమించె. 84

తఱచి వేయికనుల్ గల్గి తల్లి కూర్మి
నాత్మజుని పరిరక్షించు - టందు శ్రద్ధఁ
బూని కాలమ్ము గడపుచు పూర్ణవిద్య
వృద్ధియైనట్లు తోఁప హర్షించి మదిని 85

గురునకు యథోచితార్హాదు - కూలవస్త్ర
ములను దక్షిణ తాంబూలముల నొసంగి
భక్తినిఁ బ్రదక్షిణము సల్పి - ప్రాంజలి యయి
ప్రణుతి సేసిన తచ్ఛిష్య - వరున కపుడ. 86

విద్యాబుద్ధులతో నన
వద్యయశోగీతితో శు - భ పరంపరతో
నాద్యంతరహితు భక్తి మ
హోద్యమ సంపత్తితో మ - హోచ్చపదవితో. 87

చిరతరానంద మధుర వీచికలఁ దోఁగి
యుంట లెస్సని తత్త్వవిద్యోపలబ్ధి
వడసి మేలొంద దీవించె బ్రాహ్మణుండు
ప్రాపణీయమ్ము లెట్లు ల - భ్యమ్ము గావు. 88

బాలునికి వయః పరిమితి
వాలాయము మీరె నింక - బంధువు లెల్లన్
జాలింపఁ గోరి పల్కిరి
యేలీలన్ జదువు నిల్పు టే - హితవనుచున్. 89

తలపోసి గురుని యొద్దన్
సెలవుం గయికొని సభక్తిఁ - జింతించెను పె
ద్దలకడ నేర్చిన విద్యకు
ఫలితము గలదంచు తల్లి - భావమునందున్. 90

మఱియు నష్టాంగ యోగ మార్గాదికమ్ము
గురునిచేత నెఱింగి తాగురు తెఱుంగఁ
గోరు నిరుపమ వైరాగ్యగుణ గరిష్ఠు
బాలుఁ గొంపోయె తల్లి నివాసమునకు. 91

—: ధ్యా న ని ష్ఠ :—

ఇంటి కరిగియు నిరంతర భక్తి తత్పరుండగుట లౌకిక క్రియాకలాపమెల్ల మాని సదా ధ్యాననిష్ఠా పటిష్ఠుండై యున్న యక్కుమారుం జూచి తదీయాగ్రజుండు కోపంబు దీపింప పని పాటులలో జోక్యమిసుమంతయు లేక యూరకుండిన నేమి లాభము? లేచి రమ్మని గద్దించి పల్కిన వినియు నబ్బాల కుండు భక్తి వివశుండగుట మిన్నకుండుటం జేసి నిగ్రహం బించుకయు లేక యాగ్రహోదగ్రుండై తమ్ముని దండించియైన దారికిఁ దెచ్చుట మేలని తలంచి — 92

బాల్యమునందు మారమణు
భక్తిభజించుచునుండు వేళ చా
పల్యము నెంది సోదరుని
భ్రాత్రువరుండొక చెంప పెట్టిడన్
తాల్యమొకింత లేక మివు
లన్ మది నిబ్బరమూని యీశుని
స్తుల్య గతిన్ భజించుచును
శోకవిహీనతనుండ నంతటన్. 93

తమ్ముని భక్తి పెంపునకు
తల్లడిలన్ మది రోసియన్న తా
క్రమ్మిన యీసుతో నెదిరి
క్రమ్మఱఁ జెంపలగొట్టవోవమ
ధ్యమ్మున నంది యొక్కటి ప
థమ్మున కడ్డము నిల్చినట్లు భా
వమ్మునఁదోఁచినంత నిరు
ప్రక్కలఁగన్గొని భీతచిత్తుఁడై. 94

ఏకామెకింబోయి తల్లికి విన్నవించిన నామెయు సంభ్రాన్తస్వాంతయై రిచ్చవడి వానిం దోడ్కొని బాలునిం గదిసి నిష్ఠాపటిష్ఠుఁడై యున్న యా చిన్ని కుమారుం గని యెంతయు వింతఁగదురనుండె. 95

తనుఁ దండింపఁ బ్రయత్నిం
చిన యన్నను నడ్డుతార - సిలునందిని తో
డనె వచ్చి నిలుచు తల్లినిఁ
గనఁడమ్మాణవకుఁడెంత - ఘన నిష్ఠయొకో! 96

తన భక్తుల విఘ్నమ్ముల
విని ఘాతమ్ముంజేయు శ్రీశు విధమున బాలున్
గని దండింప మదిం దలఁ
చిన భ్రాతకు నంది యడ్డి - సిలుగులు దొలఁచెన్. 97

మఱియు నష్టాంగ యోగ మార్గాదికమ్ము
గురునిచేత నెఱింగి తాగురు తెఱుంగఁ
గోరు నిరుపమ వైరాగ్యగుణ గరిష్ఠు
బాలుఁ గొంపోయె తల్లి నివాసమునకు. 91

—: ధ్యా న ని ష్ఠ :—

ఇంటి కరిగియు నిరంతర భక్తి తత్పరుండగుట లౌకిక క్రియాకలాపమెల్ల మాని సదా ధ్యాననిష్ఠా పటిష్ఠుండై యున్న యక్కుమారుం జూచి తదీయాగ్రజుండు కోపంబు దీపింప పని పాటులలో జోక్యమిసుమంతయు లేక యూరకుండిన నేమి లాభము? లేచి రమ్మని గద్దించి పల్కినను వినియు నబ్బాల కుండు భక్తి వివశుండగుట మిన్నకుండుటం జేసి నిగ్రహం బించుకయు లేక యాగ్రహోదగ్రుండై తమ్ముని దండించియైన దారికిఁ దెచ్చుట మేలని తలంచి — 92

బాల్యమునందు మారమణు
భక్తిభజించుచునుండువేళ చా
పల్యము నెంది సోదరుని
భ్రాతృవరుండొక చెంపపెట్టిడన్
తాల్యమొకింత లేక మివు
లన్ మది నిబ్బరమూని యీశుని
స్తుల్య గతిన్ భజించుచును
శోకవిహీనతనుండ నంతటన్. 93

విని నివ్వెఱఁ గొని గద్గది
కను కంఠము రుద్ధమగుడు – గాదిలి బిడ్డన్
గనుఁగొని కదిసి యిటుల్ ప్రాక్
ప్రణయము తొలఁకాడ బుజ్జ – వము వెంటాడన్. 102

నీ యభిమత మెఱుఁగము తం
డ్రీ! యర్థము కాని దేదొ యేర్పడ దిఁక నీ
వే యిదమిత్థమటంచెడఁ
బాయని తలఁపులనుఁ బల్క – వలెనని యడుగన్. 103

వాత్సల్యప్రపూర్ణయగు మాతృదేవికి లౌకికవిషయ వాసనాశూన్యుఁడును, నిరంతర పారమార్థిక చింతాక్రాంత స్వాంతుండు నగు నబ్బాలుం డప్పటికప్పుడు పొడమిన మిడియ నుడువులం బోలిన పలుకులతో నిట్లని చెప్పం దొడఁగెను. 104

—: నిజాభిమతము :—

ఇహలోక జీవితము ని
స్పృహమై త్యాజ్యమని తోఁచె – నీ జీవిక స
త్స్పృహచరితనై మనఁ గోరెద
సహానముఁ గనుమేల మఱల – చర్చింపంగన్. 105

యుగ్మముల్ కొన్ని గతించె నేరయిన నా
యుస్సట్టె యాకట్టి పెం
పగ్లు భోగైకవిలాసలాలసత ని
త్యానందపూర్ణాత్ములై

తగి యత్యంతపరార్థసాధన పర
త్వం బందినారే? యహా
తగ నానావిధ దుఃఖసాగరము ల
ర్థిఁ దాటిరే? పల్కుమా. 106

కుమ్మరి సారె వోలు తిరు
గుళ్లగు జన్మపరంపరల్ నరుల్
నెమ్మది వట్టి కల్లయని
నిక్కవ మెంచి పరేశపాదప
ద్మమ్ముల ముట్టి కొల్చి పర
తత్త్వముఁ జ్ఞాఁగొ వ్వం దలంతురే
యెమ్మెలివేల? దుర్భ్రమలె
యింగలమందు మిణుంగురుల్వలెన్. 107

తాతలు తండ్రులిందనుక
తత్త్వమెఱుంగక వంతుపాటగా
నేతరులై భ్రమాభ్రమణ
నీచపథానుగమస్వభావులై
పాతఱలాడుచుండుటల
వాటయిపోయెఁ గరప్రదీపికా
పాతితఖద్యోతుల్వలె ప్ర
పంచసుఖానుభవైకసక్తతన్. 108

'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' యను నుపనిషదుక్తి
చొప్పున బ్రహ్మము తప్ప తక్కినవి యెల్ల నిస్సారము

లగుటంజేసి యీ యిహలోక క్షణభంగురజీవితమ్ములు బుద్బుదప్రాయమ్ములు, అస్థిరమ్ములు, నశ్వరమ్ములును గాదె? లోకమెద్దానిని భ్రమప్రమాదములచే సారభూతమని భావించునో, నేనద్దానిని త్రికరణశుద్ధిగా నమంగళకరము నశాశ్వతము ప్రమాదహేతువు నగునని భావించుచున్నాడను. ఇద్ది త్రిథాసత్యము సర్వథా సర్వదా నాదగు హృదంతరమునఁ బొడమిన భావపరంపరావేశము సుమ్మా! యని తేనె వాక జాలువారినయట్లు చల్లగా మెల్లగా ప్రవచించిన నెదుర నున్న తల్లియు, తదితరబంధువులును — 109

విస్తుపోయి యిట్టి వింగడమీనాఁడు
వినఁగ వలసె నేది వెలువడించు
నాత్మబంధుజనుల నాప్తుల గురువులఁ
బిలువ నంపి హితము పలికిరంత. 110

ఎవ్వరెంత చెప్ప – నిట్టట్టుఁ దొట్రిల
కుడిని నందివోలెఁ గూరుచుండి
అదరు బెదరు లేక – యట్టిట్టుఁ జూడక
స్థితమనీషఁ బ్రాను – మతిమును స్వామి. 111

ఎట్టెదురఁ గట్టు కదలక
కట్టుప కాసువలె వెల్గు – కట్టిడి మదిలో
గొట్టుకొనఁగ బొట్టియును గని
కట్టలుకల బెద్దలరిరి – కాతరమతులై. 112

నాయన! నిముసము నిన్నొడఁ
బాయక జీవించు మమ్ముఁ బాయుట మేలా?
యీ యెల ప్రాయము తపమును
లోయను బడియడల నుసురులును విడువ మొకో! 113

నీతో మా ప్రాణాల్ సం
గాతమ్ములగు నీవు లేనికతనఁ బోవున్
నీ తల్లి నెలమి మనుపఁగఁ
భ్రాతృత్వమ్మా పోయి యెషి పరమాం దేదవో? 114

ప్రవచించు 'మాతృదేవో [illegible]
భవ' యని తత్పరత విడిచి — బరమాప్తోక్తుల
య్యావి యుల్లంఘించినవాఁ
డవ్వనే? భారతుఁడు వాని — కగునె పరమ్ముల్. 115

నీ వుండిన మేము ముందుగనె [illegible]
నీవుండని కతన మేము — నిలుపోపము తామె
రావుల్ దప్పిన యట్టులు
భావింపఁదగున్ హితోక్తిఁ — బాలింపుమయా! 116

అని ప్రేమరస పరిప్లావిత హృదయులై యనేక యోక్తు
లాడిన పెద్దలకు వినయావనమిత శిరస్కుండయి మధుర
మంజుల మానవీయోక్తులతో, 117

మనసంత విప్పి వేళ
ప్ప నియోగ మాత్రంబ్రఫి సేవ నాయ త్తమతి
గానకొని జీవించెద నయి
నను తత్త్వ నిదేశ బుద్ధి - నైజంబగుటన్. 118

ఐహిక బంధ నిబంధన
లూహాజనితమ్ములితర - యోచనములు నే
నూహాగాన మొనర్చెడి
సాహసమింతైన లేదు - సత్యము సుమ్మా! 119

పలుమాటలేల ? క్రొత్తది
పలుకన్నె నిపుడు భరత - వంశీయుల యు
జ్జ్వలమగు ప్రాక్చరితమ్ముల
దిలకింపవె ఋషిమత ప్ర - తిష్ఠల వినవే. 120

ఆర్యుల పవిత్ర చరితమ్ము - లన్ని కడల
వెల్లివిరియవా సకల ది - గ్భిత్తులందు
తచ్చరిత్ర లిఖింపఁ ద - త్తత్త్య లెల్ల
జదివి యానందతుందిల - హృదులు గారె. 121

అనినంత తల్లి బుజ్జవమ్మనఁ గొమరుని దగ్గఱకుం [illegible] మన్ననయుంపు ముద్దుముచ్చటలతో నల్ల నల్లన [illegible]గా నిట్లు పలుకందొడంగె. 122

కన్న కడగండ్లు బొంది కైకొన్న ధనము
ధాన్యమును జీవధనము నిత్యానుభూత
వస్తువుల వెల్ల నీకె లభ్యమ్ములగును
గాన నీ వెట్టి మతములు మానుమయ్య! 123

నీ కెయ్యది యిష్టమొ నా
సే కొనుమింక వేళ్లాకండు - చింతయదేలా
రా కొమరుని వలె మనుగడఁ
గైకొల్పఁ జేసేయ నాకుఁ - గలుగు ముదమ్ముల్. 124

నా కోరికయును దీర్చను
నీకును శుభములు ఘటిల్లు - నిర్భరసౌఖ్య
శ్రీ కూరు విభవ సంపద
నే కూర్తుఁ నా హితోక్తి - నెవి నిడు మయ్యా! 125

అని పలుకు జనని కోరిక
విని సవినయభక్తి మెవుల - వినమిత శీర్షుం
డునయి వచించె హృదంతర
ఘనసరవిద్బోధరూప - కారణ సూక్తుల్ 126

కంటికిఁ గాన వచ్చిన జ
గమ్ము మతెప్పటికైన మిథ్యగా
నుంట నిజమ్ము దైవ మొ
కండుండుటె సత్యమటంచు వేదముల్

మింటికి మంట్రి కొక్క మొగి
మే కొనిపల్కె భవాదృశులోఘున,
కంటక మంచు నెంచునదె
గమ్యమగున్ బుధపాళి కెంతయున్. 127

యుగముల తరబడి ఋషులా
సుగతికినై త్యాగబుద్ధి శుద్ధాత్మకులై
మిగుల నగచాట్లు బడిరై
నగరిష్ఠ పరార్థ మెటేగి - జ్ఞానులు గారే! 128

వారలఁగాంచిరైనను బ్ర
పంచముఁగాంచియునైన మిథ్యయం
చారసి బుద్ధిదెచ్చుకొని
యైహికముల్ త్యజియించుటొప్పగున్
గారణమాత్మలోఁగని జ
గత్పరివర్తనముల్ గణింపకే
సారమటంచు నమ్మి వరు
సన్ జడతర్క జరియింపన్యాయమే! 129

కావున సంసారార్ణవ
నావవుమిమ్మా! భగవదంఘ్రి నళినయుగమ్మా
సేవఁ బొనర్పక యైహిక
జీవితమున్ గడుపనౌనె - చెల్లునె తల్లీ! 130

ఈ నాజీవితమున సే
వా నియమము నెఱపి విశ్వ - పతి నలరింతున్
మానితముక్తి పదమ్మగుఁ
దాన; తదారాధనమె సదా ధ్యేయమ్మా. 131

అని బహువిధములను భ
క్తిన్ బ్రణతు లొనర్చి భారతీయ ప్రగతిన్
ప్రణుతించి పెద్దలందఱి
క్షణను నచ్చం జెప్పి యతుల - కుతుకకలితుఁడై. 132

ఐహికాసక్తి వీడి మిథ్యగ జగమ్ముఁ
దలఁచి తలఁపు లడంచి హృద్వనజమధ్య
ధ్యాననిష్ఠా గరిష్ఠుఁడై యహరహమ్ము
కాలమవలీలఁ గడపె నబ్బాలకుండు. 133

—: జపసిద్ధి :—

సమయమ్మిట్లు వ్యయింపఁగ
సమకూరెఁ గ్రమక్రమ ప్రచారమ్మయి శ్రే
యమునఁ బ్రేయమ్మారెంటన్
భ్రమపడి ప్రేయమ్ము కొంతవలచుట చేతన్. 134

దూరగత విషయ విజ్ఞత
దూరశ్రవణమ్ము రోగ - దూరీకృతియున్
దూర గతాలోకనమున
నారోగ్య హరాశధాదు - లన్నియు నబ్బెన్. 135

ఇవి యెంతయు మేలని జగ
దవన మటంచెంచి తత్సమార్జన ధిషణన్
దవిలి ప్రజాహిత కార్య
ప్రవణుండయి చేయసాగె పవలున్ రేయిన్. 136

బహుళాగంతుక జనసం
గ్రహణైక కృతి ప్రచార - కార్యావసరా
వహ వివిధోద్యమరచనల
నహరహమున్ సేయ దివురు - నావేశమతిన్. 137

గుంపులు గుంపులు తామర
తంపరగా వచ్చి ప్రజలు - తనుఁ జుట్టుకొనన్
నింపాదిఁ బలుకు నోరిమిఁ
గంపింపఁడు లేశమేని - కలకలములకున్. 138

నిరుపమగుణజాలా! నిత్యసత్యార్థశీలా!
పరశనియమసారా! శశ్వదాంధ్రోపకారా!
సరసమృదుకవిత్వా! సాధుసమ్మాన్యతత్త్వా!
పరిగతరసభావా! పార్వతీశాంఘ్రిసేవా! 139

ఇది శ్రీ వైద్య విద్వత్పండిత పణ్ణావి నారాయణాచార్య మహాశయ
విరచితమగు మహర్షి శ్రీ సద్గురు మలయాళస్వామి
చరిత్రమునందు ప్రథమ ఘట్టము.



మహర్షి సద్గురు

# శ్రీమలయాళస్వామిచరిత్రము

అను

# అసంగానంద విజయము

## ద్వితీయ ఘట్టము

నిరుపమ నిర్భర కరుణా
కర! పతిత జనావనా! ప్రకాశిత వేదాం
తరహస్యబోధనా! శివ
చరణాబ్జవిలీన మానసా! భక్తి ఖనీ!

కాలమ్మిట్లు సనన్ హృదంతరము సం
స్కారమ్మునుం బొందియు
ద్వేలం బద్యతన ప్రయోజనము లె
ట్లే మేలుగాదంచు నా
త్మాలోక ప్రథిత ప్రభూత కృతులం
తత్సత్యముం దెల్పు నీ
లీలామాలపుఁ జేత లెన్నటికిఁ గా
ఋష్యాంభటం చెంచుచున్

ఇఁక నిట నున్న నీ స్థితియె;
యెన్నటి కేఁ భవితవ్యముండునే
యకట! విచారమాత్మ నిసు
మంతయు లేక వివేకశూన్యతఁ
గకవిక పాటుఁ బొందుటిది;
కాపథవృత్తిని వీడి యాత్మలో
నికిఁ జొరఁ బారుటో వెదకి
నిత్యపదార్థ మెఱుంగుటో తగుఁ. 2

దూరదృష్టి లేక తొడుసులోఁ దాల్కొని
క్రుంగ నేల? వెతపడంగ నేల?
కర్మ కౌశలమునఁ గాలమ్ము గుర్తించి
మెలఁగ మేలు గలుగు సిలుగు దొలఁగు. 3

ప్రేయస్సు వీడి శ్రేయము
డాయువరకు నెట్టి సంకటము లొందియుఁ ద
ద్ధ్యాయ స్వామందు నెంతయు
న్యాయము పరమార్థసాధనా ఫలితమగుఁ. 4

అని దీర్ఘదృష్టిఁ బోయి యాలోచించి స్వయంస్ఫురణ మొక్క వంకఁ బ్రేరేపింపఁ దలఁచినది తలంపుగా తల్లిచెంత కరిగి వినయావనతుండై నమస్కరించి "అమ్మా! నా డెందంబున సందియం బొక్కింత పొడసూపె, దానిం దీర్చు

కొనుచుంతేని యవసరంబ. కావున నొక సద్గురుని సన్నిధానమున కేగి నాకుం గల్గిన సందియమ్ము దీర్చుకొని సాధ్యమైనంత త్వరగా నీ సేవకై మఱలి రాగలనని కడుదీనమ్ముగా విన్నవించిన నామె తన హృదయము వెన్నవలె కరంగ పుత్రుని యెడబాటునకోర్వఁజాలనిదయ్యు బిడ్డ కోరిక తీర్చుచుంతేని సముచితంబ యని యెంచి కొంత తడవుమీద సరియని సమ్మతించె. అంత నమ్మాణవకుండేనుగు నెక్కి—నంత సంతసమ్మున పెద్దలెల్లర యనుమతి వడసి యేకాకియై బయలుదేరె.— 5

—: గురు సన్నిధానము :—

తన యిరుగు పొరుగు లిటునటు
చనుట యెఱుంగకయె దారిఁ - జనె నొంటరియై
తన మది నేచిన కాచిన
ఘనుఁడగు దేవుండె తోడు - గలఁడను నాసన్. 6

అటు నిటు పోయి పోయి వి...
ట పాంతర సీమలఁ జేరిచేరి యు
ద్భటపటు ఘోర కాననము
బల్విడిఁ జయ్యన దూరి దూరి సం
కటములఁ జెంది చెంది తా
సకమ్మున నాశ్రమమొండు గాంచె హృ
త్స్ఫుటవికసత్ప్రసన్న రుచి పుంజము
శాంతిలతానికుంజమున్. 7

కని మనసార దాని యొడి
కమ్ము నిగారము కట్టుదిట్ట మొ
య్యనఁ బలుమారు నెంచుచు మ
హాత్ముల కియ్యది యాటపట్టటం
చనుఁ దలపోసి నిశ్చయ మ
నోగతి లోఁజొరఁబారి నిట్ట ని
ల్వున వెలుఁగొందు నగ్నివలెఁ
బొల్చు యతీశ్వరుఁ జూచి నివ్వెఱన్. 8

తానింతకు ముందెన్నఁడుఁ
గానీ కన్గొనని మునినిఁ గాంచి ప్రపత్తిన్
బూని ప్రణామశతం బెం
తేన్నియుఁ గావించి దృఢత - రేచ్ఛాస్థితిమై. 9

చేమోడ్పుల్ పొనరించి నిల్చున నమ
స్తే పాహిమాం రక్ష యం
చా మోదమ్మున భక్తిఁ గొల్చె మునిచ
ర్యాచార్యానొక్కింత స
ప్రేమాలోకన మాధురీ మృదులతా
వీయూష వర్షాతి హ
ర్షా మేయాంతరభావ వీచికల నో
లాడంగ నెప్పట్టునన్. 10

అంతర మెఱిఁగిన సద్గురుఁ
డంతన్ జెంతకునుఁ జీరి – యాశీరమృత
స్స్రాంతమ్ము విచ్చవిరియఁగ
'శాంతాత్మా జయతు' నా వచనముం బలికెన్. 11

ఆశ్రమములు గురుల యధికార ముద్రలు
దాస్యభావములుఁ బ్రథావిధాన
మైన శిష్యపదవి యానుపూర్వ్య మెఱుంగఁ
జాలనట్టి చిన్ని బాలుఁడగుట. 12

వెఱ మది నాటి ముందునకు
వెన్కకుఁ బాతఱిలాడుఁ గొంత వే
గిరపడు పెద్దలం గదియఁ
గేవల తాత్త్విక గుప్తమంత్రమున్
బెరిమ నెఱుంగఁగా నుదుటు
మించి జొరంబడ నేమి దోసమో
దొరయునో యంచు డిందువడుఁ
దూర్ణగతిన్ బహు సూక్ష్మవేదియై. 13

స్థితమతిన్ ధ్యానయోగ నిశ్చిత పదార్థ
మెట్ట యెదుర శిలాస్తంభ మట్టులొప్పు
ఆశ్రమ స్థితు యతినిఁ గన్నారఁగాంచి
వటువు ప్రణతులు భక్తిఁగూర్చంగనంతఁ 14

అనవరత ధ్యాననిష్ఠాగరిష్ఠుండును, బ్రహ్మానుభూతిపరుండును, మిత్రతేజోవిరాజితుండును, ప్రబోధ సుధాప్రస్రవణ మహితుండును, పెరింగోట్టుకర గ్రామగత శ్రీ నారాయణాశ్రమనివాసభాసురుండును, జగత్ప్రసిద్ధ యశోవిశాలుండును, శ్రీ నారాయణ గురుదేవశిష్యాగ్రేసరుండును, స్వతఃస్ఫురణ తరుణాదిత్యుండునగు నా శ్రీ సిద్ధ శివలింగాభిధానుండగు నయ్యతివరేణ్యుండు నూతనాగత బాలుని నిలువెల్లనుపలక్షించి తనలోఁ దానిట్లు వితర్కింపం దొడంగె. 15

బాలుం డెవ్వఁడొ దొడ్డవాఁడగుటజూ
పట్టెన్ పువుంబుట్టిన
ప్డోలెన్ దావులు తావులై యెసగున
ట్లూహింపఁ దల్లక్షణ
శ్రీ లాలిత్యము శోందు శాంతివినయ
శ్రీ సుప్రసన్నాకృతుల్
లీలామాత్రఁగ నంబడెన్ నిజమనో
లిప్సానుకూలమ్ముగన్. 16

ఇట్టి బాలుని కని విని యే యెఱుంగనేమి పనిఁబూని వచ్చె నాకై తుటోండుకాదు గద వీనితో క్షణకాలమైనఁ బుచ్చుటెంతయు నచ్చుట ముచ్చటగును. 17

అనియోచించి 18



శ్రీవారి గురుదేవులు

శ్రీ శ్రీ శ్రీ సిద్ధశివలింగగురుస్వాములవారు

పెరింగోట్కుర.

నూతనాగతు రాంబిల్వాం బ్రాత శిష్యు
నొకని బుత్తెంచినంత నా యువకుడేగి
గురుని సమ్మతి ముమ్మారు నెఱుక ప్రణతుల
వటుని పేరాస గొంత సఫలమగుటను. 19

ఏనుగు నెక్కినంత ముద
మెంతయు నిక్క భ్రమ ప్రమాద వి
జ్ఞానరహస్యసూత్రము ల
నంతమహాంతము స్వాంతమంతటన్
బూనిక యోచనల్ సలిపి
పూర్ణవిరాగవిశేషముద్రితుం
డైన కుమారుడల్ల గురు
నండకు మెల్లనఁ జేరఁ బోరినన్. 20

ఆ సద్గురు వర్యుండు 21

బాలు నెగదిగఁ గని గుణశాలి శీలి
పరమనిష్ఠాప్రతిష్ఠుడౌ బ్రహ్మచారి
వీని గణుతించు నెంతయు విజ్ఞత యని
యనునయమ్మునఁ దీసి దీవనలఁ బోసి. 22

దూరాగత వటువును ప్రథ
తారంభాలోకనముల – నాలోచన సం
స్కార మనీషం గనుఁగొని
స్మేరద్యుతి నృత్యమాడఁ – జెక్కిళ్లపయిన్. 23

అబ్బాయీ యెటనుండి వచ్చితివి? యా
యాసంబటుల్ తోచె నీ
తబ్బిబ్బా పయనానికిం గతము వా
దాలాడుటల్ కాదో? యా
గబ్బున్ బోవిరజిమ్మ వచ్చితివో? క్రీ
కారణ్యసంచార మి
ట్లబ్బున్ గారణమేమి? పల్కుమన నీ
యా దిక్కు లీక్షించుచున్. 24

ఓ సామీ! యిలువీడి వచ్చుటకు నెం
తో కారణంబున్న దా
యాసం బించుక లేక జాలి గొని నా
యార్తారవంబున్ వినం
గా సంతోసము మేరమీరె నిహలో
కంబన్న నేహ్యంబునై
వాసిం బాసి విరాగమిత్రమిటు చూ
పన్ దారి నేవచ్చితిన్. 25

వాదవివాదమ్ముల బహు
భేదోపాయములవలన - వీఁడున్ వీడన్.
లేదయ్యా! యున్నదున్నటు
నీ దరిఁ బల్కితిని శరణు - నీ దాసుండన్. 26

అన విని యమ్మునీంద్రుఁ డు ద
యామయదృష్టి స్వభావసిద్ధమై
పనుపడఁ జూచి యేమిటిది?
బాలక! నీ తలిదండ్రులన్ వడిన్
బనివడి వీడినాడవా? ప్ర
పంచ విధాన నిరోధ సాధన
మ్మునఁ బెనుపొంద; దీని బుధ
పుంగవులోర్తురె మేల్మిఁ గూర్తురే. 27

అనిన విని వినయవినమితుండయి బాలుండిట్లనియె. 28

గురుకుల వాస క్లేశో
పరి పరిణత వయసు వెలుగు పట్టున పెద్దల్
పరిణయ మొనర్చు కోరిక
పరి పరివిధ యత్నములకుఁ – బాల్పడిన తఱిన్. 29

నాలో విరాగవహ్ని
జ్వాలాజాలాకరాళ – జాలంబిటు లు
ద్వేలమయి మిన్ను ముట్టఁగ
నాలోచించుకొని శ్రేయమందెడు కోర్కెన్ 30

శీలించి బ్రహ్మవిద్యా
పాలనమే శ్రేష్ఠమనుచు – భావించి మదీ
యాలోచనమ్ము వారికి
మాలిమి మేలిమి పలుకుల మఱి మఱిఁ తెలుపన్. 31

వారును నా మాటలు సరకు గొనక. 32

అన్ని యాశ్రమముల గృహస్థాశ్రమమ్మె
శ్రేష్ఠమది తక్కువానికి జీవగఱ్ఱ
యెక్కుడు గృహస్థులుర్వి వీక్షింపుమనుచు
ప్రథిత సోదాహరణత నుపన్యసించి. 33

అంతటం బోక యూరనున్నట్టి పెద్ద
వారిఁ బొరుగూరివారి స్వబంధుజనులఁ
బిలిచి సభఁ జేసి నా మాట బిద్దమైన
భంగి మాటాడి రవల మద్వాఙ్ముఖమ్ము. 34

వినిన సభఁ గల యార్యులు - విస్మితులయి
అస్మదుక్తికిఁ బ్రాధాన్య - మొసఁగి యిచ్చి
రందుచేఁ బిన్న పెద్ద తే - డనక యూర
కమ్మఁ బలుకాడినాడ స - ద్ధర్మోక్తులలర. 35

లలిత గుణులార! మీ యా
జ్ఞల మీరఁగ నెంతవాఁడ జ్ఞానోదయముం
గలిగిన పిమ్మట మీరలు
పలికినయటు సేయువాఁడ - బంతమిం కేలా. 36

నావిని మేరువు ముంగిట
రావించినటుల్ ప్రమోద - రసపూర్ణమనులై
కేవల కరుణారస సం
ప్లావిత హృదయులయి తొలు - బడిసేయ నొడఁగ. 37

కాలమ్ము ట్టులఁ గడపుచు
నాలో నే నేకతమ్ము నం దలపోయం
జాలితిఁ దటి విత సేయుట
పోలదు గతమును గతమ్మె పో! కాదెపుడున్. 38

కావున గురుసన్నిధానమున కరుదెంచి నాకుం గలిగిన సందియమ్ములం బోఁగొట్టుకొని యున్న సత్యంబును కనుంగొను టెంత యేని కర్తవ్యమని తలంచి. 39

మనసు నిబ్బరముంచి బుద్ధుని స్మరించి
సదయానపూర్ణ సంకల్పమూరించి ప్రథమయత్నమిది
తొడుసు విడితంచు నోఁడదయో – తోడునీడ
యంచు భావించి యడుగు ముందుంచినాఁడ. 40

అని విన్నవించిన — 41

ఆ మాటలు విని యమ్ముని
ప్రేమమీఱ దయవాఁ బిలిచి – పిన్నవయసునం
దీ వెఱయు మీ వారల వీడి
బాముల కిరవైన తపము – పై మరు తేలా? 42

ఇష్టకామోపభోగాళి – కెల్ల నెల్ల
వైన సంసారమును మాని – యుందరాని
త్యాగ పరమావధికిఁ గాణ యోచితమైన
చిరతపస్సాధ్యముక్తి వాంఛింపనౌన? 43

ఎన్నటికైనను నరుఁడీ
సొన్నావాకిటిని దాటి - చూడఁగవలయుఁ
మిన్నైన ముక్తిసంపద
లన్నం బున్నదని నమ్ము - టడియాస గదా! 44

యుగములతరబడి ఋషిజను
లగచాట్లుం బెక్కుపాట్లు - నందియు గడకున్
నిగమాంత వేద్యుఁ గనుఁగొన
సుగమముగామి పలు శ్రమలఁ - జొక్కిరి వత్సా! 45

తాడి పయినుండి తలక్రిందు - ధరణిఁ దేళ్ళఁ
గలుగు త్యాగము గలిగిన - గాక ముక్తి
తేరకయె కోరినంత సా - ధింప నగునె
యెంత త్యాగమ్ము వలయు ము - క్తిద్యునకును. 46

పిల్లకాకికిఁ దెలియునే - వింటి దెబ్బ
యనెడి నానుడి వడువున - నప్పనీవె
ఋంగఁజాలుదె తత్త్వపః - సంగతులన్ను
నెమ్మదిగ నిలుసేరు మ - న్నిటికి మేలు. 47

అనినంత బాలు కనుఁగవ
దొనదొనమై యశ్రుజలము - దొరలెంచె వి
న్నవము నైడె మొగము హిమజల
కణపాత విపర్ణమైన - కంజము వోలెన్. 48

ఆ దృశ్యమంతయు నాలోకించి దీర్ఘతమమ్ముగా నాలోచించి హృదయమునుండి కరుణారసము పొంగి పొరలి యురలుచుండ. 49

మానికులాభరణము త
న్మాణవకుం జూచి నెనరు - మల్లడిగొన న
ల్లైన నిఁక వగలఁ బొగులక
మానిత గతి నుండు టెంతో - మంచిది వత్సా! 50

పిడుగు వడు నెడల జడియక
మడమనుఁ ద్రిప్పక గభీర - మతి నిల్చిన వీ
రుఁడె పోలె మెలఁగ జయమగుఁ
గడమగుచో నుభయతార - కముగాక చెడున్. 51

ఉన్న విషయములఁ జెప్పితి
నన్నియు విడువకయె; తావ - కాభీష్టమెటుల్
నన్నఁ గుతుకమ్మొ చెప్పుమనఁ
గ్రన్నన బాలకుఁడు తలఁపు - గాదెలఁ ద్రవ్వన్. 52

దూరయోచన లొనరించి - దొడ్డవార్త
సంయమీంద్రున కిచ్చెఁ బుష్పస్రజమ్ము
రాజశేఖరున కొసంగు - నోజ జట్టు
పట్టులన్ జట్టులెల్ల వి - భ్రమము సెంద 53

క్రక్కిన కూటియాస శున
కమ్ముల నైజగుణమ్ము తక్కఁ బెం
పెక్కిన జంతుజాలముల
కెట్టును నిట్టిగుణమ్ము పుట్ట దీ
వక్కణ మే నిజమ్ముటు లె
బాలుఁడ నైన మదాత్మ సంచల
ద్వాక్కు నివేదనమ్ము నరు
సం గమకించితి విన్నవించితిన్. 54

—: గు రు శ్లా ఘ న ము :—

అని సాష్టాంగ ప్రణతిని
బొనరించిన గురుండు డెంటమునఁ గృప యొంతేన్
దొనకంగ నభయహస్త
మ్మున లేపిన లేచి కేలు మోడ్చి వటుండున్. 55

గురు శుశ్రూషాపరుండై స్థిరుండై కొంత కాలమట గడుపఁగోరె. శిష్యుని శ్రద్ధాభక్తుల కెంతయు స్వాంతమ్మున సంతసించి తత్పురోఽభివృద్ధి నభిలషించి ప్రేమపూర్వకముగా నాశీర్వదించి. 56

పావన తత్త్వదర్శియు త
పః పరిపక్వమనస్వి సద్గురుం
డావల నిట్టి శిష్యుఁడొకఁ
డంచల పంచలనుండు మెంతో ప్రేమ

యోవిభవంబటంచుఁ దల
పుంచి కృపంగడుఁబెంచి యాశ్రమ
స్థావర సీమనుండుటకు
సమ్మతిఁజూపె సమాదరమ్మునన్. 57

అందుల కావటుండెంతయు సంతసించి ప్రణతి శతంబు
లొనరించి ధన్యజన్ముండనైతినని తనివి సనె. 58

అంతఁగొంతవడికి నందందు కొంగ్రొత్త
లరసి యరసి ముదమ్ము బెరసి బెరపి
గురుని సేవయందు మరగి సంశయముల్
దొరగి ధ్యాననిష్ఠఁ బరగి యుండె. 59

గురువే పరదైవమ్మౌ
గురువే మూర్తిత్రయమ్ము - గుర్వే గురువు వినా
పరదైవమే లేదని ని
ర్భర భక్తిశ్రద్ధఁగొల్చె - వటువాగురునిన్. 60

హరుఁడు శపియింప గురుఁడు నే-ర్పుమరఁ ద్రిప్పు
గురుఁడు శపియింప నేర్వఁడా - హరుఁడు కూడ
కాన, హరుకంటె గురుఁడె యెంతైన గొప్ప
యంచు భావించి సేవించు నహరహమ్ము. 61

ఆశ్రమ కార్య కలాపము
లశ్రమమునఁ దీర్చు; వలయు - నరణులు దర్భల్
విశ్రాంతి లేక కూర్చును
నిశ్రేయ సవాంఛఁదవిలి - నెరవేర్చుఁబనుల్. 62

గురుశుశ్రూషా పరతను
గురు తర బాధల సహించి కుంఠితమతిగా
కురుతర నిరతశ్రద్ధా
పరతనుఁ బాటించి చేయుఁ - బవలును రేయున్. 63

అగ్నిహోత్ర పవిత్ర కా - ర్యాదికమున
వలయు భండారములఁగూర్చి - భక్తిభావ
సంభరిత వృత్తి సేయు విశ్వాసమూని
తోడి విద్యార్థులెల్లరుఁగూడి మాడ. 64

ఏ పనిఁ జేయుచు నుండిన
నా పోవని భక్తి భావ - మాత్మస్థితమై
దీపింప నెల్ల పనులకుఁ
బ్రాపయి యాశ్రమము నెలమిఁ - బరిరక్షించున్. 65

ఆశ్రమముఁ జూడవచ్చిన - యర్థిజనుల
కబ్బురము గల్గ కోరిన - యట్టి వెల్లఁ
దెలిపి సంతుష్టిఁ గై సేయు - దేశికవరు
వ్యాపారము నొంపు నానంద - మగ్నపరతఁ 66

విహిత యజ్ఞము లొనరించు - వేళయందు
విపుల శ్రద్ధ వహించి మే - ల్మిని గడించి
నడవడిగ మించి విపుల వి - జ్ఞాన మెంచి
తారకాణయగుగ పవి - త్రతకు వటుఁడు. 67

ఊపిరి విడుటనుఁ గొనుటను
శ్రీ పరమపదాధినాథు - చింతన దప్పక
వ్రాపింపఁడన్యభావో
ద్దీపన విభవముల నే - యదృష్టము కలదో! 68

అట్టియెడ. 69

గురుతరభక్తి తత్పరత
గోప్యరహస్యము లెన్నొ నేర్చి బం
ధురతరతత్త్వవేత్తయయి
దొడ్డగొనమ్మున నుంటఁ జూచి సం
బరపడి తోడిశిష్యులట
భక్తవరా! యటంచు నా
దరమున బిల్వఁ బూని రెడ
దం గల ప్రేముడి పొంగి పొర్లఁగన్. 70

నిదురం బోయెడి వేళలఁ
గొదయగుఁ బరతత్త్వచింత - కొదమ సమయముల్
తుదకరనిముసమ్మోడయక
మదిలో నిశ్చల తపోని - మగ్నతఁ గోరుగ. 71

—: నిర్వేదము :—

'ఇంతకాలము వృథయయ్యె - నేమి చేసి
నట్లు జీవితమున వృజి - నాశనమున
బ్రదుకునటులాయె నిట్టి దు - ర్భర విషాద
మేదుర సమస్యఁదీర్ప నిం - కేది వెఱవు? 72

కాలానలకీలావళిఁ
గాలిన సామాన్య దేహిగతిఁ జెడితిఁ దపో
జ్వాలాభీలకరాళో
త్తాల ప్రళయాగ్నిఁ దనువ - దగ్ధం బగుటన్. 73

అని నిజాత్మన్ భావించి

ప్రకృతి గమనించి యిది పెద్ద - బంధనమను
గగనమునుఁ గని యిటు లెప్పు - డగుదుననును
గురుని వీక్షించి యిట్లాట - కును మఱెన్ని
హాయనమ్ములు బట్టు నం - చాత్మ నడలు. 74

కన్నుల నీరు వెట్టుఁదట
కాపడు వెల్వోలఁ బాఱు మోమునం
జిన్నతనమ్ము గమ్మినటు
చేష్టలు దక్కి విలీన మానసా
భ్యున్నతి లేచిపోవు మఱి [illegible]
[illegible] యొక్కెడ నిల్చు మహాపవిత్రభావా
స్కన్నత నొంది తేలుపడ [illegible]
[illegible] గౌరవమున్ గను [illegible] 75

అనుదిన మీ దినచర్యా
గణనమె యొక వంతు పాట - గాంగమ నెఱకల్
మనసు దిట్టపఱచను సంతస
మునఁ బల్వురలో నొకండు - పోలె మెలంగున్. 76

ఒక్కొకవేళఁ బ్రేతుకుల
కుల్లము లల్లనఁ బల్లవింపఁ బెం
పెక్కరమాధినాథు కథ
లెల్ల వచించు మఱొక్కవేళ నీ
టక్కరి సంస్కృతింబడిన
డక్కరు జన్మపరంపరాంబుధిన్
నిక్కవ మీఁచుఁ బల్కనుని
నీషులు యోచనసేయు డంచనున్. 77

తనలోఁ దానేమేమో
గొణఁగున్ దృఢగుణగణాలకృతిఁ బై
కొను నెక్కొను మన్ను నీయన్
పున మనసుం భోక కొలఁదిఁ - బున్నదుల్లితుండై. 78

సంద్రమందలి బడబాగ్ని చందమునను
తలఁపు బలుపులు నెలకొని - పులిమి పుచ్చఁ
దికమకంబడు నొక్కప్డు - తెప్పిరిల్లి
సంతరాత్మఁ గనుంగొన - నభిలషించు. 79

—: నివేదనము :—

ఒకనాఁడు ధైర్యమున దే
శికు పాదాబ్జములు ముట్టి – జేజేలిడి బో
ధకుఁ గాల విలంబన మా
టకుఁ గతమే ముందునని య – డంకువనడుగన్. 80

బదులిటులాడె సద్గురుఁడు
బాలునిఁజూచి కుమార! నే నెఱుం
గుదు భవదీయ దీర్ఘతర
గూఢ నిగాఢ విషాదవేదనల్
సదమలతత్త్వ సాధన వి
చారపరంబగు నీదు దీక్ష నె
మ్మది [illegible]
మానము దీరఁబరీక్ష సేసితిన్. 81

చటుల తరాగ్ని పరీక్షకుఁ
బటుమతి నెదురొడ్డి నిలుచు – భవజేతకె యి
చ్చ్బటఁదావు గావున న్హృ
త్పుట మానందాబ్ధిఁదోఁగ – హో నీవలనన్. 82

నీ కేది వలయునో నీ
[illegible] చెప్పుమా [illegible]
మో [illegible] పలుకవు నీ
[illegible] సకల – [illegible]. 83

నా విని బాలకుఁడంతయు
భావించి పునః పునః ప్ర - పంచావాస
వ్యావిద్ధ ఘోరనారక
జీవనముంగూర్చి యిటులఁ - జెప్పందొడఁగెన్. 84

"చనుబాల్మాటికి మాటికిం గుడువఁగా
జన్మమ్ములెన్నెన్నొ యె
త్తిన లాభమ్మది యేల కల్గును! జడాం
ధీభూత సంసార వా
రినిధిన్ గ్రిందికి మీఁదికిన్ మునుక ల
ర్థిన్ బ్రుంగుటల్ దప్ప యీ
యనుభూతంబిఁకఁ జాలుఁ జాలు దయ లే
దా నాపయిన్ సద్గురూ! 85

బహుళాజవంజవాంబుధి
నహరహమున్ మునిగి తేలి - యట్టిట్టయి ని
స్పృహుఁడై కాళ్లాడక దు
స్సహ దుఃఖములంది యిట్లు - చదికిలఁ బడితిన్. 86

ఈ గతి నెన్నిసార్లు జని
యించితినో యిఁక నెన్నిమార్లు దు
ర్యోగబలమ్ముచేత నిటు
లుద్భవమంది నికృష్టకష్ట సం

మన నీ పశ్చిమబుద్ధులన్ జడుల న
త్యాచారులన్ భీరులన్
మనసే లేని శిలాసదృక్షుల మహా
మాయామ దేద్ధత్యులన్. 90

లోకము పోకడఁ జూచుచు
నేకరణిఁ దనకు నేగి - యెయిద దటంచున్
వాకొను మోహకులం గని
రాకొట్ట ఫలమ్మొ జన్మ - రాశి యటుండన్. 91

కట్టెదురఁ గర్మ ఫలములు
కట్టి కుడుపుచుండఁ జూచి - కాల్గ దలుపకే
యట్టిట్టు నిట్టురాడటు
నిట్టక నిలుచుంట న్యాయ - నియతియె దేవా! 92

ఎన్ని భవమ్ములు దాఁటినఁ
బన్నుగ నాత్మానుభూతిఁ - బడయక కలదే
మిన్నగు విముక్తి జన్మము
లన్నమ్మిన నెన్నటికిని - లాభము గలదే. 93

అతిమధురమ్మలైన విష
యమ్ములె సౌఖ్యతమంబటంచు ను
ద్ధతమతి నెంచి తత్పథ ము
దారమటంచుఁ దలంచి లోకమం

చితగతి నమ్మి వెంటఁబడి
చిక్కక సౌఖ్యము సుంత లేక వం
చితుల తెఱంగు ద్రుంగ రె వి
శిష్టపథమ్మునఁ జెంగ రే గురూ! 94

పలుపలుకు లేల? భవరా
సులఁ ద్రుంపఁ బ్రశాంతిఁ బెంప - సూక్ష్మపథమ్ముఁ
దెలిపి యిది యంత్యభవమై
వెలయఁగ ననుఁ గరుణఁ బ్రోవ - వే గురుదేవా!'' 95

అని నిజాభిమతమ్ముం దేటపఱచినంత ___ 96

మలయకులాచలోద్ఘ సుకు
మార కుమార సమీర హారి పే
శల మధురాయమాణ నవ
సౌరభ వైభవ వీచికాతతిం
బలె గురుఁడానతిచ్చె నిటు
మంచిది నీ పరమార్థసాధనా
విలసిత రూపముం దెలుప
వే మును నేర్చినవెల్ల బాలకా! 97

అనవుడు దేశికవరునకు
మును బాల్యమునుండి చేయు భూరి తపస్సా
ధన విషయము లెల్లనుఁ బూ
సను గ్రుచ్చిన రీతిఁ బలుక - సాగెఁ దోడ్తోఁ. 98

"స్వామీ! చిన్నతనమ్మునుండియు నను
ష్ఠానక్రియావ్యాపృతిన్
నేమంబించుక తప్పిపోక నిజమ
న్వేషించు మార్గమ్ములోఁ
బ్రామాణ్యమ్ముగ ధ్యానధారణములన్
భల్లూకపుంబట్టువై
యే మాత్రన్ విడిపోక చేసితిని కా
నీ తృప్తి పొల్పొందమిన్, 99

ధ్యాతృధ్యానధ్యేయము
లే తీరుననైన నొంద - వేకత్వము సం
గాతమగు త్రిపుటి రహితం
బై తనరక తనివి సనుట - కాదరువగునే, 100

ధ్యాననిష్ఠాపటిష్ఠత - నలరువేళ
మనసు పరిపరివిధముల - మమతఁ బెరసి
నిలుకడయె లేక పొదలు చం - చలతఁ జెలఁగు
దీని పోకడ నెఱుఁగుటెం - తేని లెస్స. 101

శివజీవుల మధ్యను జగ
దవసరమునుఁ ద్రోయ మాయ - యటు మాయమగున్
దవులకిది యాత్మగతమై
ప్రవిమలమై యలరు గుప్త - పద్ధతిఁ జెపుమా! 102

మాటికి మ్మాటికిఁ బుట్టి భ
వాటవిలో మృగములట్లు – బ్రదికి తుది నిరా
ఘాట భయంకర మృత్యూ
ద్ఘాటనములఁ జావరే యు – ఘాతతము నరుల్. 103

నీ కరుణాలేశమ్మున
నైకభవార్జిత మహాఘ – నాశము గలుగన్
సోకోర్చి శాంతిఁ జేర్చెడు
ప్రాకృతిక తమ్మున బడఁపవలె – గురుతరణీ! 104

—: అనుభవము :—

తొలుదొల్తుత కటికి చీఁకటి
వలెఁ బిదప నలంతి వెలుగు – పై నెత్తని డాల్
వెలలి తెల్లి జిలుగు వెన్నెల
యలమి పయిం బలుకరాని – యలకని స్థితిలో. 105

నిలిచియు మమతాహంమతు
లొలయక నీరవత నేమి – యుం దోఁపక తత్
ద్వ్యాలులిత లీనస్థితి నే
నలవోక నెఱుంగనైతి – నావలి యెఱుకన్, 106

చేష్టలు దక్కి వసించితిఁ
గష్టించితి నిట్టు కొంత – కాలమ్మయ్యున్
దుష్టియుఁ బుష్టియు గిట్టక
[illegible] 107

దీని రహస్యార్థము వి
జ్ఞాన నిజాకృతియు నిత్య – సత్యముఁ దెలియం
గా నేర నిందు కనికర
మహాని ప్రబోధించి నన్ను – నోము౦గదవే. 108

ఎన్ని శాస్త్రమ్ములనుఁ జరి – యించ నేమి
మేలు గల్గున తద్గురు – కీలకమ్ము
సద్గురు ముఖమ్మునన్ బొంద – జాలకున్న
నిష్ఫలమౌ నాట వేయింట – నిష్ఫలమ్మె. 109

చిన్నతనమ్మునుండియును
శిష్టజనుల్ వివరించు శాస్త్రముల్
విన్నను పెక్కు గ్రంథములు
విజ్ఞత మైఁ బఠియించినన్ గురుల్
విన్నను వొప్పఁ జెప్పినవి
వీనుల విందుగఁ గొన్న యాత్రలన్
జన్న గురుప్రపూర్ణకృప
సాగని దే ఫలియింప దేమియున్. 110

అనుభవమింత లేక మరి
యాదను నేర్చిన లాభ మే సఖా
జనులిటఁ డెంత గొప్ప యని
సమ్మతులిచ్చిన మేలె తత్పరో

తు. నిరుపమానుభూతి విర
సంబగుచో మఱి శాస్త్రమట్కవా
సన లవమేని లాభమిడఁ
జాలునె? మాటలు కోట దాటునే? 111

అన్నియుఁ జేసి చూచి యిఁక
నాదర బాదరఁ బోయి సద్గురున్
గన్న ఫలమ్ముగాని యిటు
గ్రచ్ఛపాదర్ జెయి దూర్చినట్లు కై
కొన్న స్వబుద్ధితోడ సమ
కూరిన నైష్ఠిక చర్యలెల్లఁ బొ
ల్లన్న నిజమ్ము తెంగి మహి
తాత్మక నీ దఱిఁ జేరితిన్ దుదిన్. 112

ఈ యాధ్యాత్మిక విషయము
లో యా యెడ నేర్చినవి ని - రాలంబము లె
న్నో యున్నవి మేధస్సున
బ్రాయిడి నే జెప్పఁజాలఁ - బ్రభుసన్నిధిలో. 113

శివజీవ జగద భేదముఁ
దవులమి మఱి నిండుదనమె - దన్ బొదవమి మా
నవ సహజావస్థలయిన
యివులెం దాటంగనైతి - మేలకువను గురూ! 114

ఏ సందేహము లేకొఱంతలును నా
కేమాత్రముఁ లేవు మి
థ్యా సంసారమునుం దరించుటకు నెం
తైనఁ బ్రయత్నించుచో
దోసంబే లవలేశ మేని కలదా?
దూరీకృతాశావళి
వ్యాసంగ ప్రకరుండఁ గాని తరణో
పాయమ్ము బోధమ్ముగన్. 115

నిమిసము సమాధి సంస్థితి
కమరిన సుఖలేశ మేని - యనుభూతిని లే
క మరు స్థిరా జలమ్మటు
కొమరుఁ విడి సిద్ధిలేక - కూర్చుంటిఁ గటా! 116

ఈ విషయ మెఱుక పఱచిన
పావన పీయూష పాన - పరవశమతి మ
జ్జీవితము ధన్యమగు నో
దేవా! కరుణించి పరముఁ దెల్పఁగ వలయున్. 117

జీవిత సర్వస్వ మ్మీ
పావన విషయమునఁ బొందు - పడునటు నెమ్మిన్
దీవించి కావు మదియే
వేవిధములఁ గోరువాఁడ - విద్వన్మౌనీ!” 118

అని భక్తి ప్రపత్తులతో విన్నవించిన విని యాశ్చర్య చకితుండై మందస్మితమ్ము వదనమ్మునందొప్ప కొంతవడి యాలోచించి నిజానుభూతి తరంగితం బగుచు మెల్లన దగ్గఱకుఁ జేరం జీరి యా సద్గురు దేవుం డిట్లనియె. 119

—: ఉపదేశము :—

"నాయన నీ యభిమతమును
నీ యనుపమమైన త్యాగ - నిరతియు మఱి ధ్యా
నాయత్తచిత్తవృత్తియుఁ
బాయక గమనించుచుంటి - బహుముఖములుగా. 120

అది 'బ్రహ్మవిద్య' సుమి యని
పదుగురు పేర్త్తి పిలుచు - పరతత్త్వాత్మా
కుదురైన భూరివిద్యా [illegible]
సదనంబది తలచు మాత్ర - సంతసపడునే. 121

నిరతాభ్యాస చికీర్షా
పరతం జేసిన కొలంది - స్వాధీనమగుఁ
బరులిచ్చి పుచ్చుకొనుటకుఁ
దరమే యిది సహజ సంస్థి - తంబగు బిడ్డా! 122

అభ్యసించిన కొలఁది స - హజమగుచు ని
జాత్మ సంస్థితి యనుభూత - మగును జూవె
యదియపో ముక్తి నిర్వాణ - మనఁగ నదియె
యదియె విడుదల పరతత్త్వ - మదియ చూవె. 123

ముప్పదియేండ్లనుండి జప
        ముం బొనరింప ఫలించె నాకు నీ
గొప్ప తపో విభూతి; యిది
        కూడెను మూఁడవ యేట నీకు నో
యప్ప! భవత్పురాభవ మ
        హత్తర పుణ్యఫలానుభూతిచేఁ
దప్పదు సుమ్ము భావి శుభ
        దమ్మగు ముక్తి ఫలమ్ము నమ్ముమీ! 124

విసువక నసుకుం జెందక
నసిచెడక జడమ్ముఁ గొనక – సందియపడక
ప్పస మెద దీక్షామతి న
భ్యసన మ్మొనరింపఁ గలుగు – ఫలితము త్వరగా. 125

ఉలుక తటి జరిగెనని వే
గిరపాటొందంగ నేల? కేవల సమత
బెరసి యుదాసీనతఁ గను
పరమార్థ ఫలానుభూతి – వడయుట యరుదే? 126

కాన పరభక్తి భరిత
జ్ఞానమ్మునఁ బరునిఁ గొల్వఁ – జను మాటలలో
న్యూనాధిక్యము లెంచుట
మానుగ పిల్లి తల గొఱుగు – మంగలి కెనయౌ. 127

పరిణత తపో మహిష్ఠ
స్థిరభక్తిఁ గొల్చి కొలఁది – చిరవైరాగ్యం
బురుతరమై నిష్ఠాత
త్వరపరిణత బుద్ధి వెలుగు – బక్వస్థితిలో. 128

శమదమాహింస లెవనిక – గ్గమయి వెలయు
వానికీ రేడు లోకముల్ – వశములగును
వాని పాలనమే ధరా – వలయమందు
మానికపు జోతివలె వెల్గు – మానితముగ. 129

మనసుం బోకడ లాపిన
మనుజుఁడె ముక్తాత్ముఁడని ప్ర – మాణవచన మ
మ్మనసు జయింపని మనుజుఁడు
దనుజుండగు వాని కేల – తత్త్వార్థమ్ముల్. 130

ఒరులకు నుపదేశించెడు
పరిణత మతు లాచరింపఁ – బ్రాల్మాలి యితః
పర మెఱుఁగక పల్కుదురా
చరణ విహీనులకుఁ దావు – జగతింగలదే. 131

జడనుడిగి యుడుము పట్టున
నడ గొండ కడింది నిలిచి – నానార్థములం
దెడ నెడమీయక చిడిముడి
పడక స్థిరత్వమునఁ జేయు – వలెఁ దపము వడిఁగా. 132

ఏమరు పాటును విసుగునుఁ
భ్రామక తొందఱలు లేక - పక్వస్థితిలో
నేమియు చెడు గడరిన వెఱ
తో మదిఁ జలియింప కుంట - దొడ్డతపమ్మా. 133

మితభాషణ మితభోజన
మిత నిద్రాదుల గణించి - మెలఁగుటయె తపో
వ్రతులకు ముఖ్యమ్మితరుల
కతలం దడవంగ నేల ? - శాపథ మగుటన్. 134

ఏయే వేళలఁగార్యము
లేయే విధిఁ జేయవలయు - హెచ్చరిక నటుల్
జేయుటయే విధ్యుక్తం
బా యనువునఁ జేయకుంట - యఘకారి యగున్. 135

ఒరుల పనిపాటులను బ్రవే
లిరికించినఁ గీడటంచు - నెఱిఁగి హితవునన్
జరియింప సాధనాదులు
గుఱి పడుఁదొడుసింత తగ్గు - గోత్తలు వాయున్. 136

ధనమునుఁ గోల్పోయిన యు
జ్జనుఁడయ్యది వెదకు పగిది - సత్యాన్వేష
ప్రణయుల తత్పరమతి త
త్త్వణవార్థస మార్జనమునఁ - బాటు వడఁదగున్. 137

క్షేత్రమ్ములుఁ దీర్థమ్ములు
యాత్రల నొనరించు టెల్లఁ - ద్యాగ నిరతికై
సూత్రోద్బోధనలగు నిత
రత్ర ఫలం బల్పమయి ప - రార్థము నేర్పున్. 138

ఏకాంత వాస పరతను
శ్రీకమలానాథు మీఁద - చిత్తము నిలుచున్.
పై కొను నిర్మలమతి సు
శ్లోక చరిత్రము లభించు - శుద్ధాత్ముం డగున్. 139

పరిపరివిధ విభ్రమణ
త్వరమాణ మనస్సు స్థైర్య తత్పరమగు శాం
తిరమ కయిదండ చేరును
చరమార్థము నందె ధ్యాన - పథులయు వెలుగన్. 140

ఎన్నొ యవరోధములు - గల్గు గనంత లేసి
కష్ట నష్టమ్ములో కల్గుఁ - గడకుఁ దనువు
శిథిలమగు నట్టులైన నే - చేతు నంత
లేక ధ్యానమ్ము సాగింపు - మేక ధాటి. 141

ప్రకృతి నిరోధించిన నై
హిక బాధలు గల్గినన్ ము - తేమయిన సరే
తికమకపడ కెడ ధ్యానా
ధికమును విడకుండు టొప్పు - దృఢతర దీక్షన్. 142

దృశ్య మ్మెన్నటికయినన్
నశ్యమ్మని యెంచి బోధ - నాపరతం దదా
వశ్యక కర్మ లొనర్పక
భ్రశ్యద్గతి మెలంగు టెంతొ - పాపకరమ్మౌ. 143

మొదలం బిడుగులు వడినను
భూదివములె యొడ్డగిలినం బొనుగు వడక యెం
తే దిన చర్యావసర మ
నాదృతి విడువం దగ దజుండె - యడ్డంబైనన్. 144

ఫలితము కనుపడ లేదని
యులికి పడక వేగిరంపు - టుబ్బలి దిగ క
ర్మిలి నోర్మి నుండి తపమున్
సలుపన్ ఫలిత మొనగూడు - సమయస్ఫూర్తిన్. 145

అని తోంచిన విషయమ్ముల
ననునయమున బోధపఱచి - యనుదిన నిష్ఠా
ప్రణిహిత విధులన్ బల్కిన
విని శిష్యుండు లేచి భక్తి - వినమిత ఫణితిన్. 146

చుట్టు వాఱి ప్రదక్షిణ మట్టె చేసి
సాగిలంబడి గురుపదా - బ్జాతరజము
శిరమునం బెట్టి భక్తి జే - జేలు గొట్టి
యా గురుని యానం జేరె - నిష్ఠాశ్రమమ్ము. 147

గురుఁడు ప్రవచించినటుఁ గయికోలు సేసి
నియమ నిష్ఠలఁ బెనుపొంది - నిజమనీష
నాత్మ దిక్కుగ నిల్చి ఘో - రాజవంజ
వాబ్ధి నిస్తారకోపాయ - మర్థిఁదలఁచె. 148

ఈ లీలఁ గొంత తఱియు
ద్వేల తపశ్శక్తి దొరయ - విశ్రాంతియె లే
కాలంబిత నిజతత్త్వ
శ్రీలోలుండయి చరించె - స్థిరతర ధిషణన్. 149

విడువక మడమనుఁ ద్రిప్పక
యొడఁబడి తడఁబాటులేక - యుడుకువమది నె
ల్లెడఁ గడుసరి తపమునఁ బా
ల్పడి యొడలున్ మఱచి మేలు - పడి పోయి గనెన్. 150

ఒదవిన నిజసుఖ సంవి
త్పదవిని బట్టాను పూర్విఁ - బరమగురుదరిన్
బ్రిదిలిన మది ఛాత్రుండో
ప్పిదముగ నప్పన మొనర్చెఁ - బ్రేమార్ద్రమతిన్. 151

—: శ్రీ నారాయణ గురు సందర్శనము :—

ఇట్లుండ నొక్కనాడు గురువర్యుండగు శ్రీ సిద్ధశివలింగ గురుండు శిష్యునిఁ జెంతకు రాఁ బిలిచి "వత్సా! నీయందెక్కుడు ప్రేమ కలదు గాన నీ విషయము నొక్కి వక్కాణించుచున్నాడ. నీ భావ్యభివృద్ధియే పరాకాష్ఠగ భావించిన



సిద్ధపురుషులగు

శ్రీ శ్రీ శ్రీ నారాయణ గురుదేవులు.

శివగిరిమఠము _ వర్కాల

శ్రీవారి పరమ గురుదేవులు.

తరుణాదిత్య మయూఖికాచయ మహో
ద్యద్రూప సంప్రాప్తితో
మెఱయం జాలినయగ్గురూత్తముని న
మ్మింజేరి తత్పాద పం
కరుహ ద్వంద్వ సమీపభూమిఁ బడి చ
క్కన్ మ్రొక్కి యో సద్విదా
వర! కాపాడఁగదే యటంచు నుతియిం
పన్ సాగె భక్త్యున్నతిన్. 153

గురు తత్త్వార్థ రహస్యము
గుఱుతెఱిఁగి నిజమ్ముఁ దెలియ కోఱకు గురుండి
త్తెఱఁగునఁ బంపెను తావక
చరణాంబుజ సన్నిధికి వి – చారణమునకై. 154

కావున కరుణామృత సం
ప్లావిత హృదయమున నన్ను – మన్నించి మహా
గ్రావాభ ఘోరసంసృతి
చేవ యుడిపి కావుమయ్య! శ్రీ గురుదేవా! 155

అని వినయ నతశిరుండయి
మనమున గురుభక్తి యుక్తి – మల్లడిగొన వే
డిన గని గురుదేవుండా
య్యన లేవం దీసి శిష్యునండకుఁ జేర్చెన్. 156

తదుపరిశిష్యుని విషయము
లెదఁ దెలియం గోరి వాని నిట్లడిగెను నీ
వెది కోరి వచ్చితివి; నీ
యుదంతమది యానుపూర్వి - నొగిఁ బల్కు - మ్మయా! 157

అనిన వెనువెంట తడవుకొన కున్నదున్నట్లు కన్నది కన్నట్లు గురుసన్నిధానమున విన్నవింపం దొడంగి — 158

తా నిల్లు వదలినది మొద
లా నాఁటివఱకు జరిగిన - దంతయు శ్రద్ధ
బూని యెఱిఁగించె స్వాగతం
బైన సమాచారములు నయమ్మొప్పారన్. 159

—: గుర్వనుగ్రహము :—

అయ్యది విని శ్రీ నారాయణ గురుదేవుం డెంతయు నచ్చెరువడి పిన్నతనమ్మున నే యంత వివేక వైరాగ్యమ్ములతో నా వటుండు నిశ్చల స్థితప్రజ్ఞుండగుట కెంతయు నలరి నిలువెల్ల పొంగి పొరలిన యుత్సాహోద్వేగమ్మున నపరిమిత కుతూహలాయత్తచిత్తుండై కడుంగడు నభినందించి యాశీర్వదించె. తదుపరి యగ్గురువరేణ్యుని యాశ్రమంబునఁ గొంత కాలము నివసించి గురుసేవాపరాయణుండై కాలము గడపుచు నాడనాడ తన కొదవిన సందియములు దీర్చుకొనుచుండె. పిమ్మట నొకానొక సమయంబున గురూత్తముని దరికిం జేరి ప్రవః

పునః ప్రణామంబు లాచరించి తన పయనంబునకు సెలవిమ్మని పారిం బారి వేడికొనిన నయ్యతీంద్రుం డమందానంద కందళిత హృదయారవిందుండై పావనభావంబున లోకోద్ధారక కార్య కలాపదక్షుండుకానున్నాడితఁడనియూహించి తదర్థమై శ్రేయమను సంధించి యమోఘాశీర్వాదామృతవర్షము నుత్కర్షముగా గురిపించి తదుద్దేశమునకు సమ్మతించిన — 160

నారాయణ గురుదేవు న
పారకృపాపూర్ణ మధుర వాఙ్ముఖమునకుఁ
దోరమ్ము మీఱ జీవిత
పారమ్యము గూరినట్లు - వటువలరారెన్. 161

వచ్చినదానికి సఫలత
హెచ్చెనటంచుడుకువను గ - ణించి గురునెడఁ
నిచ్చలుఁ దలపోయుచు మది
మెచ్చిన పయనంపుటూహ - మెలపుం గొలుపన్. 162

సంప్రదాయానుసారంబుగా నగ్గురుదేవుని వీడ్కొని కతిపయ దినంబులకు శ్రీ సిద్ధ శివలింగ గురుస్వామి సన్నిధానంబునకుం జేరంబారి యద్దేశికుని పాదారవిందములకు వందనము లొనర్చి జరిగినదంతయు విన్నవించి తదామోదముద్ర వడసె. అట్లు — 163

శివలింగ గురు పదాబ్జ
ప్రవదతుల మరందపాన - జనితోత్సాహ
ప్రవణత సేవా జీవిత
మవలీలన్ వటువు గడపె - నబ్దత్రయమున్. 164

ధీరవరులు మెచ్చునట్లు
తృప్తజీవితమ్ము సం
స్కారయుతముగాఁ జరించి
సాధుపుంగవుండవై
పారమెయిద సంతసమ్ము
పారమంది హాయియై
పారఁ గనుచుఁ దత్త్వవేత్త
వై సుఖించు సద్గురూ! 165

ఇది శ్రీ వైద్య విద్వత్పండిత సత్కవి నారనాగనార్య మహాశయ
విరచితమగు మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వామి
చరిత్రమునందు ద్వితీయ ఘట్టము.





మహర్షి సద్గురు

# శ్రీమలయాళస్వామిచరిత్రము

అను

## అసంగానంద విజయము

### తృతీయ షట్కము

గీతాశాస్త్రోద్బోధ
ఖ్యాత! సమస్తాంధ్రలోక - కల్యాణకరా!
జ్యోతిస్స్వరూప! మహిళా
ప్రాతఃస్మరణీయచరిత! - బ్రహ్మవిచారా!

ఇది యిటు జరుగఁగ నొక నాఁ
డదవదగాఁ జర్చ జరిగెఁ - ద్యాగనిరతియుఁ
మది కుదురుపాటు కష్టము
లోదవ సహించుటయు నెట్టు - లోదవు నటంచుఁ. 1

తైలబిందువు నీట నంతటను విరియు
పగిది తీర్థాటనమున స - ర్వవిషయములుఁ
దెలియుఁ బండిత సేవ ప్రా - ప్తించుఁ దుదకు
బుద్ధి వికసించు సమదృష్టి - పొడము నరుల. 2

తీర్థయాత్రలవలన వి - ధి ప్రయోజ
నములం దొలిఁబొందు పాపమ్ము - నాశమగును
సవ్యవిజ్ఞానకారి సం - స్తవ్యమిద్ది
సాధువులు సేయఁ జొప్పని - సద్గురుఁడన, 3

గురు నాజ్ఞ శిరముపై నిడి
పరి పరి విధ కీర్తనములఁ - బ్రస్తుతి సేయన్
దారకొని దేశాటన త
త్పరుఁడయి యచ్చోటు వీడి - తరలెడి బుద్ధిన్. 4

తీర్థయాత్రాఽభిగమనము - ద్దేశపూర్వ
కముగ సల్పుటవలన ని - క్కముగ భావి
కాలమునఁ దనయునికిఁ - గట్టి వచ్చు
స్థలము నిర్ణయ మొనరింప - వలనగునని. 5

ఒకనాటి యుషస్సమయమున దూరమాలోచించి సద్గురు సన్నిధికల్ల నల్లనఁ జేరి చల్లగా మెల్లగా తన యభిమతము నిట్లని వివరించె — "ఓ పరమగురూ! తమ యాదేశానుసార మిప్పుడ తీర్థయాత్రలకుం బోవ నభిలషించుచుంటిని. తమరు నిందు దయ నను(గ్రహించి యీ మీ శిష్యుని కార్యమనుకూల మగునట్లాశీర్వదింప ప్రార్థించుచున్నాఁడ" ననిన శ్రీ సిద్ధ శివలింగ గురుశేఖరుండు 'తథాఽస్తు' అని అభయహస్తంబిచ్చిన తోడనే సాష్టాంగ దండప్రణామం బొనరించి బయలు వెడలి సరాసరి నెల్లండుర్యార్థఁ జేరి పడక బెట్టియుండిన వృద్ధమాతృ

దేవిని సేవింపఁ గొంతకాలముండి తీర్థయాత్రోన్ముఖుండై చననిశ్చయించియు హఠాత్ప్రయాణ త్వరితగమనమ్మున కొకింత యాలోచించి వెంటనే యింటి పిన్న పెద్దల కూటమి గల్పించుటకై నిజాభిమత ప్రపూరితముగా నిబంధించిన యొక చిన్న కమ్మ నట నుంచె నది యెట్లన — 6

—: లేఖ :—

"ఇలు విడనాడిపోవునను
నెక్కటిగాఁ జనె నంచు నేమికీ
డొలయునో యంచు నెన్నటికి
నూరునుఁ జేరునో యంచుఁ గూడు నీ
ళుల కెటు కుందు చెంది బడ
లుం బడునొక్కొ యటంచు నెమ్మదిన్
గలఁపఁగ నూరు నాఁడు వెదు
కన్ వలదిద్ది ప్రయాసయే సుమీ! 7

మీ కొడుకొకఁ డిలు వెడలిన
శోకింతురు జగమె పోవ - సుడియరు మది మా
యాకల్పిత గుణమిది విడి
సాకల్యము సామ్యమతి నె - సంగు టుఱవగున్. 8

లోకంబున నెందఱో య
స్తోకఁ దపించెదరు వారి - కై వగచితిరా
మీ కొడుకని భ్రమ యేలొకో
శోకము నాకేన్యమగునె - లోఁదలఁపుఁడికన్. 9

ఎందాఁక తిండి తీర్థము
లందిత్తురో పేదసాద – కందాఁక మత్తే
సందియము లేక తనువునుఁ
జెందెద భోజన సమృద్ధి – స్వేచ్ఛా సిద్ధిన్. 10

వెదకు పని మాని నాకొఱ
కదవద మది వదలి యీశ్వ – రాయత్తమతిన్
కుదిరిక నుండుడు శుభసం
పదఁ బొందలుదుఁ దథ్యమిద్ది – భయపడ నేలా? 11

ఈ యనంత జగత్త్రయి – హృదయ కుహర
మందు నెక్కొల్పి రక్షించు – నభవుఁ డండ
దండ నుండ నిజాభిమ – త ప్రపూర
ణార్థ మొక ప్రాణిఁగూర్చి డ – య్యంగ నగునె? 12

తనవారని పెఱవారని
మనమున భిన్న స్వభావ – మతముండిన యం
దనుకన్ శోక విమోహ
ప్రణాళికల గెలువఁ గలఁడె – ప్రాజ్ఞుండైనన్". 13

అని యొక యలంతి కాగిత
మున వ్రాసి పురోణిఁ జేసి – పుస్తకముల పై
పైని దానిం బెట్టెను మును
పని వడి శోధించువారి – వశమగు నంచున్. 14

మఱియుఁ దాఁబరుండిన పడుకపై నొరులెఱుంగరాని విధమున నొక మొగలిచాపఁజుట్టినదానినునిచి దానిపై దుప్పటిఁ గప్పి యెప్పటి యనువు చొప్పున కనపడునట్లు గావించి ప్రేక్షకుల కన్నొఱంగించి — 15

—: తీర్థయాత్ర :—

అర్ధరాత్రమ్మునందు నాత్మాభిమాన
మొండె చేదోడు వాదోడు నొగిలగింపఁ
బూని పయనించె దేశకల్యాణకార
ణాత్తజన్ముండు వేలాయుధాభిధుండు. 16

కాలిసడి యింటివారెఱుఁగంగ లేదు
పడుకకునుఁ దట్టి లేపని పయనమగుట
పంచభూతము లెఱుఁగ వవ్వార్తఁగడకు
నింటివారల కెఱుఁగ వీలెందు గలదు? 17

నడయాడి యాడి నడచిన
యెడఁ బండక పండినట్టి - యెడ నిలువక కా
ల్నడ నడువసాగె బిర బిర
గడనకు నోడఁబడిన వర్త - కవరుని వోలెన్. 18

కాయో పండో యాకో
యే యెడ దొఱకినది యచటనే - దిని పైపై
రాయన్ జేయిన్ జేయున
దాయెడ నొండేమి లేమి - నవశాత్ముండై. 19

చెట్టుల్ బుట్టలు డాలు అప్పలును గం
చేఁ కానలుఁ గోనలుఁ
గట్టుల్ మిట్టలు దాట్టి కట్టకడనుఁ
గట్టమ్ములుఁ సెట్టలున్
మిట్టాడంగల జీవితాధ్వచరుఁడై
మెండొడ్డి తాఁ బోవుచున్
గట్టాసన్ పరమార్థసారవిదభి
జ్ఞామాత్ర సంకల్పుఁడై. 20

ఆశామయ జీవిత మిటు
శ్రీశాంఘ్రి సరోజ మాధురీ మృదుమధుపా
నాశా వేశా వశమతిఁ
బ్రాశస్త్యగతిన్ జరింపఁ - బట్టుంబట్టెన్. 21

నరక సమాన సంసృతి ఘు
నత్వరవీడి చరింపఁజాలి తం
చరమున నేది కన్గొనిన
నావలఁ గన్గొన నేది లేదొ త
త్పరమ పదార్థసంగ్రహణ
భాగ్యవశంగతుఁడౌట కెంతయుం
బురఁబురఁ బొక్కుఁగంట తడిఁ
బూను పునఃపునరాత్మ చింతనన్. 22

ఆఁకలి దప్పు లెఱుంగడు
సోఁకెఱుఁగఁడు దారి నడచు - చొప్పెఱుఁగండ
త్రాక మెయి లక్ష్యసిద్ధికి
శోకించును గాని యెట్టి - సూక్ష్మమతమ్మా. 23

తన తలఁపు కొలది వెంబడి
ఘన సంవిత్సహచరిత్వ గతిమై తానే
గను సంగరహిత మే తన
యనుపమమగు ధ్యేయ సిద్ధి యగునటు వడిగాన్. 24

అడువుల నిడుమలు గుడుచుచు
బడిబడి సెలయేళ్లు దాటి - పర్వత శిఖరాల్
గడచుచు దొరికిన యది సా
పడుచున్ నిడుచక్కి దారిఁ - బడి యరుగు నెడన్. 25

ఆ యీ యెడబోయిన మదిఁ
బాయక యాత్మాఽనుభూతి - పయి నయగతిబి
ట్టాయితమగు విడుమర నెపు
డే యెడఁజూపట్టఁ డించు కేనియు భళిరా! 26

ఇరువది ముప్పది మైళుల
వఱకున్ బ్రతిదినము - తీర్థపర్యటనేచ్ఛన్
దొరకొని ప్రతిజ్ఞ సేసిన
తెరగునఁ జరియించె స్వామి - తీర్థములరయన్. 27



18–21 సం॥ మధ్యకాలమున పాదచారులై తీర్థయాత్ర చేయు
శ్రీ గురుదేవులు

కేవల పాదచారియై తానొనర్పం బూనిన తీర్థయాత్రా సందర్భమున ముఖ్యములగు పుణ్యాశ్రమములలో మాత్రమే రెండు మూడు దినములుండవలెనని నిశ్చయించుకొని అపరిగ్రహము నేక భుక్తము మున్నగు నియమంబులం బూని చరించుచు క్రమమ్ముగా పశ్చిమ పర్వత ప్రాంతంబులం దాటి యెడనెడ ననేకాశ్రమములు, మఠములు, తీర్థములుఁ జూచుచుంబోయి శ్రీమధ్వాచార్యులు నిజమతమును ప్రబోధించిన దివ్యస్థలమగు "నుడిపి" క్షేత్రంబును సందర్శించి యటనుండి కదలి "సుబ్రహ్మణ్య" మును సేవించి యావల మతద్వేషాపహారకమ్మగు శ్రీ శంకరనారాయణక్షేత్రమును శ్రీ మహాబలేశ్వర నివాసమగు గోకర్ణమునుఁ గడచి మహారాష్ట్రప్రదేశంబునం బ్రవేశించి భక్తిరూపెత్తెనో యనంబరగు పండరీపురంబుం జేరి 'విఠల్'నామ శ్రవణమున జన్మము ధన్యమైనట్లు సంభావించి చంద్రభాగా తీర్థంబునం గ్రుంకులిడి యటనుండి వెడలి నర్మదానదిం జేరి యందవగాహనమ్మొనర్చి తత్తీరగతుండగు శ్రీ మదోంకారేశ్వరుని దర్శించి పిదప దత్తాత్రేయుండు తపంబొనర్చిన 'గిర్నారు' పర్వతముం జేరి యందుండి శ్రీకృష్ణుని బాల్యమిత్రుఁడగు కుచేలుని నివాసమైన సుదామపురి మీదుగా ద్వారకానగరముం జేరె.

అట పది దినములు నివసించి తనివిసని యాపై నానక్ భక్తులకు నెలవగు గురుద్వారముం బ్రవేశించి

యీవల యమృతసరమందలి దివ్యశిల్ప కల్పానల్పమగు స్వర్ణ మందిరమున కరిగి యచటి శిక్కుల భక్తిశ్రద్ధల కలరి యట నుండి తిరుగు మొగంబయ్యె.

మఱియు నితఃపూర్వ మెచ్చోటవిడిది దిగియుండెనో, ఆచ్చోట మఱలఁ బ్రవేశింపక నూతనాశ్రమముల దర్శించుచు నందును నొకపూట మాత్రమే నివసించుచుఁ గ్రమప్రయాణ మ్ముల చైతన్య సంప్రదాయ విశిష్టమును, అనవరతఁ 'రాధా కృష్ణ' నామోచ్చారణ పవిత్రమునగు యమునాతీరమునఁ గల మధురానగరమ్మును, తదనుగతమగు గోకులబృందావన మును, గోవర్ధనమును సందర్శింప నెంచి చనుచు నడ్డుదవిలిన యొక పెద్ద యేటిని దాటవలసియుండుటచే నయ్యేరవడి పర వడిని లోలో గమనించి పొంగి పాఱు గంగమ్మ వేగమ్మున కానందించుచు దాటుటకు వీల్గాక నావికుల కిచ్చు 'కేవు చీటీ' చేతిలో రూకలు లేక కొఱత యోచించి సహాసాహసో పేతుండు గాన ధైర్యమున మేరువును మించఁదగిన మొగ్గు గలవాఁడగుట కతన తటాలున నదీమతల్లికి జోహా రుపలిచ్చి గబాలున దుమికి కొంతదూరమీదులాడుచుం బోవు పోవు కాలుచేతులు సచ్చువడి యుట్టకేలకు సొమ్మసిలి యవశస్థితిఁ దత్తీరంబు వెంటఁ గొట్టుకొని చనిచని భవిష్య దాంధ్రదేశోద్ధరణార్థమై యగతిక జనసాహాయ్యార్థమై తుల మహాగ్రహాంకార నిర్వికారామ గర్వధూర్వహుల పెంజీకటి తెరల కనుమాపన్నఁ గూర్చుటకై జీవనవాయువులు నిలుపుకొన్నాఁడో

మున నేదేవుని దివ్యకటాక్ష సాక్షాత్కారబల విశేషముననో తెలుఁగువారి పుణ్యపుంబంట పండించు సమయమాసన్నమైనదో యననొక యపూర్వ ప్రతిభావిశేష దైవసాహాయ్యాకరావలంబనమున గట్టుజేరి యొడలు దుడుచుకొని ద్విగుణీకృతోత్సాహుండై హుటాహుటిం బయనించి – 28

పావనజీవితమ్ము గడు
పన్ దలపుం బలుపంది తాను బృం
దావనమందు ధ్యానపర
తన్ గడపెన్ నెలనాళ్ళు భక్తిసం
జీవని దోహదంబుగ వి
శిష్టపథైక చరిష్ణుఁడై ప్రభల్
కేవల రూపమెత్తి తుల
కించిన యా శుఁడనంగఁ బొల్చుచున్. 29

తదుపరి గీతాప్రబోధ పవిత్రస్థలమగు కురుక్షేత్రముం జేరి మువ్వారు గీతం బఠియించి యందుండి బయలుమెఱసి బదరీనాథ క్షేత్రమ్మునకు గోపుర ద్వారమనందగిన హరిద్వారముం జేరె.

పిమ్మట నచటి కనతిదూరమున శ్రీమద్దయానంద సరస్వతీస్వామి పరిశ్రమ ఫలితమని యెన్నఁదగినదియు, జాతి మత భేద వివర్జితమును, గుణైక ప్రధానమునగు గురు కులముం దిలకించి భావి కాలమున నట్టి గురుకులము స్థాపించి లోక సేవఁ జేయవలెనని తలపోసె.

తదనంతరము హృషీకేశముం జేరి మహాతపస్వియు 'పక్షపాత రహితానుభవ ప్రకాశ' కృతికర్తయు నగు శ్రీ కాళీ కంబళ బాబాచే స్థాపింపఁబడిన స్వర్గాశ్రమాది బహుళసంస్థల నెడ నెడ నవలోకించుచు నటనుండి వ్యాసుఁడు తప మొనర్చిన తావును, శ్రీ శంకరుఁడు బ్రహ్మ సూత్రములను వ్యాఖ్యానించిన ప్రదేశము నగు బదరికాశ్రమమున కరిగి అలకనంద యందు సుస్నాతుండై శ్రీ బదరీ నారాయణుని సందర్శించి బ్రహ్మ సూత్ర పారాయణ మొనర్చి ధ్యాననిష్ఠా పరాయణుండై త్రిరాత్రంబులందుండి పిదప బయల్వెడలి మార్గ మధ్యమున ననేక క్షేత్రంబులు దర్శించుచు సూతుఁడు శౌనకాదుల కష్టాదశ పురాణములుద్బోధించిన పవిత్ర క్షేత్రమగు నైమిశారణ్యమున మూఁడు దినములు నివసించి యావల శ్రీ రామచంద్రుని జన్మభూమి యగు నయోధ్యను సందర్శించి లక్ష్యశుద్ధికై యచ్చోట తారకమంత్రము లక్ష సంఖ్యాకముగా జపించి యటనుండి పయనించి త్రివేణీ సంగమస్థానమగు ప్రయాగ తీర్థంబున కేగి రామేశ్వరమునందలి శ్రీరామలింగేశ్వరస్వామి నభిషేకించుటకై యందలి తీర్థంబుఁ గైకొని కాశీక్షేత్రముం జేరె. 30

చాతుర్మాస్యవ్రతమును
ప్రీతిం బొనరింప నెంచి విశ్వేశునకుం
జేతో ముద మొదవఁగఁ బ
ఖ్యాతిగ కాలమ్ము గడపె కాశీపురిలోన్. 31

మఱియు నా పవిత్ర క్షేత్ర రాజంబున శివ మంత్ర మక్షరలక్షలు జపించి ముక్తి మండపమునఁ బ్రణవ ధ్యాన మొనర్చి యచ్చటినుండి గయ మీఁదుగా బుద్ధ గయ కరిగి యశ్వత్థమూలమున దివసత్రయమపరబుద్ధునిం బోలె ధ్యాన సమాధి నిష్ఠుండై యుండె.

అప్పటికి తీర్థయాత్ర ప్రారంభించి వత్సరద్వయమగుటం జేసి యిఁక నొక సంవత్సరము లోపలనే మిగిలిన తీర్థంబు లన్నియు సేవింప సంకల్పించుకొనియె. ఆవల శ్రీకృష్ణ చైతన్య మూర్తి జన్మించిన నవద్వీపమున కరిగి యందుండి కాళీ ఘట్టమునందలి కాళీ క్షేత్రమున కేగి యక్కడ జరగు హింసాత్మక పూజలం గాంచి భీకరమూర్తియై యున్న యా కాళికా దేవిని – "తల్లీ! శాంతి నొందుము. ప్రళయకాలమింకను రాలేదు. నీవు జగన్మాతవు కదా! ఉగ్రదృష్టి నుపసంహరించు కొని శాంతదృష్టిని కరుణాదృష్టిని ప్రేమదృష్టిని వహింపుము" అని ప్రార్థించెను.

అటుపయి నచటు వాసి యజ్ఞాన ప్రకల్పితములై దేశము నలువలం కుల బహుళవ్యాప్తిఁ జెందిన జాతి వర్ణ భేద ములకు లవలేశమేని యవకాశ మొసంగని చోటగు పూరీ జగన్నాథ క్షేత్రమును సందర్శించి యచటి సర్వవర్ణ సమన్వ యాత్మకమగు నుత్తమ విధానమున కంతరంగమున మెచ్చి యట వారము దినములుండి పిదప నాంధ్రమాతృపద సన్నిధిం

ప్రవేశించి యాపై సింహాచలముం జూచి యటనుండి భద్రాచలమున కరిగి పిమ్మట శ్రీశైలముం జేరి యటఁగల గుహలలో నొక పక్షము దినములు ధ్యానించి సరాసరి కలియుగ ప్రత్యక్షదైవమును, సమస్తసంకట హారణుండు నగు శ్రీవేంకటరమణుని యావాసమగు తిరుమలను జేరి — 32

కలియుగ వేంకటరమణుని
కలిమల పరిహారణు వడ్డికాసుల వానిన్
నిలువెల్ల బత్తిరూపయి
వెలసెనన న్నిలిచి కొలిచె విశ్వాత్మకునిన్. 33

తదుపరి తిరుమల క్షేత్రమునందలి పాపనాశనము, ఆకాశగంగ, గోగర్భము మున్నగు తీర్థములెల్ల సేవించి యందు ప్రకృతి రమణీయము, సందర్శనమాత్ర సముత్సాహసంధాయకము, సిద్ధోపదేశ ప్రభావిభాసితము, పంచపాండవ తపః పరిపూతము నగు పవిత్ర గోగర్భక్షేత్ర సందర్శనమున కెంతయు సంతసించి ముఖ్యముగా తపస్సిద్ధి కిద్దియే యనువగు స్థానమని భావించి తన తీర్థయాత్రావసరమున నాంధ్రదేశమున భక్తిజ్ఞాన వైరాగ్యాది గుణములు కొఱవడియుండుటను గుర్తించినవాఁడు గాన తదుద్ధరణమ్మును సంకల్పించుకొని యచటినుండి బయల్వెడలి మైసూరు రాష్ట్రము మీఁదుగా నరుణాచలమ్ముం జేరి యపీతకుచాంబా సమేత శ్రీమదరుణాచలేశ్వరుం దర్శించి యందుండి పోయి కాంచీ క్షేత్రమును

సేవించి యాపై శివ చిదంబరముం జూచి అయ్యాది పాణిని మహర్షికి మహేశ్వరుఁడు వ్యాకరణ సూత్రములను ప్రసాదించిన చోటు గాన నచ్చట పౌనఃపున్యముగా వ్యాకరణ సూత్రములం బఠించెను.

తదుపరి శ్రీరంగనాథుఁడు విజయం చేసియున్న శ్రీరంగమును దర్శించి దిండికల్ మార్గముగా పళనిం బ్రవేశించి శ్రీ కుమారస్వామి నర్చించి మధుర కేగి వర్ణనాతీతమగు శిల్ప సౌందర్యమున నొప్పారు నా క్షేత్రమును పొరిం బొరి దర్శించి యందుండి రామేశ్వరమున కరిగి తన జన్మము సార్థకమగు నొక మహాకార్యమును నెఱవేర్చితివి గదా యని యామూల చూడముగా తృప్తింగని — 34

కాశి కావడి జలము రామేశమందు
రామలింగేశ్వరుని కెడఁ బ్రేముడి తడఁ
బడఁగ నభిషేక మొనరించి భక్తి నంజ
లించి యచ్చోటు విడి పయనించె నెలమి. 35

ఆవల రామసేతువున కేగి యచ్చో సముద్ర స్నాన మాచరించి సకలపితృదేవతలు ముక్తులగునట్లు తర్పణ మొనర్చి తన తీర్థాటనమున భారతమాతకొక ప్రదక్షిణము పూర్తి యగుట కెంతేని సంతసించి భవానీ క్షేత్రము నాఁబడు కన్యాకుమారి కరిగి యందుండి శ్రీ పద్మనాభస్వామి భూమియగు తిరువనంతపురము పరము ముదమారం జేరి యవ్వల 'వఱకల' క్షేత్రమును సందర్శించె.

అట కొంత కాలముండి నానాటికి 'తత్త్వమేవత్వ మేవత' త్తను పరమార్థ విజ్ఞాన మామూల చూడముగా పరామర్శించుటలో తటి గడచుడు నటనుండి బయలుమెలచి శ్రీ సిద్ధ శివలింగగురు సన్నిధానముం జేరి హాయిగా కతిపయదినంబులు గడపె.

—: గోగర్భాభిగమనము :—

అంత సమస్త భారతదేశ స్వరూప మాత్మావగతంబై రూపొందుట కానందించి యందలి లోపభూయిష్ఠమ్మగు సాంఘిక దురాచారములను ఖండించుటయు, ప్రజలలో నాధ్యాత్మిక చైతన్యము రేకెత్తించుటయు స్వధర్మమని తలంచి యందులకై వలయు తపస్సిద్ధి సంపాదించు టెంతయు నురవని భావించి తత్ప్రియత్నంబున కేకోన్ముఖభావుండై యంతకు మున్నే ప్రకృతి రమణీ విహారమున కాలవాలమై సుమనో మనోజ్ఞమగు తిరుమల క్షేత్రాంతర్గత గోగర్భతీర్థమే తపమునకుఁ దగిన నెలవని భావించిన వాఁడగుటం జేసి మొకామెకి నచ్చుటకి పయనమై మార్గమధ్యమున తిరునల్వేలి, కుర్తాళము, పాపనాశనము తిరువల్లూరు, తిరుత్తణి, ఘటికాచలము మున్నగు దివ్య ప్రదేశముల నెడ నెడ సందర్శించుచు శ్రీ కాళహస్తిం జేరి యచ్చట శ్రీ జ్ఞానప్రసూనాంబా సమేత శ్రీ కాళహస్తీశ్వరుని కనులారగాంచి మనసార నర్చించి తరువాత శ్రీ పద్మావతీ నివాసమగు తిరుచానూరునకు ప్రియమార నరిగి యాయమ్మవారిని భక్తి ప్రపత్తులతో సేవించి యటనుండి కదలి కపిల తీర్థమునందలి శ్రీ కపిలేశ్వరునికి జోహారువు లొనర్చి సరాసరి తిరుమల కరిగి — 36

తిరుమల వేంకటేశ పద
తీర్థములాని తదీయ నామముల్
మఱి మఱి ధ్యానముఁ సలిపి
మానిత తన్మహితప్రభావమున్
గుఱిచి పొరింబొరిందడవి
భూనుతభక్తి భజించిమానసాం
బుజుహాము నిర్వృతిం బొరయ
పొంగి తపోనిరతప్రయత్నుఁడై. 37

పిమ్మట గోగర్భతీర్థమున కేగి యవిరళ తపంబుఁ జేయ దొరకొనియె. 38

ఓ విచారపరశ్శతాధిక
యోగకావ్యకృదీశ్వరా!
భావజోగ్రశరప్రసార వి
భంజనోద్ధురశంకరా!
పావనాత్మ తపోబలైకవి
పాటితాత్మ భవవ్యథా!
ధీవిశేష సమార్జితాంధ్ర వి
ధి ప్రబోధ నిరూపకా!. 39

ఇది శ్రీ వైద్య విద్వత్పండిత సత్కవి నారు నాగనార్య మహాశయ
విరచితమగు మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వామి
చరిత్రమునందు తృతీయ ఘట్టము.





మహర్షి సద్గురు

# శ్రీమలయాళస్వామిచరిత్రము

అను

## అసంగానంద విజయము

### చతుర్థ ఘట్టము

వెలుఁగనీ తనమను చీఁకటి
తెరలకు నాప్రొద్దు పొడుపు - తీరున వెలుగుం
బొరయించి యాత్మతత్త్వ
స్ఫురణన్ వెలయించు - పరమబోధైకనిధీ!

ఆ గర్భ సాధు నిలయము
గోగర్భ సుతీర్థ నికట - కుధరోపరి న
య్యాగర్భ సంవిదగ్రణి
దీ గర్భ కుమార విరాట్ప్రీ - ధృతలక్ష్యుండై. 1

—: తపోదీక్ష :—

ఏది యెఱింగిన నెఱుఁగ మ
ఱేదియు లేదో యదే గ్రి - హింపఁగ నిరతం
బాదృత తత్త్వవేత్తఁ
దాదాత్మ్యము నెంద మివ్వుల - దప మొనరించెన్. 2

జగతిం గల్గ గజిబిజి మా
న్పఁగఁ గొంత్త ప్రయాసమయ్యు - న్నానాఁటికి రే
వగలును విడువక తపము
మిగులం గావించెఁ గ్రమ ప - విత్రా బుద్ధిన్. 3

అరనిముసమేని వితయై
తరి గడవఁ జికాకుఁ జెందు తడవోర్వక యే
మరక తడఁబాటు నొందక
మరగున్ తను దానెఱుంగ - మదిఁ బని పూన్కిన్. 4

కాలము గడపెన్ భక్త్యా
లోల నిజాంతః ప్రవృత్తి - లో నిలుపుచు మా
ర్జాల కిశోరన్యాయము
పోలెన్ భగవద్విచార - పూరితమతియై. 5

పవల్రేల్ తేఁల్లియ్యుఁ దిండి తీర్థమ్ముల్లకై
ప్రాల్మాల కోర్కంత ప్రో
ద్దవలోక్కించు శివాంఘ్రి ష్పద్మయ్యుగ ని
త్యాలోకభక్తి ప్రప
త్తి విశేషోన్నయ బుద్ధిమై సకల మూ
దేవుండై కాషాయునం
చ వికారమ్మున నెంచు హృత్కమలమ్మం
దర్చించు నిష్ఠాగతిన్. 6

సారిదిక్ మానవలోక మెవ్వండో గిం బ్రో
చన్ నిర్నిమిత్తమ్మునై
ధరణిన్ గాచు నెవండు భూతతతి ని
ద్రాణస్థితింగూడం దా
నరయం జాలు నెవండు రక్షకుని య
ట్లా దేవదేవుండె నన్
భరియించున్ సకలం బొసంగియని సం
భావించు నిష్ణాతుండై. 7

పరువులు వారి గింగురను
బల్మి తలంపుల గుంపు చుట్టు ము
ట్టి రహిని బోరువెట్టి ప్రక
టించిన దాని నెగాదిగన్ మదిన్
బరపక మిన్నకున్న యెడ
మాటికి మాటికి నుబ్బలిన్ సరా
సరి తిరుగుళ్లు సుళ్లు గొని
జాదుర జాదురమై వెలార్చుంగన్. 8

ఒడలెఱుగని తనమేగా
కెడందను గుర్తింప నట్టి - యిర వెయిదు కొనెన్
జడతన్ గ్రమపరిణతి వె
ల్వడె దివ్యోపస్య నిరవ - లంబ మహస్సున్. 9



గోగర్భగుహా ముఖద్వారమున ధ్యానమగ్నులై కూర్చున్న శ్రీవారు

ఎడ తెఱపి లేని తిమిరము
బడి బడి వెంబడిల నుడిపి - పరువం బరువన్
తొడిబడు వెలుగుం దొంతర
నడికొన నుడుకువ బెడంగు - నను నుదిల కొనన్. 10

ఈ లోకవాసనలు మది
నే లేశము లేని చిన్మ - యీ స్థితి విరతి
శ్రీ లీలా లోల సము
ద్వేల మహాంభోధి నౌక - తీరొప్పారన్. 11

ఏమి యెఱుంగనప్డు జగ
మెల్ల నెఱింగిన భంగి పొంగి తా
మేమి యెఱుంగ లేదని యి
కింత యెఱింగినమీద క్రుంగు మి
థ్యామయ జీవితమ్మున న
హమ్మతి యెందుకటంచు నెంచుచున్
బ్రామిన శాంతి భూమికలఁ
బాల్గొను నిత్యవిభూతి చేతనన్. 12

పరతత్త్వగవేషణత
త్పరమతి విజితైహిక స్వ - భావగతి పరా
త్పరపదవీ నిభృతహృదం
తర పరమోత్కృష్ట దీవ్య - దనుభూతి రతిన్. 13

జగమేమయి పోయిన తన
సుగమే బిట్టూచముట్టు - శోషించిన నె
వ్వగఁ బొందక కుందక ధ్యా
న గరిష్ఠత వెలుగుఁ దలపునన్ నిరతమ్మున్. 14

జ్ఞానస్వయంప్రకాశం
బే నిమిసమునందు గల్గు - నెటు గల్గునటం
చానందలబ్ధికొఱకై
ప్రాణాచారమ్ము వదు స్వ - యంకృషి దొరయన్. 15

తనకున్ జగతికి బంధం
బును గల్గిన దానిఁ బులిమి - పుచ్చు నుపాయ
మ్మును వెదకుఁ గోర్కె తీవెలు
పెనగొను మనుగడను వదలి - వేయఁ దలంచున్. 16

ఇరువది నాలుగు గంటలు
పరమేశ్వరసన్నిధాన - పరభక్తి మెయిన్
బరితుష్టి నొంద జీవిత
పరిమాణముఁ బెంచ నెంచుఁ - బరిణతిఁ గాంచున్.

పగలైనను రేయైనను
పగలే రేయైన రేయి - పగలైనమదిన్
వగఁ బొగులక తగు మనుగడ
మిగుల్లం దలపోయు మేలి - మిన్ పడఁబోయున్. 18

ఒక తెప్పపాటు దైవా౦
శకుఁ దోడ్పడనట్టి యెడ వి - చారమహాబ్ధి౯
దికమకపడి మునుఁగుట౯ జే
దు కార్యములు౯ గోయు జగము - ధూధూయనుచు౯. 19

తన గురుదేవుఁడు ప్రవచిం
చిన సూత్రపథమ్ము విడక - చెప్పినటుల౯ గై
కొనుచు శిరోధార్యమ్మని
ప్రణుతిం బొనరించు మిపులఁ - బ్రార్థించు మది౯. 20

వేఁగి లేచిన మొదలాత్మ - విద్యకొఱకు
శ్వాసఁ బీల్చును తద్భిన్న - సంగతులను
మఱచియైననుఁ బీల్వఁడు - ధ్రువతపస్వి
కట్టడి యదేమొ బుద్ధికా - గతము కాదు. 21

బేహారి సావులవగుటకు
నోహరి సాహారిగ చేర - మొగిఁ జేసిన య
ట్లూహా పోహా లడంపఁగ
సాహసియై యహరహమ్ము - సలుపుందపము౯. 22

ఒకనినిఁ దిట్టిన దోసము
నకు వాతలు వేసికొనెను - నాలుకపై శి
ష్యకుఁ బొల్పడియెను తన యం
తకుఁ దానై యెంత వింత - నైష్ఠికుఁడో కదా!. 23

పాండవ తీర్థమ్మునందా
నుండ్సు తఱిఁ భుక్తి కింత యొదవని కతనన్
పిండప్రదానములు తీసు
చ్చుండగతిఁ సాపడుఁ బ్ర - సన్నమనీషన్. 24

బిచ్చమెత్తక తపముం గా - వించు నియమ
మూని పాండవతీర్థాన - నుండు పిండ
ములను జోసేసి బ్రదిమి నె - ట్టులో గడపుచు
నుండె స్వామి యదెంత యఖండ దీక్ష!. 25

ధ్యానావధిలో దుప్పటి
నానించి జలాన శిరము - నం గప్పిన ను
ష్ణానికిఁ బొడి వస్త్రమ్మటు
లా నెంతటి యుగ్రతపమొ - యవగత మగునే?. 26

తొలి పుట్టుక యం దెవనికో
అలసట నిడినట్టి దోష - హారణార్థమ దో
షలు గుట్టి నిప్పుడని మదిఁ
దలపోయుఁ దపస్వి మళక - దష్టుఁడగు తఱిన్. 27

ఇట్లు కతిపయ వత్సరంబులు గడచిన పిమ్మట. 28

—: భగవదనుగ్రహము :—

స్వామికి భోజన సదుపాయముల నొడఁ
గూర్ప మహంతు వారేర్పఱుపఁగ
ధ్యానస్థితుండౌట తగు సమయమ్మున
నరుదెయున్నముఁగొన నలవిగామి

“ఓమిత్యేకాక్షరం బ్రహ్మ

వ్యాహరన్మామనుస్మరన్ ।

యః ప్రయాతి త్యజన్దేహం

స యాతి పరమాం గతిమ్”

సత్యమేవ జయతే నానృతం

మొదలు స్వామిని దర్శింపఁ గోరు భక్తులును, భిక్ష నొసంగి తదనుగ్రహపాత్రులు కాఁగోరు పుణ్యాత్ములును క్రమక్రమముగా వృద్ధి నొందుచుండిరి. 30

బాబాజి యను నొక భక్తుఁడు స్వామికి
పుష్టి కరాహార - మును నొసంగఁ
దలఁచి సుండుంట లెం - తయు మిన్నపిండితో
భక్ష్యముల్ సేసి క్రొంబ్రనటి నిండ
తెచ్చి యుపాహార మిచ్చుమై కొనుఁడని
చెప్పిపోవ నొకప్డు స్వీకరింప
ధ్యానయోగమ్మునఁ జిత్తము దానిపైఁ బోవఁ
బనటిలోఁ దక్కిన భక్ష్యములను
పేదసాదలకిచ్చి సుభేలు మనుచు
దుత్త ప్రగుల్లంగ విసరెను దూరముగను
జ్ఞాన సాధకులకు యుక్తమైన ప్రమిత
భోజనమ్ము శ్రేయమ్ము [illegible] 31

[illegible] లేక పడి
[illegible] యుండెను మూడు దినాలు ఘోర నై
[illegible] మాచరించుచు [illegible]
[illegible]

చుక వసివాడ నత్తఱి వి
శుద్ధ హృదంతరవర్తి యీశ్వరుం
డకలుషచిత్తవృత్తిఁగని
యాదరమేదురమోద సంగతిన్. 32

భగవద్భక్తుఁడు మాధవాంఘ్రిపద సే
వాసక్తుఁడొక్కఁడు త
ల్పగుఁడై నిద్దురఁ జెంద శ్రీపతియె స్వ
ప్నమ్మందు మేల్కొల్పి నా
దగు భక్తుండట పస్తులుంటెట కనలే
దా లెమ్ము లెమ్మోల్సిరిం
పఁగ వల్దోయి ప్రసాదమిచ్చి తొలుతన్
పాల్గొమ్ము ధర్మమ్మునన్. 33

అని తట్టి లేపినంతట
మనమునన్ జకిత భ్రమమ్ము మల్లడిఁ గొన లే
చిన వెంట నింటఁగల భో
జనమునుఁగొనిపోయి స్వామి - సన్నిధి నునిచెన్. 34

"పరమేశ్వరాధ్యను జ్ఞా
పరతకుఁ గొఱత యొకో భక్తిపరవశమతి నీ
చరణాబ్జ యుగళ సన్నిధి
కరుదెంచితి తీసికొమ్ము యాహారమ్మున్. 35

నాయిలు వేలుపు కడచను
జేయఁగలం గానఁబడి త్వ - రితగతిఁ బొమ్మా
నీ యెడకని తెలిపిన నిటు
డాయం గల్గితిని నీ యె - డాటమ్ము గురూ!" 36

నావిని యిట్లనె సద్గురు
దేవుండా భక్తుతోడఁ - "దెలిసితొ లేదో
నావల నుండు మఱొకనికో
యీ విషయమ్మును పూర్వ-మెఱుఁగుము వత్సా!" 37

అనినం బోనముఁ దెచ్చిన
మనుజుఁడు నా యొఱుకఁ దవులు - మహాత్ముఁడ వీ
వని ముమ్మార్వలికిన నది
విని సద్గురుఁడాహారించె - విందై విందున్. 38

ఆ మీఁదట భగవత్కృప
నేమని భావింతుఁ దీర్ప - నెటు వీలగు నా
స్వామి ఋణమ్మని పలుమరు
ప్రామాణ్యమతిం దలంచి - ప్రణతులు నించెన్. 39

విందు బోసేయు నతనికి ముందు విందు
తీసికొని పొమ్మటంచాన జేసి నతని
కించు మించు విభేదమ్ముఁ గాంచకునికి
భక్తహృదయమ్ము సంతోషవార్ధిఁ దేలె. 40

మఱియు నొకసారి వర్షర్తువున వర్షోత్కర్షమగుడు గోగర్భతీర్థమునందలి వాగు దగులొరసి పారుచుండుటవలన నావలనున్న శ్రీవారివలికి రా వీలుగాకట్లే యుండునెడ రెండు మూడు దినమ్ములు గడచె. నిరాహారియయ్యుఁ దచ్చింత యిసుమంతయు లేక యత్తపోధనుండేకాగ్రమనస్కుండై భగ వానుని ధ్యానించుచుండె. ఆ భక్తాగ్రగణ్యుని నిష్ఠాపటిష్ఠతకు మెచ్చి కరుణావరుణాలయుండును, సంకటహరణుండు నగు శ్రీ వేంకటేశ్వరుండు దేవాలయాధికారియగు నొకానొక భక్తుని స్వప్నమున సాక్షాత్కరించి స్వామికాహారమ్ము గొని పొమ్మని సూచింప నతఁడు వెంటనే ప్రసాదము మూటగట్టి తీసికొనిపోయి తీర్థగతంబగు ప్రవాహంబు దాటుటకు వీలు గామి యుక్తిమెయి నొక పొడుగుపాటి వెదురుకఱ్ఱకు ప్రసా దంపు మూట ముడివెట్టి యందించి కృతకృత్యుండయ్యె. అయ్యర్భంపు కర్జమునకు నెంతయు సంతసించి భగవ త్స్నేహాయ్యసంపత్తికి నిలువెల్ల పులకించి పరవశుండై యనన్య సాధ్యమగు భగవత్కృపకుఁ బాత్రుండనైతింగదా యని భావించి సహజనిష్ఠ కుపక్రమించె. అంతం గొంతకాలమునకు 41

—: యశోవ్యాప్తి :—

తావిమలనుండి వాసనల్ తరుముకొని ధ  
రాతలము వ్యాపకమ్మగు రీతి స్వామి  
సుగుణసంపద నడవడి శుద్ధ సాత్త్వి  
కతయు తెల్గు వలంతి నల్గడలఁ బ్రాకె. 42

దర దర వికచదళాంతర
పరిపక్వమరందబిందు - పానవశేచ్ఛా
బరువిడు భృంగములటు యతి
సరసకుఁ జనుదెంచి రాంధ్ర - సత్యాన్వేషుల్. 43

దురంత దంతుర విషయవాసనలం బోనీక చిత్తమ్ము నిరోధించి నిరంతర నిజతత్త్వాన్వేషణ పరుండయి యాహార పానీయ నిద్రాదులుపలక్షింపక యేకాకియై యేకాత్మ నభిల షించుచు భయమ్ముఁ దక్కి నయమ్ము నిక్కి సంతత పరితో షిత స్వాంతుండై ధ్యానానంద సాగర వీచికా విహారుండై యుండునెడ నయ్యతీశ్వరుని యశశ్చంద్రికలు దిగంతములకుం బ్రాకె. ఆంధ్ర ద్రవిడ కేరళాది ఛప్పన్న దేశంబులందుండి నిష్ఠాపటిష్ఠులగు భక్తులేతెంచి శ్రీ కలియుగ వేంకటరమణుని దర్శించి సేవించి నుతించి పరవశించి మఱలిపోవు నప్పట్టున చిన్ని శ్రీనివాసుని పోలిక వెలుఁగొందెడు నయ్యోగీంద్రుం జూడ సంత ప్రజలవలె తిరుణాళ్ల జనమ్ము పోలిక తీర్థప్రజవలె ముమ్మరంపు టుమ్మడి మూకవలె నరుగుదెంచి గోగర్భతీర్థ రాజమ్మునం గ్రుంకులిడి పరచపాండవుల దర్శించి శ్రీ మలయాళ యతీంద్రుని పాదములకుం బ్రణమిల్లి కాయకప్పరమ్ము లందించి నమస్సుమనస్సులర్పించి యథావకాశమ్మున నిజపురమ్ముల కరుగుచుండిరి.

ఒక్కొక్కతటి భక్తజన సమ్మర్దమున తన నిష్ఠకు భంగము వాటిల్లునని తలంచి యమ్మౌనియు గోగర్భము వీడి వైకుంఠ - తుంబురు - కుమారధారా - సనకసనందనాది తీర్థమ్ములకేగి తపమ్మొనర్చుచుండెను. 44

ప్రతిజీవి యెందున్న భగవంతుడీయఁడే
వారి వారి కొసంగు బత్తెమనుచుఁ
దలఁచి పరీక్షింపఁ - దలకొని సనకస
నందన తీర్థమ్మునందు నుండి
తుంబురు తీర్థానికిం బోయి కూర్చుండ
స్వామిని దర్శింప భక్తసమితి
దారి దప్పియును శ్రీవారున్నచోటికే
తారి యా స్వామినే చేరఁబారి

దేవరా! మలయాళ యతివరుకొలకు
భిక్ష సేయంగఁ దలఁచి తప్పితిమి దారి
వారిఁ జేరంగ దారిఁ జూపంగ వలయు
నంచు కొంగ్రొత్తవారమం చడిగినంత. 45

కారణమారసి తెలిపిన
వారెంతో సంతసించి - స్వామికిఁ బూజా
ప్రారంభాదులు భిక్షా
ధారముగాఁ గూర్చి భక్తిఁ - దని సనిరంతర్. 46

ప్రతి జీవినిఁ బోషించెడు
ప్రతినరు పాలకుఁడు గద స్వ - భావమ్మున నం
చతి వేల భక్తి నీశ్వరు
మతిమద్గతిఁ బొగడె స్వామి - మంగళసూక్తిన్. 47

ఆ నాఁటి యపరిమితమగు
నానందపుటవధి యిట్టి - దట్టి దటంచున్
జ్ఞానులును దెలియ నేరని
మానిత తత్త్వానుభూతి మరగి సుఖంచెన్. 48

ఒక్కొక వేళ భిక్షుకు వలయు నాహార పదార్థంబులు గైకొని స్వామి యెందున్నను వెదకికొనిపోయిన భక్తులెంత సమయము గడచినను నిష్ఠాపటిష్ఠుండగు నమ్మహానీయుండు ధ్యాన సమాధి వీడమి తమ తెచ్చిన పదార్థములు పొంతల నున్న చెట్లకు వ్రేలం గట్టి చనుచుండిరి. 49

—: తుంబురుకోనలో మృగములు :—

తుంబురు కోనంగల వ్యా
ఘ్రంబులు భుజగములు నొకట - కదలక యుంటన్
పంబిన వేడ్కంగని భా
వంబునఁ దలపోసె స్వామి - పరిణతమతియై 50

ఉత్తమసిద్ధి బొందుట క
హో మృగపన్నగ ముఖ్యముల్ మహో
దాత్తగతిన్ దపమ్మును ము
దమ్మున సేయఁగఁబూనె మాయురే

యుత్తతికి నెంతమంచి పను
　　లియ్యవి యంచుఁ దలంచి మెచ్చి తా
చిత్తమునందు సంతసముఁ
　　జెందె తదేక నివిష్ట నిష్ఠమై. 51

అనఘుండట్టులు వానిపట్టుదల క
　　త్యంతంబు శ్రద్ధామతిన్
గాని తీవ్రైక పటిష్ఠ నిష్ఠురతపో
　　నుష్ఠాననిష్ఠా వరి
ష్ఠుని పోలెన్ దినముల్ నిశల్ గడపి యె
　　చ్చోనైన విశ్రాంతిలే
క నిరాఘాటమహోన్నతాశయములన్
　　కాలమ్ము వెచ్చించుచున్. 52

తపమ్మొనర్చుచుండ నొక్కనాఁడు. 53

కణితిని రేచుకుక్కలు చె
　　కా పికి వెంబడిలన్ భయంబునుం
గాని యది చెంత జేరి వడ
　　కుంగొన దాని వెటన్ విదల్చి చెం
త నిలుప రేచుకుక్కలు య
　　థామతి వెన్కకుబోయె మానులం
గని సహజాతమైన తమ
　　క్రౌర్యము వీడవె జంతుసంతతుల్. 54

అట్లనవరత ధ్యాననిష్ఠుండై యుండ మఱికొన్ని వర్ష మ్ములు గడచె. ఒకానొక దినంబున న త్తపస్వి వరేణ్యుండు. 55

—: శ్రీ వెంగమాంబా సందర్శనము :—

తరిగొండ వేంగమాంబా
చరితము పలుమారు చదివి స్మరియించు నెడఁ
దరిసెన మొసంగె వెంగమ
పరువడి ధ్యానానుభూతి ప్రత్యక్షముగా. 56

అంచ రెక్కల మిసిమి డాల్మించు మేలి
ముసుగుగల స్వర్ణ దీకాంతఁబోలు నామె
యెదుర నిలఁబడి వత్స! నీ మదిఁ దలంపు
పెంపెఱింగితి నీ యిచ్చ యింపుఁ గూర్చె. 57

అనినం దొల్లి చరిత్ర కెక్కిన యన
న్యాఖండభక్తి ప్రప
త్తిని వెల్గొందిన వెంగమాంబయని యెం
తే స్వాంతమం దెంచి యా
య్యన సాష్టాంగనతుల్ పొనర్చియు స్వకీ
యానూన శంకా నివృ
త్తిని వాంఛించిన యామె దీవనల నెం
తేఁగూర్చె ప్రేమాదృతిన్. 58

అట్లు శ్రీ వేంగమాంబా సందర్శనమున తనివి సెంది యెప్పటి యట్లు తన నియమములను పాటించుచుండె.

—: స్వాభిమతము :—

అత్తఱిజిజ్ఞాసు వొకండిట్టులంపుంబట్టుదలమెయినగ్గురువరు దరింజేరంబారి భక్తి ప్రపత్తులతో "స్వామీ! తామాధ్యాత్మిక శిఖరాధిష్ఠితులరు కదా! ఇంకను తపోధ్యానాదికమున శరీరమును లయింప నేటికని ప్రశ్నింప నత్యనుకంపాపూర్ణహృదయుండై యగ్గురువరుండు మెల్లమెల్లన నతనితో నిట్లనియె – "వత్సా! నే నొకండనే నిరంతర సౌఖ్యదాయియగు పరమపదానుభూతిందవిలి తృప్తి నొందుట నా కిష్టము లేదు. నేనే పరమావిష్కార సంపత్తి ననుభవింతునో అయ్యది నా తోడి లోకము వారును సంపూర్ణముగాననుభవింపవలెననియే నా నిశ్చితాభిప్రాయము. అందులకై మాత్రమే యీ నిరంతర పరిశ్రమమని తలంచునది యని వానిని యాపృచ్ఛకునిఁ దృప్తివడం జేసెను.

అత్తఱి శ్రీరమణభగవచ్చరణాంబుజమధుర మధుర సాస్వాదనతత్పరుండును, శ్రీమహాత్మగాంధి పిలుపందుకొని నాగపుర సత్యాగ్రహసమరమందుఁ బాల్గొన్నవాఁడును, బహుళగ్రంథ నిర్మాణదక్షుండును, కడప మండల గత కోడూరునివాసియునగు శ్రీ నారు నాగనార్యాభిధానుండు కలికల్మష ప్రణాశకమ్మగు శ్రీ వేంకటాచలముం జేరి — 59

క వి గు రు స మా గ మ ము

స ప్తనగాధినాథపద
సారస నిర్యదనంతమాధురీ
గు ప్తమధుద్రవాస్వాదన
కోమల మానసవృత్తిఁగాలముల్
స ప్తదినమ్ములుల్ గడపి
చక్కని పాండవతీర్థమందు ని
ల్లిప్తునిఁ ద త్త్వదీప్తుని వ
రిష్ఠ గరిష్ఠు పటిష్ఠు నైష్ఠికుల్. 60

కని సాష్టాంగ ప్రణతులఁ
బొనరుప దీవెనలఁ బోసి - మునుకొని కూర్చుం
డ నియోగించిన నాతం
డనునయ వినయ ప్రణయము-లను భూతముగాల్. 61

డగ్గఱఁజేరి ప్రప త్తిని
డగ్గుత్తిక మాటలాడుటకు మొదలిడి స
మ్యగ్గంభీర ప్రవచన
మగ్గలిక మెయిం బొనర్చు - నవసర మందుల్. 62

నాటి సహాయ నిరోధక
పాటవముం గూర్చి మిపులఁ - బ్రశ్నించుచు వా
గ్ధాటిల్ బదులిడ మెచ్చుచు
రాటము వడకుచును మాని - రాజిట్లనియెల్. 63

గాంధీమహాత్ముఁడన గుణ
సింధువు జనబంధువిట్టి - శ్రేయోఽర్థియె దా
స్వాంధతమో భానుండయి
బంధురసౌఖ్యములఁ గూర్చుఁ-బ్రజకని మఱియున్. 64

రాముని కృష్ణుని మహిమము
లీ మహితుని యందు వెలుఁగు - నెంతయు వింతై
నేమమ్ముఁగూర్చి దేశజ
నా మోదముఁ బేర్చు తీర్చు - న మిత్రశ్రమలన్. 65

అని పలికె. 66

కాలమ్మిటు మధురస్మృతి
జాలమ్ములఁ గడుప ద్వాద - శాత్ముఁడు మింటన్.
గ్రాలెన్ బోసేయుటకది
వేళయగుడు విడిదిఁ జేర - వెరవూను తఱిన్. 67

సెలవు గొన వందనము లిడి
నలువైన యపక్వభోజ - నముఁగొనఁగని తాన్
బళి నాగనార్య! నీ విటు
ఫల భక్షణ సేయుటెంత - భవ్యంబనుచున్. 68

ఇప్పటి యతులను మించిన
నెప్పరి తనమంచు మెచ్చి - నిబ్బరపు టెదన్
గొప్పగ మెప్పుంగూర్చిన
యప్పటి యాతని ముదంబు - నలవియె పొగడన్. 69

జీవితమందు నాసుకవిఁ
　　జెందిన నాటి యనంతమాధురీ
పావన సాధుబోధ నిర
　　వద్య సుఖమ్మొకనాటి కబ్బునే?
కేవల జీవనావసర
　　కృత్రిమ భౌతిక వాదభేద సం
జ్ఞా వివరాదులెన్ని సదృ
　　శంబగు తన్మధురాశయంబుతోన్. 70

—: శ్లో క వి ర చ న ము :—

తప మొనర్చెడు వేళ స్వతః - స్ఫురణము
నందె గీర్వాణ వాణిలో - నతి పవిత్ర
భావ సంకలితమ్ము ప్ర - భా విభావి
తమ్ము ప్రప్రథమమ్ము శ్లోక - మొక్కటందు. 71

అదియె —

"అతీత వైరాగ్య మఖండబోధః
కదాను మేసిద్ధ్యతు హే దయాళో!
సమాధి యోగస్య పరస్య నిష్ఠా
సర్వేషు భూతేషు సమత్వ బుద్ధిః" అనునది.

అది మొదలప్పుడప్పుడు పెక్కు సమయముల యందు పావనభావ ప్రభావ పరిధిలో ననేక శ్లోకములు విరచించెను.

—: శుష్కవేదాంతతమోభాస్కరము :—

మఱియు నత్తఱి శుష్కవేదాంతులు కొందఱు తాము బ్రహ్మనిష్ఠులమని చెప్పుకొనుచు నానాదురాచారములకుఁ బాల్పడి ప్రవర్తిల్లుచుండుటయు, మఱికొందఱు మేమగ్రవర్ణజులము గాన బ్రహ్మవిద్యపై మాకే యధికారము కలదు గాని యితరుల కెక్కడిదని వృథాభిమానముచే గర్వించి యుండుటయు, స్త్రీ శూద్రాదులగు సామాన్యజనులు స్వార్థపరులచే వంచితులై చెడిపోవుచుండుటయును గమనించి కరుణాతరంగితాంతఃకరణుండగు నా సంయమీంద్రుండు బహుకాలము నుండి భారతీయుల నావరించియున్న యజ్ఞానాంధకారమును దూరీకరింప నుద్యమించి 'శుష్కవేదాంత తమోభాస్కర' మను నొక దివ్యభావపూరితమగు గ్రంథరాజమును రచించి ప్రకటించె. అయ్యది క్రమముగా బహుళవ్యాప్తి నొంది యజ్ఞానతమము నడంచి విజ్ఞానకాంతుల విస్తరింపంజేసి మూఢాచార పరాయణులకు కనువిప్పుంగూర్చి సంశయగ్రస్తులకు గురూపదేశకారియై భంగి త్రాగి సింగిరేగి త్రుళ్ళింత లాడువారి తెలియనితనమును పెంజీకటిని బాపి మాంసాశనాది దురాచార పరాయణులై దయాదాక్షిణ్యరహితులైన వారి హింసాప్రవృత్తిని మాన్పి, అచలవాద మేఘాడంబరముల సత్ప్రబోధ ఝంఝూమారుతములచే విచ్ఛిన్నమొనర్చి, యంతింతనరాని మహోపకారియయ్యె. తద్గ్రంథరాజపఠనము వలన వేనకువేలు ప్రజలు వెల్లువమై శ్రీ స్వామి సన్నిధి కే

బ్రాకిరి. తత్ప్రాశస్త్యమున కదియే ప్రబల తార్కాణము. అంతట — 72

పండితులు పామరులు కళా - మండితులును
వచ్చుచునుఁ బోవుచును బుధ - వంద్యచరితుఁ
గాంచి నిజసంశయములఁ బో - కార్చుకొని ని
భృత కుతూహల మతిఁ దుష్టి - వెలయుచుండ. 73

అట్లు లోకోద్ధరణమ్మె లక్ష్యమ్మగా గ్రంథ విరచనాద్యనేకసత్కార్యములు గావించుచుండియు దైవసాక్షాత్కారమే పరమలక్ష్యముగా గల యప్పటి తన తపోనిష్ఠ నేమాత్రము సడలింపక యంతకంతకు దృఢతరముం జేయుచు నఖండదీక్షాదక్షుండై యుండఁ గ్రమక్రమంబుగ ద్వాదశాబ్దంబులు గడచె.

అంత తానంతవఱకొనర్చిన జప తపోనుష్ఠానాదులాత్మసాక్షాత్కృతి కెంత మాత్రము దోహదకారులైనవో యని లోలోన వితర్కించికొనుచు నానాఁటికి తన కొదవిన యనుభూతులను గాఢముగా పర్యాలోచించుకొనుచు తన నిష్ఠలన్నియు భావశుద్ధినిఁ జేకూర్చుచున్న వే గాని పరమ నిర్వాణసుఖ సంధాయకము లేమాత్రమగుట లేదని నిక్కము నిర్ధారించి యందులకై వలయు దృఢప్రయత్న మాచరింప నుద్యమించి తతఃపూర్వముకన్న నిను మిక్కిలి తపోనైష్ఠికుండై సాటివ్రతచర్యనెడ నేడఁ దాన్ష గావించిన దీక్షతర తపశ్చ

ర్యయు, కఠిన శుష్కోపవాసంబులును, ఆశ్రిత భక్తజన సదుపదేశాది సత్కార్యకలాపంబులును, విడువక భక్తి ప్రపత్తులతో నొనరించిన సాలగ్రామ పూజాదికంబును, పాద చారియై గట్టి పట్టుదలతో ఆ సేతు శీతాచలము గావించిన తీర్థయాత్రయు, స్నిగ్ధ చిత్తమై రామేశ్వరమున కరిగి శ్రీరామ లింగేశ్వరుని కాశీతీర్థమున నభిషేకించుట మున్నగు సత్క్రియ లను స్మరించుకొని వానిచేఁ బొందవలసిన యాత్మసాక్షా త్కార మంతదనుక లభింపమి నిరంతర దూరాలోచన తత్ప రుండై విడువని పూనికఁ గడుంగడు వహించి తదేకనిష్ఠితుండై బ్రహ్మానందాంబుధి నోలలాడం దలంచి — 74

—: ఆత్మ సాక్షాత్కారము :—

కాలంబెల్ల వ్యయించి ఘోరతపముల్
గావించి యెన్నాళ్లకున్
శ్రీ లక్ష్మీశ కృపాప్రపూర్ణ విభవ
శ్రీ సిద్ధిగాకున్కిఁ దై
వాలంబంబిటు వ్యర్థమౌనె యని భా
వంబందుఁ జింతించి యు
ద్వేలోద్వృత్తి నిటుల్ దలంచె భగవ
ద్వీక్షా సమీక్షా మతిన్. 75

''పరమేశ్వరా! నీ దర్శన ప్రాప్తికై యెంత కాలము నుండియో కడు నిడుమలఁ బడియు గట్టెక్కఁజాలనందులకు నే నెంతని చింతింతును? తుదకు నా కేది శరణ్యమని భావిం

తమను? ఎంతయేని శ్రద్ధామతిం బొనరించిన తపోధ్యానాదిక ములకు నిద్ధియేనా ఫలితార్థము ? సృష్ట్యాదినుండియు పరమ భాగవతాగ్రేసరులు నీకై పలుపాట్లు బడి కడకు పొందిన జీవితపరమార్థమట్టిదిట్టిదని యెంతేని గొప్పగా పురాణాదు లుద్ఘాటించుట సత్యదూరమే యగునా? ఇప్పటి నా యనుభవ ములో నినుఁగూర్చి పడిన కడగండ్లన్నియు బూదిని వ్రేల్చిన హోమములగునేమి? అక్కటకటా! ఊహాతీతమైన భవచ్చిత్ర చరిత్రమెట్టిదో తెలియకున్నది. నీ యందు నాకుం గల విశ్వా సము నాఁడు నాఁటికి సన్నగిల్లుచున్నది. ఇట్లే కాలము గడచి నచో నాస్తికతాపరివ్యాప్తమగు నీ మిథ్యాప్రపంచమున నిరాశామయ వాతావరణమున జీవింపవలసినదేనా? అన్యథా మార్గము లేదా? సర్వశరణ్యుండవగు నిన్ను నమ్మినందులకు నాకుఁ బరమప్రాప్యము నైరాశ్యమేనా?" అని నానావిధముల నిర్విణ్ణహృదయుండై తుదకు జేయున దేమియులేక ప్రాణ పరి త్యాగమొనర్ప నిశ్చయించియు "నియ్యది పాపకృత్యమగు నాత్మహత్యగదా! మఱియు ప్రాణప్రయాణవేళ నెట్టి సంక ల్పము గల్గునో తత్ఫలమేరీతిం బరిణమించునో?" అని సంశ యించి సుదీర్ఘముగా యోచించి — 76

త్రిదినావధిలో నీశ్వరుఁ
కెదురం జూడ్కసూపకున్న – నీ తను వేలా?
శ్రుతి స్మృతియే శరణమ్మని
శ్రుతి శపథమ్మాని తీవ్ర – మతి కృతాత్ముండై. 77

హృదయ కుహరమునందలి యాత్మ స్వరూపమునుప లక్షించి తత్సిద్ధికై నిముసమెడవోనీయకంతర్లీనుండై ధ్యానించుచుండె. 78

అనఘాత్ముండటులుండలో వెలుగు ల
త్యంతమ్ము పైకుబ్బి య
మ్మునికంతర్ముఖమై స్వతః స్ఫురణ సం
బోధ ప్రబోధమ్మిటుల్
వినిచెన్ 'బాహ్యాఃమన ప్రవృత్తి కలనో
ద్యోగమ్ము చేఁజిక్కనే
ప్రణుతాంతర్ముఖవృత్తి సంతతమతిన్
ప్రాప్తించు ముక్త్యర్హతల్ ! 79

కాన స్వజీవితమ్మున ని
గాఢపరాత్పర సన్నికృష్ట వి
జ్ఞాన రహస్యమార్గము వి
చార నిమేషము లెన్నియుండు న
వ్వాని గణించినం దెలియు
భవ్య విముక్తిపథం బటన్న య
వ్వాణిని విన్నమీద యతి
వర్యుఁ డపేక్ష సమీక్షఁ జేయుచున్. 80

నిజమెఱిఁగి నాఁటి సుత గజిబిజి యడంగి
పరమ నిర్వృతికై స్వతః స్ఫురణ మర్థిఁ

గోరి సముదాత్త చిత్త వి - స్తారవృత్తి
నాత్మలో మున్గి తనకున్న - దంత యిచ్చె. 81

మదినే తలపులు గొలుపక
చిద గొదయును లేక దీప శిఖ నిర్వాతా
స్పద మయి వెలిఁగెడు క్రియ తా
నది యిది యనరాని హర్షమంది వెలిఁగెఁ. 82

ఇదికాదిదికాదని నె
మ్మది వదలిన పిదప నేది - మఱి మిగులునొ య
య్యది శేషి పరాకాష్ఠగఁ
బొదలుచుఁ బరితోషమందెఁ - బూర్ణప్రజ్ఞఁ. 83

అట్లు పరమపద విలాస భాసురుండై యమందానందంబు నొందె. మఱియు తాననుభవించిన పరమార్థ మితరులకుం బంచిపెట్టుటయే విధ్యుక్తధర్మమని భావించి తదుద్యమమున నితోఽధిక శ్రద్ధ వహించి లోకసేవ సేయ నుపక్రమించి సకల మత సమన్వయ సిద్ధాంత మాధారముగా సంఘసంస్కారాత్మకములగు సత్క్రియాకలాపంబులు జరుపుచు నసంఖ్యాకముగా ననవరతము జిజ్ఞాసు భక్తజనులచే నారాధింపంబడుచున్న యవసరంబున ప్రకల్పిత జాతిమతాచార దురహంకార పూరితులగు నీర్ష్యాళువులొకకొందఱీధర్మప్రతిష్ఠాపకుని యత్నములవలన తమ స్వార్థమున కెంతయేని దెబ్బ దగులునని

యోచించి సాధుమార్గమున నయ్యతివరుం జయింపం జాలమికిం జింతించి బహువిధ వక్రమార్గమ్ముల నూహించి యెన్నియో పన్నుగడలంబన్ని యితండిటనుండుట యస్మాదృశుల జీవితలక్ష్యంబులకవరోధకరంబని విశ్వసించియయ్యతీశ్వరునటనుండి తలగించుటయే మంచిదని భావించి తత్ప్రయత్నపరులైరి. 84

తీర్థవాసుల దౌష్ట్యము

బడుగు బాపనయ్య బమ్మరక్కసి యయ్యె
నన్నయట్లు పూజలన్ని యిట్లు
వానిపాలంబడియె మనకున్న వెంకన్న
యాట సాగదంచుం గూటజనులు 85

గొంటు నాతతాయి కొంటెల దరిం జేర్చి
కొండమీదం గూరుచుండి స్వామి
పూజలన్ని కొన్నబోడనుం దొలగింప
నుడుము పట్టు బట్టి నడుముం గట్టి. 86

మూటంగట్టి యొక్క మూలంబోనెట్టిన
పీడ దొలంగు నడ్డు జాడ దలంగు
నంచుం దత్ప్రయత్నమందు దివారాత్రు
లనక చేయింజేసికొనిరి జడులు. 87

దైవసన్నిధాన దాసులు కాసుల
కొఱకు నెఱకు వేచికొనిన మీను
లట్లు కాచి మానవా సభ్యకార్యముల్
సలిలినారు మెండు చిలిపి దండు. 88

సాత్త్వికనిరోధమ్ము కడు నుత్తమసాధనమ్మని యెఱిం
గియు విపర్యయ జననిరోధమ్ము సాధుపుంగవుల లక్ష్యమ్ము
కాదని యెంచి యమ్మహనీయుఁడు మిన్నకుండె. మున్ను
కైకేయీమూలమున నయోధ్య వీడి చనిన శ్రీరామచంద్రుని
కతమ్మున సర్వారాజ్యసౌమ్యాలన మగుటయ కాక సకలధరా
తలమ్ము పావనమ్మయినట్టు లీ సంయమీంద్రుండు నటనుండి
మఱలి మఱొక యనుకూలప్రదేశమున కరుగుటలో సామాన్య
మానవుల యూహల కందని యే మహత్తర సన్నివేశ
మిమిడియున్నదో ఎవ్వరెఱుంగుదురు? 89

జగములక్షింపక యె పరేచ్ఛను వదించి
నిత్యసత్యము గమనించి నిండుకుండ
యైనవానియుఁ గూటసాక్ష్యములవలన
నునికి విడి వేఱుచోటఁ దానుండవలసె. 90

తానంటపట్టుకొనక జ
గానకు వెలియై నిరీహగతినున్న మునిన్
గానీ విడువదు ప్రకృతి మ
హానిబిడనిబద్ధుఁ జేయు నాయామెడలన్. 91

అదియేజన్మ పరంపరాప్రభవ
పుణ్యామ్నాయమతేయాంధ్రుఁడై
యైదురం జేయు తపఃప్రభావము
మతింకేమోయనూహ్యామ్మదీ
వ్యదనూనాత్మ తపోవిభాసితుఁడు
బోధాఢ్యుండు భవ్యస్వది
వ్యదయాదృష్టి తెలుంగుగడ్డపయిఁ
బర్వంజేసె శ్రీశాత్ముఁడై. 92

గోగర్భమునందున్న కాలముననే పలువురు భక్తులు స్వామి నివాసమునకుఁ దగినదియు, స్వాదుజల సమృద్ధంబును, బహువిధ వృక్షలతాగుల్మ పరిశోభితంబును, పర్వత సానుప్రదేశంబును, విశాల సమతల సమన్వితమును, గ్రామ సీమకును, ధూమశకటాలయంబునకును నాతిదూరంబును, ప్రశాంత వాతావరణమును, పురాణ ప్రసిద్ధ దివ్యక్షేత్ర మొండు కలదనియు, అయ్యది తిరుపతి శ్రీకాళహస్తి క్షేత్రంబులకు మధ్య విరాజమానమైయున్నదనియు పలుమరు ప్రస్తావించుచుండుట గమనించి వలయునెడ గోగర్భమునుండి యా ప్రదేశమునకుఁ దరలిపోవుటకై యోచించి తత్ప్రాంతమ్మును బహువిధముల పరిశోధించి తన భావికార్యక్రమమునకది యెంతేని యుచిత స్థానమని నిశ్చయించి తదనుభవ సంపాదనకై యందొక యనుకూలుఁడగుసాధువునొకకొంత

కాలము నివసింపంజేసె. గోగర్భమునువీడి వెడలవలసిన
యవసరమున నచ్చటికే పోవ సమకట్టె. 93

గోగర్భము వదలుట

వేంకటేశ్వరపాదారవిందములకు
వందనముసేసి కన్నీరు వఱదపాఱ
పులకితశరీరుండై పొంగి పొరలు భక్తి
పారవశ్యత బిమ్మిటి చూఱఁగొనియె. 94

అడుగులంబడి నిలుపోపని
యెడఁదన్ జెమ్మగిలం బనవి – యెటుదోపమి ని
ల్వడర నమశ్శతమిడి వెలు
వడె గుడి కుడియెడమ – భక్తవరులుపొంగన్. 95

గోవిందా! గోవిందా!
గోవిందా! యనుచుఁ బొగడికోలును ఘంటా
రావాంతర లీనమ్ముం
గావించి భజించెఁ బెద్ద – కాలమ్ము హరిన్. 96

నాఁడు హరివాసరమ్మాట – నందనవన
కుసుమవిసరము వలె – భక్తకోటి సలిపెఁ
బ్రార్థనలు మంగళారతుల్ – భజనలు నిజ
హృదయపుష్ప మరంద సం – పదలనొసఁగి. 97

పేరిన పరోన్నతి సహింపనేరనట్టి
కుటిలకూహాక కుజనహృత్స్ఫుట సదృశత
మసమసక సంజచీకటి — ముసురుకొనియె
వంచకులఁజేరు విషమభా — వముల పగిది. 98

అట్టియెడ గోగర్భమునుండి తన్ను వెడలింపఁ బ్రయత్నించిన పూజారుల నుపలక్షించి "సోదరులారా! ఒకవేళ నన్నిట నుండనీయక తఱిమి వేసిన తఱిమివేయుదురుగాని నా హృదయకమలకర్ణికాంతరనివాసియగు భగవంతుని వేఱు సేయఁగలరా! నానీడ నానుండి యెట్లు వేఱుపడును? ఇతరుల కట్లొనర్ప సాధ్యమా?" అనిపలికి కొంతవడి యంతర్ముఖుండయి యుండి పిదపఁ బయనింప యత్నించునెడ — 99

ఆకసముచిమ్మఁ జీకటులలముకొనియెఁ
దామసుల కార్యతంత్ర సిద్ధాంతమట్లు
రిక్కలిటునటుఁ దలలెత్తి నిక్కఁజూచె
సంఘసంస్కర్తలొదవిన జాడనొకట. 100

తొలిదెసమింట రేవెలుఁగు
దోఁచె సమస్త జగద్వ్యకీర్ణ సం
కులతిమిరాపహప్రథిత
కోమలకౌముది పర్వెసర్వ ది

క్కుల పటువంచక ప్రతతిం
గూల్చెడు సద్గురు దేవబోధ సం
విలసిత వార్తలింబలె వి
వేక మహోదయమయ్యె నయ్యెడన్. 101

లోకంబెల్లన్ దమకు వశమై
లోగి వర్తింప స్వార్థ
వ్యాకోశాత్ముల్ హరుని భయమా
వంతయేన్ లేకయే స్వే
చ్ఛాకారిత్వస్థితిం జెలంగం ద
జ్జాడ్యమున్ బాపి మేలున్
జేకూర్పం జాలినతపము నా
ర్జించినావో మునీంద్రా! 102

ఇది శ్రీ వైద్య విద్వత్పండిత సత్కవి నారు నాగనార్య మహాశయ
విరచితమగు మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వామి
చరిత్రమునందు చతుర్థ ఘట్టము.





మహర్షి సద్గురు

# శ్రీమలయాళస్వామిచరిత్రము

అను

# అసంగానంద విజయము

## పంచమ షష్ఠము

శ్రీ పరమేశ్వర కరుణా !
ప్రాపిత నిజదివ్యబోధ వరగుణనిచ యో
ద్దీపిత ! లోకోద్ధరణ !
వ్యాపృతనిజ శిష్యలోక ! పరమవివేకా

అంతస్వామియును నారాయణాద్రిఁ జేరి
న్యాటిరాత్రిఁ బరుండి స్వప్నమ్మునందు
గాంచె శ్రీ వేంకటేశుఁడే కానుపించి
సాగుమిటనుండి యని పల్క సాగినట్లు 1

దిగ్గన మేల్కని ప్రణతుల
నగ్గలికఁ జొనర్చి కౌతుకాధీనమతిన్
బిగ్గఱగఁ బలికె ''కాశీ
బుగ్గ'' నిశానప్రయత్న పూర్వస్ఫురణన్ 2

అమ్మఱునాఁడు ప్రాతఃకాలముననే ముఖ్యానుయాయు లొక కొంతమంది వెంటరా కాల్నడతో బయల్వెడలి. 3

ఏడుకొండలవాఁడె నా కేడుగడ య
టంచు నెఱనమ్మి పయనించె నచటినుండి
యాంతరపిపీలికాదృష్టి సంతరించి
నెమ్మదిగ జేరె నేర్పేడు నెమ్మితోడ. 4

అట్లానాఁటి రాత్రికే నిర్దిష్ట ప్రదేశంబుఁ జేరె. ఆగ్రామ సీమ కనతి దూరముననున్న నందిపర్వత సానుప్రదేశమున కాశీ బుగ్గ తీర్థంబు గలదు. 5

కాశీబుగ్గ

వారణాసీ సమాసీను పాదకమల
మధువిధిన్ జాలువాఱెఁ దత్ప్రథిత జలము
కావునఁ బవిత్రమయ్యది; 'కాశిబుగ్గ'
యంచు నద్దానిఁ బేర్కొందు రార్యజనులు. 6

మఱియు నా దివ్య ప్రదేశమాహాత్మ్య మెట్టిదనిన తొల్లి శ్రీ గర్గగోత్రజుండగు నందియను వీరశైవ వ్రతాచార పరుఁ డగు నొక విప్రుఁడట నివసించుచుండె. అతఁడవసానకాల మున శివభక్తి తత్పరుండై సన్నివిష్ట భక్తజన సమాజమధ్య మున తన సహధర్మచారిణియు, పతివ్రతాశిరోమణియు, శివభక్తి పరాయణయునగు జపాలాఖ్యయైన సతీమణిని బిలిచి

నేనిదే శివసాయుజ్యమునందఁబోవుచుంటిని. నీవు పూర్వా చార పద్ధతికింగట్టువడి సహగమనమాచరింపక మదీయాను శాసనమంగీకరించి వర్తించుచు యథాతథముగా శివభక్తి ప్రపత్తులు గలిగి జీవితమంతయు నిజసర్వస్వమును శివభక్తులకై వెచ్చించి నాకమందానందము ఘటింపజేయుమని నిర్దేశించి శివపదమందెను. తదనుసార మాసాధ్వీమణియుఁ బ్రవ ర్తిల్లుచు నొక్కనాఁడు కుమారతంత్రోక్తవిధమున నభూత పూర్వముగా కార్తికేయపూజఁగావింప ముదితాంతరంగుండై కుమారస్వామి ప్రత్యక్షమై యామెకోరిక మేరకు సర్వతీర్థపూజార్హమై పాపనిగర్హణమై సర్వజనసేవ్యమాన మగు తీర్థమొండు నిర్మింపందలఁచి సన్నిహితపర్వతశిఖ రమ్మున శక్తిచేఁ బ్రహరణమ్మొనర్పఁ దన్మహిమమున నేర్ప డిన బిలప్రదేశమునుండి యతి పవిత్ర తీర్థమొండుద్భవించెను. అయ్యదియే జపాలాశక్తితీర్థముగా నేటికిని ప్రఖ్యాతమై విరాజిల్లుచున్నది. అందలి తీర్థ ముత్తరాయణమునఁ బెరుగుచు దక్షిణాయనమునఁ దరుగుచు సర్వతీర్థ విలక్షణత నొప్పు చున్నది.

పిదప జపాలయు యథావిధి శివపూజాధురంధరయై యుండు నెడ శ్రీ జ్ఞానప్రసూనాంబాసమేత శ్రీ కాళహస్తీ శ్వరుండామె భక్తిని పరీక్షింపనెంచి సాధువేషముధరించి యతిథియై యామెయింటికరిగి యాతిథ్యమ్మొనర్పు నవస రమ్మున సాయమభక్తిపరవశయై యత్యుష్ణమగు పాయస

మయ్యాది భిక్షువు చేతిలో పోసినతటి నా వేడిమికిఁ దాళ జాలనట్లు నటించి యతఁడు '(శ్రీ)హరీ!' యని బిగ్గఱగా కేక లిడ వీరశైవాచార పరాయణయగు నజ్జపాల వ్యతిరేక శబ్ద శ్రవణబాధనించుకేని సహింపక తనచేతి గరిటెతో నక్కుహనాభిక్షువు నెత్తిపై మోదినంత నామె శైవమత దీక్షాదక్షతకు మెచ్చి యయ్యాది భిక్షువు శివలింగరూపము నొందెఁ. మఱియు నైదు పరియలుగా చీలిన శిరోభాగము నుండి నెత్తురు గారఁ బ్రత్యక్షమైన శివలింగమునుఁ గాంచి యాశ్చర్యచకితయై జపాల భక్తిం బ్రదక్షిణ లొనర్చి శివ తత్త్వార్థగర్భితమగు మనోజ్ఞ వాఙ్మయమున పరమశివుని ప్రస్తు తించి " ఓ దేవా! నన్నీ ఘోరసంసారసాగరమునుండి తరింపఁజేయు"మని వేడుకొనిన తారకేశ్వరస్వరూపుఁడగు పరమేశ్వరుఁడామె వాంఛల నన్నింటి ననుగ్రహించి తత్ప్ర దేశమున కెనలేని పవిత్రతం జేకూర్చి సర్వప్రదేశగామియగు దివ్యవిమానమున నా భక్తిస్వరూపిణియగు జపాలను కైలాస మునకుం గొనిపోయె. అది మొదలా స్వయంవ్యక్త శివలింగ ముత్తారకేశ్వర ప్రసిద్ధనామమున సర్వముముక్షుజన హితకారియై వెలుగొందె♦. దాని కనతి దూరమున పవిత్రాంభః పరిపూరితమై కూర్మతీర్థమనంబరగు నొక తామరకొలను సర్వజన స్నానపానాదికయోగ్యమై యల రారుచున్నది. అప్పర్వతసానుప్రదేశమంతయు శాంత్యారోగ్య

♦ ఈకథ శివపురాణాంతర్గత శివరహస్య సంగ్రహమున నిర్దిష్టమైయున్నది.

భాగ్యనిలయమైన పవిత్రక్షేత్రమగుటం జేసి సర్వాంగీణమ్ముగా నందు నివసింప ముందుముందాత్మాంగీకారమ్ము వడసిన య త్తపోధనుండుద్దిష్టప్రదేశమ్మునకుంబోవ సమకట్టిన ట్టి పట్టున నరుణోదయంబగుటయు, భవిష్యత్ శుభసూచన ప్రాయమ్ముగా కులాయమ్ములనుండి ద్విజవ్రజమ్ము రెపరెప ఱెక్కలల్లార్చి ముందు కురుకుటయు, వినీలాకాశమ్మున ప్రసన్న గంభీర మేఘమండలమ్ము పారాడుటయు, సర్వతోముఖముగా వాతావరణంబనుకూలించుటయు, వామనేత్రమ్మదరుటయు నిత్యాదిగా గల శుభలక్షణముల వీక్షించిప్రశాంత హృద యుండైయున్న యవసరమ్మున — 7

గ్రీవముల నెత్తిపై త్రిభంగిగ నమర్చి
కొక్కొరోకో యటంచును కోళ్లు గూసె
మిలమిలని రిక్కలును మాసె వెలుఁగు లేచెఁ
దూర్పు దెస నరుణారుణ ద్యుతులు దోచె. 8

ప్రాగద్రిం బొడ తెంచి సూర్యుఁడు తమః
ప్రాబల్యము న్మాంచి మి
థ్యాగర్వాదులడంచి పంచె గగనా
ధ్వంబందు సప్తాశ్వముల్
బాగోగుల్ దెలియంగ నేరని జడుల్
పై కొన్న రాజ్యమ్ము దు-
ర్యోగమ్మాడ్చి జయధ్వజమ్మెనయ ను
ద్యోగించు రాజుం బలెన్. 9

కుసుమవనరాజి మేఘుండు కురిసినట్లు
మలయపవనుండు క్రమమం దొలసినట్టు
లామధమ్ము రుజార్తి సోఁకార్చినట్టు
లాంధ్రిపయి పదమూనె నీ యతి విరాట్టు. 10

మలయాళదేశమును విడి
తెలుఁగు వెలుంగుల మెలంగఁ - దెలుఁగు ప్రజలు శ్రీ
మలయాళస్వామి యనఁగ
బలు వితముల మానివరుఁడు - ప్రఖ్యాతి గానెన్. 11

ఏ లగ్నమున మునీంద్రుఁడు
కాలిడెనో నాఁడు మొదలు - కలకల పైరుల్
మేలొందు పంటపొలమటు
చాలన్ రాణించి మించె - సకలాంధ్రమ్మున్. 12

మలయాచల విచలత్స్వర
భిళమును గొని మారుతమ్ము - వేగమ్మునఁ దె
ల్గుల కందించి యశః స్థితి
నలవరచుకొనన్ ప్రయాణ - మై చనుదెంచెన్. 13

పైరులుఁ బచ్చలు నిండుగ
వేరులఁ గాలిచెన్ ఫలించె - వీరజనబల
స్ఫారము లాభించెను వ్యా
పారము ధీరుల మనీష - పారమ్ము ముట్టెన్. 14



శ్రీ వ్యాసాశ్రమ ముఖద్వారము

—: శ్రీ వ్యాసాశ్రమ స్థాపనము :—

భక్తజనులెల్లరును హర్షపరవశులయి
యంచితమ్ముగ తన్ను సేవించుచుండ
ననఘచరితుండు మునిచంద్రుఁడతఁడు సమ
నమరు వైశాఖ కృష్ణ సప్తమినిఁ బ్రీతి ♦ 15

స్థాపన మొనర్చె ననమదీక్షాపటిష్ఠ
మతిని వ్యాసాశ్రమమ్ము ధీమద్విశిష్ట
సాధు సముపాసితము మహాజ్ఞానదీప్తి
భాసితము సత్కళా సముపాశ్రితమ్ము. 16

పర్ణకుటీర మొండు ప్రతి
భామతి నిల్పె సదోంకృతి స్వరా
కర్ణన చిత్తవృత్తియయి
కర్మ వికర్మ విభేద సాధనో
దీర్ణమతానుయాయి యయి
దివ్యదఖండ నిజాత్మతత్త్వసం
పూర్ణగవేషణుండయి ని
బోధిత జీవజగద్విభాసియై. 17

అది నాఁడు నాటికెంతయుఁ
గుదురై యధ్యాత్మతత్త్వ-కోవిదులకు సం
విదులకు బుధులకు నెలవై
పొదలెఁ బదియారు కళల-పున్నమ వోలెన్. 18

♦ 3—6—1926 (గురువారము)

రిక్కలలో నొక్కండగు
జక్కవకవ విప్రునోలె - సంయమి వెలిగెన్
దక్కు జనమ్ములఁ గాలము
పెక్కవ బలమెవ్వఁడెఱుఁగు - విధి యొకటి వినా. 19

కులసతి మొగమున మొటిమల
వలె శుద్ధాశుద్ధ కవిత - వలె నోరె మునం
గల రాళ్లటు లావరణ
స్థలి నిమ్నోన్నత మసంస్కృతమ్మయి పొల్చెన్. 20

ధూమశకటాలయమునకు
సామీప్యమ్మయి విరాగి జనగోప్యమ్మై
పామర జన సంచారము
నై మేలగు నందికొండ - యల్లరారుఁ గడున్. 21

ఏడుకొండల సామి కొక్కింత క్రింది
కొండ పిండునఁ దానందదండనుండి
రమణ వెల్గొందుచును బుధ రాజి హృదయ
నిరుపమానందకందమై నివ్వటిల్లు. 22

ఆకొండ క్రింది ప్రదేశమ్మున నాశ్రమమ్ము నిర్మించి విపశ్చిదగ్రగణి యగు నమ్మునివరేణ్యుండు తత్పరిసరప్రాంతమ్ము లన్నియు శాంతజన నివాసయోగ్యమ్ములుగా సంస్కరింప బూని. 23

కాలక్రమమున భూమినిఁ
బాలించి గణించి చక్క - బరచి కృషీకులక్
బాలింపఁ జేసె మహితో
ద్యానవన మె - వెలసె ననంగన్. 24

ఎచ్చటఁ జూచిన తోటలు
పచ్చని పైరులును నీటి - పట్టులుఁ గనువిం
దచ్చుపడన్ నిర్మించెను
దచ్చి కడల్ హెచ్చు మెచ్చి - తని సని పొగడన్. 25

ఆకుమడులును కూరగాయల కుదుళ్లు
మహిత ఫలవృక్ష సమితియు మాధినాథ
పూజకై తగు బహువిధ పుష్పరాజి
వెలసెడు తపోవనమ్ము గావించె నౌర! 26

పర్ణశాలతోడ ప్రారంభమై యది
పెక్కుకట్టడముల పెక్కుఁజూపి
నగరవాసమట్లు నాగరకములతో
వృద్ధినొందె తపము సిద్ధిఁబొందె. 27

తొలుదొల్త భారతీమందిరమును నిర్మించి, యందు శ్రీ వేదవ్యాస భగవానుని స్థాపించె. మఱియు సాధుజన నివాసయోగ్యంబులగు సద్గురు మందిర-శారదా మందిరాద్య నేక భవనంబులంగట్టి గీర్వాణభాషా సముద్ధరణార్థమై యొక

పాఠశాలను స్థాపింపందలంచితదనుగుణముగా నొక సుందర మందిరమును కూర్మతీర్థతటంబున నిర్మించెను. 28

వ్యాసవాచం యముని చిత్కళాసమేత
మైన వ్యాసాశ్రమమ్ము విద్యాయుతమ్ము
పదియు నాలు కళల్గల్గి పొదలు నాహి
మాంశు వటు బోల్చె నిరతక్రమాభివృద్ధి. 29

ఒక వంక శారదయు వే
ఱొక వంకను లక్ష్మి నిలువ యోగ్యమ్మయి ప్రే
క్షకలోక మెందుఁజూచిన
సకల కళానిలయమై ప్రశస్తి వహించెన్. 30

కాయ కప్పురమ్ము కానుకలం దెచ్చి
భక్తితోడ స్వామి పాదపీఠి
నప్పనమ్ము సేసి యధికతరానంద
పరవశమున జను లెదుర వసింత్రు. 31

పండుగలు పబ్బములె కాదు ప్రతిదినమ్ము
నాశ్రమమ్మున మహితోత్సవాదులగుట
నాశ్రితులుఁ బ్రేక్షకులు నూహాకందరాని
యవ్యయం బైన యానందమనుభవింత్రు. 32

అతిరహస్యమైన యాత్మవిద్య నెఱింగ
తెలుఁగు పొలము నాల్గు వలఁకులందు
బయలు మెఱసి రపుడు వ్యాసాశ్రమముఁ జేర
భక్తవరులు సాధువాద పరులు. 33

సురభిళ ద్రవ్యములునుఁ గప్పురపు సిరము
జతపడు విధాన మలయాళ యతివరేణ్యు
సరసఁ జేరిరి దూర దేశముల నుండి
వచ్చి హెచ్చిన భక్తి తత్పరత బుధులు. 34

పండితులు వచ్చి గీతపై భాష్యములను
పలికి యానందపరవశత్వమ్ముఁ గూర్ప
నూతనాంశమ్ము లెఱిఁగి సంప్రీతి మరగి
నిత్యసంతుష్టిమై భక్తనిచయమలరె. 35

శాస్త్రప్రమట్కానుబద్ధ విషమ సమస్య
లానుపూర్వ్యమెఱింగి కాలానుకూల
సరణిఁ దీర్మాన మొనరించు పరిణతమత
వాదులటఁ జేరి రంతఃప్రవాదమడఁప. 36

తెలుఁగు మాగాణమందుండి జిలుఁగు వెలుఁగు
వెల్లికలవోలెఁ దెరలుగా వెల్లివిరియు
భక్తసమితికిఁ గూడలి పట్టు సుమ్ము
వ్యవధిరహితశ్రమమ్ము వ్యాసాశ్రమమ్ము. 37

—: శ్రీ పరమేశ్వరస్వామి :—

గోగర్భమందు నుండియు
యోగించెఁ సాయమగుచు యుక్తాత్మత క
ల్పాగ సమమయి చరించెఁ
బాగుగ పరమేశ్వరాఖ్య భక్తవరుఁడొగిఁ. 38

తపము మొదలదిసిద్ధిబొందనగువరకు
జీవితాంతము దాక విశిష్టరీతి
నమరె చేదోడు వాదోడునై గురునకు
పొందుగను పరమేశ్వరానంద బుధుఁడు. 39

—: శ్రీ సాయం వరదదాసు :—

సాయం వరదాఖ్యుం డస
హాయోద్యమయోధముఖ్యుఁడనుపమ గురు సే
వాయత్తచిత్తుఁ డతుల త
పోయుక్తుఁగ ప్రేమభావ పూరితుఁడగుచున్. 40

కొండమాచుపల్లెనుండి హుటాహుటి
కొండవంటి గురుని యండఁ జేరి
గండకత్తెరయిన బండ సంసారంపు
వార్ధి దాటు వెరవు నర్థిఁ గోరె. 41

భక్తిభావ ప్రచార సంపదలఁ బొదలి
జీవితాంతము దాక నీ యావదాంధ్ర
దేశమును దిమ్మదిరిగి యాత్మీయ గురుని
శక్తియుక్తులఁ జాటె విశాలధాటి. 42

మఱియు సద్గురుభక్తుండు పెక్కు కీర్తనలు, పద్యాత్మకకృతులు విరచించి శ్రీవారి యశశ్చంద్రికలను సకలాంధ్ర దేశంబున విస్తరింపం జేసె.

—: ఉపదేశ సూత్రములు :—

భక్తజనాహ్లాద సంధాయి యగు నమ్మహర్షి భవతాపతప్తమగు లోకానీకమునకు బహువిధోపదేశముల నిరవధిక శ్రద్ధమెయి బోధింప సమకట్టి — 43

అనుదినమున్ బ్రతిక్షణము
నైహిక బంధ నిబంధన చ్ఛిదా
ప్రణుత మహోపదేశములు
భక్తి సమాహిత పూజలున్ బురా
జనిత మహాత్మ సత్కథలు
సార్వజనీన విశేషనీతులున్
వినుత పురాణకాల మహ
నీయ కథావళు లానుపూర్విగా. 44

ఉపదేశించుచు హితమగు
నుపమాన కథావబోధ - నోపాయములన్
గృపమీఱఁ జూపుచున్ దీ
ర్ఘ పరామర్శల సునిశిత - గతిఁ జర్చించున్. 45

సకలదేశహితుల సాధువాదులఁ బ్రబో
ధకుల ధీరవరులఁ దత్త్వపరుల
కవుల జీవితములు ప్రవిమలగాథలు
నచ్చ తెనుఁగు వోలె నచ్చఁజెప్పు. 46

ఏయే వేళల నేపను
లేయే పగిదిన్ బొనర్ప - హితవగు నట్టుల్
పాయక పొనరించును ద
ద్ధ్యాయ స్త్వమ్మొరుల కెపుడు - బోధ మొనర్చున్. 47

కవి శేఖరులను భక్త
ప్రవరులఁ బండితులఁ బిలిచి - బహుళసమస్యా
వివరణముఁ జేయుఁ దనమది
రవరవ సత్యమ్ముఁ బల్కు - టయె వ్రతమగుటన్, 48

మానవులందఱు దేవుని
సూనులె యం దెచ్చు లొచ్చుఁ - జూచుట స్వార్థం
బౌనని కుల భేదము ల
జ్ఞానఫలములనియు మహిత - సత్యము వల్కున్. 49

ఉత్తమకులజులమని బి
ట్టొత్తిగిలు తదన్యజనుల - నుడికింపఁగ నా
యుత్తమగువారి చర్యలు
సత్తా లేనివని సభలఁ - జాటించు నహా! 50

గుణకర్మ విభాగము తగు
నను గీతాశాస్త్రబోధ - మతి ముఖ్య మటం
చును ఢక్కగొట్టి చెప్పును
జనులు యథార్థమ్ము నెఱిఁగి - సంతస మొందన్. 51

లోకాపకారమగు హిం
సాకాండ గణించి హృదయ - సదనము వగులన్
శోకించి బుద్ధునట్టులు
లోకమునకు నీతిబోధ-లున్ సమకూర్చున్. 52

గతిలేక వెతలపాలయి
సతతము నబలలు విచార - జలధి మునుంగన్
భృతకరుణామతి వారిన్
మతి యుతల నొనర్ప కంక - ణముఁ గట్టెవడిన్. 53

కలరు మతాధిపుల్ శతని
కాయములన్ బరివర్తనం బొన
ర్చి లలిత శాంతి దాంతి గుణ
సిద్ధి ఘటించెడు వారు; వారలే
బలముగఁ బట్టుఁ బట్టి తమ
పంతము నెగ్గుటకై హఠమ్ముతో
వలదిక స్త్రీలు గీతఁజదు
వందగదంచన నెంత నొచ్చెనో. 54

మానవులంద ఱొక్కటని
మాధవు కూరిమిబిడ్డలంచు వి
జ్ఞాన నిధానులంచుఁ బలు
సారులు భూరి సభాముఖమ్ములన్

సూనరి మానవుల్ కుమిలి
ప్రుక్కఁగ మానము దక్కఁగా సుధీ
ప్రాణులు నిక్కఁగాఁ బలుకుఁ
బైహాతవాదులు నిప్పుద్రొక్కఁగా. 55

తనచేతి యాటబొమ్మగ
వనితం బొనరించి జగము - వంకం గవనే
రని జడ పురుషుల గూఢిచి,
పనవుల్ ఘుమ్మూరు జ్ఞాన - పరిషత్తులలో. 56

ఏ నాఁడబలలు పతితలు,
నై నిరయమ్ము ననుభవింతు రప్పుడ భరత
క్షోణి వినాశంబగుట ప్ర
మాణంబని నిర్ధరించి మతిమతి పల్కుదుర్. 57

అడఁగఁద్రొక్కఁబడిన యబలల్ బునరుద్ధ
రించు టెంత ధర్మ మెంత కంటె
విధి విహితము కలదె? విజ్ఞతకల రాశి సా
ధనము కల్గదె? మంచి గానము కలదె? 58

బండి చక్రము లటులఁ దం - పతులు రెండు
లొచ్చులును లేక నడచిన మొచ్చు మచ్చు
బోరగిలఁబడు విషమమై పోయినంత
కాన సమతతో నైసర్గికముగ సృష్టి. 59

అని యనేక ధర్మంబులుపదేశించుచు మఱియు
నగ్గురువరుండు. 60

పూర్వర్షుల చారిత్ర్యము
లర్వాచీనుల నిబోధి - తాచారములన్
సర్వోత్తమ పదమని యా
తర్వాణీసూక్తి నిధులు - దారత నిడుచున్. 61

హృదయ కుహరాంతరధ్వని
విదితుండయి శిష్యకోటి - విని యుత్సాహో
న్పదులయి దృఢయత్నమ్ములఁ
బొదలన్ బ్రవచించు నూత్న-బోధోపరతిన్. 62

“భగవద్భక్తికి మించిన
సుగమోపాయమ్ము తెఱచి - చూచిన కలదే
నిగమములు నాల్గు జదివిన
నిగ నరుఁడద్దాని నిర్వ - హించుట యొప్పున్. 63

ఎదివిన నెదికనఁదలఁపె
య్యది పూనఁగఁ దత్త్వచింత - యది తప్ప మఱె
య్యది యోచనకొదవని యా
మదిరయే శ్రేష్ఠమ్మటంచు - మఱువకు డెప్డున్. 64

నారదభక్తిసూత్రము ల
నంబడు గ్రంథమునందు ముందు శ్రీ
నారదమౌని పల్కెను స
నాతన భక్తిని ప్రేమయంచు సం
స్కార విహీనులౌ జడులు
కామమె ప్రేమయటంచు బల్కుచు
న్నారిది దోషదూష్య మధు
నాతనులిద్ది గ్రహింపఁగాఁదగున్. 65

కామమునుగూర్చి జడులే
ప్రేమమ్మని సభలనిల్చి ప్రేలఁగఁ బ్రజ లెం
తే మెచ్చు కాలమకటా
యేమనవలె వైపరీత్య మీ పోకడలన్. 66

కలి కాలమ్మున దోషము
బలితమ్మయి నిగమ విగమ - భావమ్ములు వి
చ్చలవిడిఁ బ్రబలెడు వీనినిఁ
దొలఁగింపమి దేశమునకు - దుర్గతి కాదే. 67

భారత పతితావస్థల
నారసి పునరభ్యుదయ మ - హార్థముఁగన దై
వారాధన మొనర్పుడు
వేఱొకరీతిం ఘటింప - వెఱపుండు నొకో. 68

లోకమ్మునఁగల విషయా
నీకమ్ములు భౌతికార్థ - నిభృతమ్ములు మి
థ్యాకరములు పరతత్త్వ
శ్రీకల్పము లగునె యవ్వి - చింతించునెడన్. 69

కామినీ కాంచనమ్ములఁ గడకునెట్టి
దైవభావమ్ము మదినొంది ధ్యానమంది
యశన తృణ్ణిద్రలను మానియైనఁ బరమ
పద సముపలబ్ధికై పాటుఁబడఁగ వలయు. 70

నిందిత విషయోచ్ఛ్వాసం
క్రందనులు నిజేంద్రియార్థ - గతులయి చెడరే
ముందు మన ఋషులు వల్కిన
పొందగు ధర్మములు విడచి - పుచ్చుట తగవే. 71

ఇరువది నాలుగు గంటలు
నరులైహిక విషయముల మ - నస్సు లయింపన్
బరతత్త్వార్థ మిఁకెన్నఁడు
వరియింపం గలరు జన్మ - వ్యర్థము గాదే? 72

పనిలేని తనము నెమ్మది
పనిలేని తనమ్మొ భావపరిధుల నిర్జిం
చిన గొనమగు నదితపమనఁ
జను నైష్కర్మ్యార్థసిద్ధి సముచిత రీతిన్. 73

పరుని వెదకుట సర్వమప్పన మొనర్చి
టనఁగ నిరుతెఱఁగులఁబొల్చు మనుజుని పర
భక్తియందేదియైన స్వశక్తికొలఁది
ననుసరించిన గమ్యమ్మునందు టరుదె. 74

ఎన్ని భవమ్ముల నెత్తిన
మన్నికసుమి జీవికాత్మ - మార్గాన్వేషం
బెన్నిక నీ స్వర్ణద్వా
రోన్నయమునఁ బోవ సహజ - మొప్పె సలారుఁ. 75

పీనసరోగి సువాసన
లేని బీల్వంగ సాధ్యమే యటు నరుఁడెం
దేని తత విషయవాసన
లూనిన వశమగునె భక్తి - యుక్తులు లవమేఁ? 76

అరిషడ్వర్గ జయమ్ము కోసమయి మి
థ్యాయత్నముల్ సేయ కు
ర్వర నత్యంత నిగాఢ దీర్ఘ రచనా
వ్యాజంగమున్ గూర్ప మే
లొరయుఁ దీర్ఘశతఘ్ని గుండునిడ శ
త్రూద్భేదముంగూర్చు ద
బ్బరనారఁ జతగూర్చి ప్రేల్వ నరి ×
ర్వంబింత యూటార్చునే! 77

మనుజులు వివిధాకృతులై
మనువెట్లొ విభిన్నతత్త్వమార్గము లట్లె
ల్లను; గమ్యమొకటె నదు లె
ల్లను సంద్రము సేరునట్టు - లను జతపడదే! 78

ఎపుడు దుర్గంధమునఁ బీల్చ నిష్టపడని
యట్లు విషయమ్ములను బొంద ననుగమింప
కున్న యన్నరుఁడాముష్మికోన్నతుఁడయి
కొండలను మీరువటు వెలుఁగుఁగనుఁగాడె. 79

ఆధికారిక భేదమ్ము లనుసరించి
పల్కెతే స్వానుభూతి తత్త్వప్రబోధ
మలఁతి విశ్రాంతిలేని మహాత్ముల నిజ
పారమార్థిక కృషిఁగూర్చి పలుకఁదరమె. 80

హితబోధ మొనర్చుటె యొక
వ్రతమని పలుకంగ నేల - వరకర్మతుఁడై
బతినఁగాని తాను సేయుచు
నితరులఁ జేయించు పూన్కి - యే మిన్నయగుఁ. 81

ఏ యే కాలమ్మున యం
దే యే కర్మలఁ బొనర్చుటే విధియగునో
ఆ యెడ నా పని సేయుటె
పాయక సద్గతినిఁ జేర్చు బాటయగు సుమీ!” 82

ఇట్టులాగురుఁడుపదేశ మిచ్చి యిచ్చి
కూరిమిఁ ప్రబోధమున శిష్యకోటిఁదనిపె
మలయ మారుత వీచిక లలము పగిది
స్వామిదరి భక్తులలరిరి సంతసమున. 83

మా యూరికి రమ్మనియును
మా యెడఁ గరుణింపు మనియు - మా కిప్పట్లన్
సాయమ్ము సేయుమని భ
క్త్యాయతమతిఁగోరి రంత - నచ్చటి భక్తుల్. 84

ఘోరతరాజవంజవ ని
గూఢమహాబ్ధి నిమగ్నవృత్తిమై
పారముఁ జేర లేని మము
భవ్యకృపామతిగట్టుజేర్చి సం
స్కారముఁబేర్చి శ్రీశు పద
సారసముల్ భజియింపనేర్పు న
ట్లూఱటఁగూర్పు మంచు
వినయోన్నతి వేడిరి భక్తులెల్లరున్. 85

భక్తులమదిఁ గోరికలా
సక్తిమెయిన్ దీర్పనెంచి - సమయోచిత ది
వ్యోక్తులతో నిజమ్మతమును
యుక్తగతిం దెల్పు స్వామి - యుద్బోధకుఁడై. 86

తండోపతండములు మదిఁ
బండిన భక్తులటవచ్చి ప్రశ్నింపుచు మేల్
నిండారి తనిసనర్ దగు
కొండొక బదులంది తనివిఁ - గొనిరెంతేనిన్. 87

ఉప్పెన పొంగినట్లు జను
లో హరి సాహరి గుంపుగట్టి తా
మప్పటి కప్పుడే పయన
మై గురుసన్నిధిఁ జేరు వాంఛమై
తప్పక యాశ్రమమ్ము దరి
దాపులఁ జేరి నమస్కరించుచున్
తప్పులు దిద్దికావుమని
తత్పరబుద్ధి భజించి యంతటన్. 88

—: భక్తుల వేడికోలు :—

స్వామీ! యే మననేర్తు మీ జగమె పో
సత్యమ్ము తద్భిన్న మొం
డేమీ లేదని భోగభాగ్యసుఖముల్
హేలాగతింబొందు చే
ప్రామాణ్యంబనియున్ దదన్యము దురా
రాధ్యమ్ము దుర్జ్ఞేయమున్
సామాన్యమ్ము నటంచుఁబల్కుదు రవ
జ్ఞాదృష్టిమై దుర్మతుల్. 89

ఎక్కడఁజూడఁబోయిన ని
రీశ్వరవాదమె నాల్గు దిక్కులన్
బిక్కటిలంగ మ్రోఁగె నొక
వేళ సనాతనధర్మ సూత్రముల్
నొక్కి వచింపఁబోయిన మ
నో మలినీకృతి దుర్విచార వా
క్ఛక్తి నెదిర్చి యోర్తురిది
పద్ధతి యుద్ధతియయ్యె సద్గురూ! 90

భగవద్గీతా శాస్త్రమె
మగువలు పఠియింప రా దమాంతము పాపం
బగునని స్వార్థమతిన్ గడు
పగ గొని చాటింత్రు సభలఁ బ్రచ్ఛన్న యతుల్. 91

చెడినం జేపట్టరు గా
మిడియైన సహింపరు మిడిమేలపుఁ బజ యీ
చెడుగరుల దిద్ది తీర్పమిఁ
బడు నానా యాతనలు ప్రపంచమ్మకటా? 92

ప్రామినొకులట్టి గురు బో
ధామృతముం ద్రావ [illegible] రింపట్కసురన్
గా[illegible] [illegible] నరో
త్తీ మొయి సామో[illegible] గురూ! 93

పెద్దలాడుమాట పెరుగన్నపుఁగా మూట
సాటియంచుఁ బల్కు నాఁటిమాట
కోటలెల్లదాటి కోనలకునుఁ జాటె
నేఁటి కదియె నీళ్లమూట, యయ్యొ. 94

వేఁగి శోషిత యది మొదల్ భోగములకు
భాజనమ్మయి జీవిత భాగధేయ
మెల్ల విత ప్రోవ వెచ్చించి పొల్లు వడిన
బ్రదుకుతో నుందురైహిక భావపరులు. 95

తినుట త్రాగుట తిరుగుట తెండికోనుట
తప్ప నన్యమ్మెఱుంగక ధర్మరహిత
వృత్తి నున్న మానవులకు వేదవిహిత
ధర్మమార్గంబు జూపించి తమపుమయ్యె. 96

నిత్యనైమిత్తికమ్ములన్నియు యథార్థ
తమ్ము భౌతిక వాసనా తత్పరతను
మెలఁగుచుండుటఁ బరతత్త్వముల నెఱుంగ
జాలమికి జీవితము వృథాచనె మహాత్మ! 97

పెక్కురు పెక్కు జన్మముల
పెక్కు విధమ్ముల లోకవీథికై
నిక్కము వక్కణించుటకు
నిర్ణయమూని స్వజీవితమ్ములన్

మిక్కిలి ధారవోసి; రిఁక
మీరలు దీనుల కండదండలై
చక్కని ధర్మబోధలఁ బ్ర
సన్నతఁగూర్చి తరింపఁ జేయరే. 98

స్వామి! తొల్లింటి మన మతాచార్యులెల్ల
రాత్మతత్త్వంబు తెలుఁగిట్టిదంచుఁ జెప్పఁ
గడఁగిరే కాని సంఘ సంస్కరణమునకుఁ
బూని చేసిన పని సుంత కానరాదు. 99

బుద్ధుఁ డొనరించిపోయిన బోధలెల్ల
వ్యర్థమైపోయె నో దేవ! స్వార్థపరులు
పన్ను వలలకుఁ జిక్కి విపన్నులగుచు
నడలు దీనుల రక్షింపుమయ్య! స్వామి! 100

స్త్రీ శూద్రాదులఁ బ్రోవగఁ
బాళవికుల బారినుండి పరిరక్షింపన్
శ్రీ శాంఖ్రి లగ్నచిత్తా
వేషులఁ జేయంగ దిక్కు వేఱొకఁడున్నే? 101

ఇవి యివి యంచుదాహరణ
లిచ్చి హుటాహుటిఁ జూపిచెప్ప మా
కవునా? యింత నేర్పు కల
దా? యయినన్ విదితాంశముల్ మనో

వివరణ భూమికన్ బోడమి
వెల్లడియైనవి దిక్ప్రదర్శనం
బవునటు విన్నవించితిమి
యావల దేవర యిష్టమన్నిటన్. 102

పతితుల నుద్ధరించుటకుఁ
బావన భారత నీతులన్ పురో
గతి వహియించి ధర్మము ప్ర
కాశిలఁ జేయుటకున్ భవాదృశుల్
క్షితి నుదయించి తాత్త్విక వి
శిష్టత ధీప్రవిబోధనా సమం
చిత మహితోద్యమాభిరత
సిద్ధి వహింతురు గాదె! దేశికా! 103

అగతికులమైన మమ్మా
యుగమునఁ బావనులఁ జేసి - యుద్ధరణమ్మున్
దగఁ జేయ నవతరించిన
యుగపురుషుఁడ వీవ కావు - మో దేవ మమ్మున్. 104

తొలి నేమి నోము నోచిన
ఫలమో కేరళుఁడవయ్యు - బయలు మెఱసి మా
తెలుఁగుల పున్నెము పండుట
వలనన్ మముఁ బ్రోవ నిందు - వచ్చితి తండ్రీ!" 105

అని ప్రార్థించి సంసార దోదూయమాన మానసులగుటం
జేసి దురంత దంతుర సంతాపమున కోర్వంజాలక — 106

గురుచరణమ్ములె నిరతము
శరణమ్మని నెమ్మి నమ్మి స్వాత్మాంకితమున్
దొరయించు భక్తజనముల
మొఱ విని కరుణాంతరంగ – ముప మౌని వినిచెన్. 107

"ఇహమే నిత్యసుఖప్రదమ్మితర మెం
తే లేనిదాటన్ విని
స్పృహమా సంశయమేల దానికయి త
ర్కింపం దొరంకొంట దు
స్సహ దుర్దాంత పరిశ్రమైక ఫల మా
శాశూన్యమంచున్ జడుల్
సహనంబేది వచింత్రు తద్వచనమా
ల్పాటింపరాదె మ్మెయిన్. 108

నానాసూన వితాన సౌరభము ఘ్రా
ణ గ్రాహ్యమైనప్పుడ
జ్ఞానాధిక్యమునం దగుల్వడిన భృం
గం బట్లు లోకంబునన్
ప్రాణుల్ భౌతిక వాసనామయ విప
ర్యాసంబునం జిక్కి 'ప్ర
జ్ఞానం బ్రహ్మ' మటన్న దే మఱచి సం
చారింతు రిచ్చాగతిన్. 109

ఎన్నేండ్లో తపియించి తత్త్వవిషయం
బెంతేని యోచించి యా
పన్నత్రాణ పరాయణుం డొకఁడె నాఁ
బ్రార్థించి యూహింపఁద
ద్భిన్నం బొక్కఁడు లేదటంచు మది న
న్వేషించి నిత్యమ్ము భా
వౌన్నత్యంబు తదర్థ మర్పణము సే
యన్ మేల్మి గల్గున్ సుడీ! 110

తన తొలినాఁటి ప్రాఁజదువె
తల్లియుఁ దండ్రి గురుండు దైవమై
పనుపడియుండ దాని విడి
పంచలఁ బ్రక్కలఁ బ్రాకులాడి నే
ర్చిన యదియే విశిష్టమని
చెప్పుటచే సుతి మించి రాగమం
దునఁ బడినట్లు భ్రష్టమతి
తోఁ జెడిపోయిరి హైందవుల్ కటా! 111

మానవులందఱొక్కటె స
మానమె కాని మఱొండు లేదు వి
జ్ఞానమె యూతగా నిలిపి
సర్వవిభున్ భజియించి స్వార్థమెం

తే నడఁగించి యీ నరులె
యీశ్వరమూర్తులటంచు నెంచి సే
వా నిబిడాత్ములై మనుటె
పావనమంచు గ్రహింపఁగాఁదగున్. 112

కాన స్వశక్త్యనుగమన వి
ధాన నిధానానుభవ సు - ధారస ధారా
పాన వశావశవృత్తిం
బూని ప్రజాసేవఁ జేయ - బోలును మనకున్. 113

నిస్స్వార్థభావంబున మానవసేవయే మాధవసేవ, నరుని సేవయే నారాయణ సేవ, దీనజన సేవయే దేవుని సేవ యని యంతరంగమ్మున నెక్కొలిపి చరింపవలె''నని తద్భక్త జనమ్మునకు హర్షామోద సూచన ప్రాయమ్మగు సదభిప్రాయమ్ము బయలు మెఱయించిన వెంటనే యచ్చట ప్రోవయిన సాధుమండలి వినయ వినమిత శిరస్సాష్టాంగ వందనము లొనరించి తమ తమ భక్తి ప్రణతుల నివేదించిన యనంతరమ 114

—: అభయ ప్రదానము :—

గొనకొని విన్నపముం గయి
కొని ప్రీతి వచించె నిట్లు ''గురు సుతులారా!
వినుఁడిక ప్రాక్తన ధర్మ
మ్మును పరిరక్షించుకొనుటె ముఖ్యమ్మరయన్. 115

వీపున మూపున దైవము
ప్రాపునఁ గొని రేపు మాపు పని గొని భక్తి
వ్యాపారమూలమున సే
వాపరతన్ మనుటె గురుల బాధ్యత సుమ్మా! 116

ఉదరంభరులయి నలుదెస
లుదుటు మెయిం దిరిగి సునిశితోచ్చావచ వా
క్సృదరాహతి నోరు నొప్పిం
ప దలంచెడివారు గురులె మది నూహింపన్. 117

జీవితమంతయుఁ బరత
త్త్వావిష్కారానుభూతి-కయి వెచ్చింపన్
గేవల గురుఁడగు వానన్
గైవల్యము గల్గు దేశ-కల్యాణమగున్. 118

సకలమానవజాతి కీ-శ్వరుఁడు సమమె
సమధిగత భావ పరిణతార్చన మొనర్ప
నీశ్వరానుభవాదృతి శశ్వదతుల
సంతతానంద మెంతేని సంతరిల్లు. 119

నాసలో శ్వాస యాడుచున్నవర కేను
విరతి విశ్రాంతిఁ గొనక సేవింతు మివుల
ప్రథిత దైవాత్మరూపులౌ ప్రజల నదియె
యాత్మ సాత్కృతికంబె మిన్నయి వెలుంగు. 120

కావున సాధులార! తట
కాపడనేల? నిరంతరాత్మ సం
భావనఁ జేసినట్లు నిజ
భారతులన్ బరతత్త్వసాత్కృతి
ప్రావృతులన్ బొనర్చుటకుఁ
బ్రన్నదనమ్మగు సర్వయత్నముల్
జేవ దలిర్పఁ జేసెద వి
శిష్టకృతుల్ పొనరించి చూచెదన్". 121

అని నచ్చఁ జెప్పి పంపిన
వినుకలి సంతసముఁ గూర్ప విద్యార్థులఁ బో
లిన బుధులయ్యెడ భక్తి
ప్రణమిత శిరులై భజించి పయనంబయినన్. 122

అంతంగొంత కాలమ్మునకు దీర్ఘాలోచనాతత్పరుండయి దీనజన సేవాపరాయణత్వముత్తమధర్మంబని యెంచి కులమత వర్ణాది విభేదముల నేమాత్రము పాటింపక ముముక్షువులగు వారికెల్లరకు మోక్షసాధన కనువగు బ్రహ్మవిద్యోపదేశంబు సేయుటుచితంబని తలంచి యీశ్వరభక్తిని మానవ సేవా ముఖమ్ముగా దైవ్యైయర్థమ్ముఁ బొరయిక గావించుటే యుక్త మని భావించి యాత్మావలోకన కార్యకలాపమందిది యొక యంశమ్ముగా సనాతన వేదాంతప్రచారోద్యమమ్ము కొన సాగింప యత్నించి నాఁడు మొదలహర్నిశలోపకారిసాహ

రిగాఁ బ్రతినిమేషముఁ బ్రయత్నశీలిదై తండోపతండము
లుగా, గుంపులు గుంపులుగా దామరతంపరయై వచ్చు ప్రజా
నీకమునకుపదేశరత్నంబులం బంచిపెట్టుచు నాశ్రితుల కాప
నివదుక్తులం బ్రబోధించుచు నర్థులకాశ్రయమిచ్చుచు శ్రవ
ణాసక్తుల కనేక వేదాంత రహస్యమ్ముల నుగ్గడించుచు
నన్వేషణాభిలాషులకు మార్గోపదేశం బొనర్చుచు భక్తిపరు
లకు ముంగొంగు బంగారమై సకల ముముక్షుజనులకు వజ్ర
పంజరమై యత్యంతమ్ము హితమ్ము గఅపు సద్గురుండయి
వెలుంగు నయ్యవసరమ్మున — 123

పరిణత భావబంధురత
పః పరిపూజ్యులు శుద్ధతత్త్వభా
స్వరమరహస్యమజ్ఞులు ప్ర
పంచ బలాధిక వాసనాసమి
ద్విరహితు లార్యవిద్వరులు
విశ్రుతశాంతిపథాను గాములున్
బిరబిరఁజేరి సద్గురుని
బ్రీణితభక్తి నమస్కరించుచున్. 124

"గాలికిఁబొల్లు వోయినటు
కాలము సెల్లె వృథాప్రపంచ బం
ధాలకుఁ జిక్కిస్రుక్కి బహు
ధావ్యథితవ్యసనాపకర్షవా

తూల పరంపరా హతికిఁ
 దూలి యిట్లైతిమి దిక్కులేమి నీ
పాలనుఁబడ్డ మమ్ములఁ గృ
 పామతి నేలఁగదయ్య, సద్గురూ! 125

పాలనుఁబడు బల్లివలెన్
వాలముఁ ద్రిప్పుచును స్వేచ్ఛవదలి తుదకుఁ బ్రా
ణాలే కోల్పడు గతి మ
మ్మేలిన స్వామీ ఘటిల్లె నిఁకఁ బ్రోవుమయా!" 126

అని సాష్టాంగ ప్రణతులఁ
బొనరించి జేజేలు వలికి - భూరితపస్సి
ద్ధినిఁ బొంది పొసగు తత్త్వ
మ్మును దెలియఁగ వేడుకొనిరి పూర్ణశ్రద్ధన్. 127

మఱియు వారిట్లు విన్నవించుకొనిరి. 128

తమ దేశమ్మున సంఘవిప్లవము వా
 త్యంబోలె నత్యంత వే
గమునన్ రేగిన దుర్నిరీక్ష్యమయి ల
 క్ష్యాతీతమై దుష్క్రియా
ప్రమదాఖేలన దృగ్విశేషవశ వి
 భ్రాంతాత్ములై మోహపా
శములం దాల్కొని లోకులెల్లఁ జెడిరో
 స్వామీ! మహోద్రిక్తులై. 129

పెద్దతుపాను వచ్చుతటి
పీడితసార్వజనీన వస్తు లె
ల్లెద్దడిఁ బొంది కుంది నశి
యించునొ తద్విధి నాత్మశక్తులన్
దొడ్డఁగొనంగ నాస్తిక మ
తోన్నయ భావములూచముట్టుగా
బిద్దము సేసి సద్దడఁగి
పెద్దలటుల్ వచియింత్రు సద్గురూ! 130

దేశికవర! మా తెలుగుం
దేశమ్మాస్తికమతమ్ము దీలువడేఁద్వాదా
దేశమున మేలుకొని సం
దేశమ్మొరులకు నొసంగు తెలివిఁ గనవలెన్. 131

కావున విజయం చేయుడు
నావుడు తత్త్వావలోకనాపూర్ణ మహా
భావమున వల్లెయని యాం
ధ్రావనమున్ జేయుటకుఁ బయన మొనరించెన్. 132

—: సనాతన వేదాంత జ్ఞానసభ :—

తన వెంటన్ బహుళాశ్రమస్థులును ద
త్త్వగ్రంథముల్ సాత్త్విక
ప్రణయోద్బోధ పరంపరాచతుర వి
ద్వాంసుల్ కళావేత్తలున్

ఘన వేదాంతనిబోధపత్రములు సం
ఘారామ కర్త్రాదులున్
జను దేరన్ సమరోత్సవాగతమహా
సమ్రాట్టు చందంబునన్. 133

ఊరూరఁ బల్లెఁ బల్లెల
పేరెన్నికఁ గన్న నగర - వీధుల నార్ష
ప్రారంభోత్సవములతో
సారోప నిమద్రహస్య సంబుద్ధులతో 134

విరతి యిసుమంత లేకయె
సరళసులభవాఙ్ముఖ ప్ర - చారాదు లొగిన్
నెఱపుచుఁ బఱపుచు నలుదెస
లతిదివడన్, ప్రేక్షకాళికానంద మిడన్. 135

అక్షయ - భాద్రపద - బహుళ దశమీ తిథిని పాలచ్చారుగ్రామమున శ్రీ సనాతన ధర్మపరిపాలన సేవా సమాజమనుపేర నాధ్యాత్మిక తత్త్వప్రబోధార్థమై యొక మహా సభను సకలభక్త జనానందకరముగా నమ్మహానీయ చరితుండు ప్రారంభించె. అయ్యది నానాఁటికి ప్రవర్ధమానమై ప్రతి సంవత్సరము క్రమము దప్పక వివిధప్రదేశములలో నిర్వహింపబడుచు సనాతన వేదాంత జ్ఞానసభా సమాఖ్యచే విలసిల్లె. ఆ సభయందు వివిధములగు నాధ్యాత్మిక విషయములు చర్చింపబడుచుండెను. వేలకొలది ప్రజలాసభలలో

పాల్గొని దివ్యోపదేశములను గ్రహించుచు తనివిసెందిరి. పరో న్నతికి నిరోధము కలిగింపకుండుట, ఆత్మోన్నతిని సాధించుట, యథాశక్తి పరోపకార మొనరించుటయు నా సభయొక్క ముఖ్యాశయముగా వెలుగొందె. అట్లాసద్గురుండు. 136

కల నిజము పలుకుచున్ దనుఁ
బిలిచిన యెడఁ జనుచుఁ గనుచుఁ బ్రేమార్ద్రమతిన్
నిలుచుచు సుస్వాగతముల
నలరుచు నా విజయయాత్ర యటుసాగించెన్. 137

నానాపట్టణజనపద
మానవతతి హర్ష మొంద మహితంబగు వి
జ్ఞానైకతత్త్వకలనా
నూన మహా వాక్యముల సదుపదేశమిడున్. 138

ఆహారము పానీయము
సోహంభావమ్మె గాఁగఁ జూచుకొనుచు ని
త్యాహోరాత్రమ్ములు సో
త్సాహ బలోద్వేగభావ - సాగరుఁడగుచున్. 139

అడిగినవారల సందియ
ముడుపుచు దరిఁజేరువారి - కుద్బోధనలన్
నుడువుచు నిరతిశయక్రమ
మడరన్ నడయాడె ధర్మ-యాత్రాభిరతిన్. 140

ఒక నిముసమ్ము తీరుబడి
యుండక తిండియు తీర్థమింతలో
నికిఁ గొనఁబాలు పోక తపియ
నించు పరిశ్రమజీవివోలె పూ
నిక మలయాళసామి కృత
నిశ్చయుఁడై నడచెన్ ద్రిలింగ దే
శ కటకపట్టణావళి వి
శాలకృపన్ బరతత్త్వబోధయై. 141

గుంపులు గుంపులు తామర
తంపరయై ప్రజలు మదిని - తత్త్వార్థము లా
లింపుచుఁ గుతుకము నింపుచు
నింపాదిగఁ జుట్టుఁజేరి - నెనరిగురోత్తన్. 142

రేయుం బవళులు తఱి యెడ
మీయని సభలనుఁ బొనర్చి - హితవచనములన్
భూయోబోధో పరత
శ్రీ యుతముల వినుచుఁ దన్ను - సేవింపంగన్. 143

పూర్వర్షుల చరితంబుల
నర్వాచీనుల మహత్తరాశయములు నం
తర్వాణి నిబోధన లాం
ధ్రోర్వీమహర్షి దంతరమ్ముల నుద్బోధించెన్. 144

అటనట పండిత బ్రువుల
నాదర మేదుర చిత్తవృత్తిలం
పటులగుచుఁ స్వజాతిహిత
పద్ధతి నుద్ధతితో సమృద్ధ సం
కట కుటిలార్భటీచటుల
కర్కశతార్కిక వాగ్వివాద మా
రట మొనరింపఁ బొల్పడిరి
రాజ్యము వారిదె యంచహమ్మునన్. 145

తత్సమయంబునఁ బరమ శాంతాత్ముండగునప్పరమర్షి. 146

శాంతియు, దాంతి సంతసము
స్వాంతమునంబురికొల్ప నార్ష సి
ద్ధాంతము లానుపూర్వి సము
దాహృతులన్ వివరించుచున్ మన
శ్చింత యొకింత లేకెదిరి
ఛిన్నము భిన్నముసేయ నోటు పా
టెంతో వహించి కించవడి
హీనమనస్కులు పండితాధముల్. 147

గురుఁడంత యింతవాఁడని
పరిశిష్టకులుండటంచు - పరిమితవిద్యా
పరిణతుఁడని గతగుణుఁడని
పరిపరివిధ దోష దూష్య - భావావృతులై. 148

పెక్కు వితమ్ముల కొలఁదికి
మిక్కిలి నోరార మిడిసి - మిట్టాడిరి వా
రుక్కు మెయి నయ్యతీంద్రుఁడు
చిక్కులయుబ్బలిని తాను - చిక్కక పలికెన్. 149

"దైవాత్మస్వరూపులారా! రోగగ్రస్తుల కౌషధమ్ము వలె భవవ్యథా పరిపీడితుల కాత్మవిద్య యావశ్యకంబై యున్నది. అయ్యది జాతి మత వర్ణ లింగ భేదములతో పని లేక సర్వజిజ్ఞాసు జనోపయోగార్థమై వెలయు. కొందఱజ్ఞులీ యాత్మవిద్యపై తమకే యధికారము కలదు. తదితరులకు లేదని యహంకరించి తమ గుప్పిటం బట్టుకొని యొరులకు తద్గంధలేశమేని యాఘ్రాణింప వీల్గలిగింపక స్వార్థపరులై యాత్మయొక్క నిజస్వరూపం బెఱుంగమి నాత్మహంతకులగు చున్నారు. బాపురే! ఇయ్యది యెంత శోచనీయము. జ్ఞాన విశిష్టులగు మానవుల కెంతయేని లజ్జింపందగినది. ప్రాచీనార్ష సంప్రదాయమున నిట్టి విభేదములసలే లేవు. స్వార్థపరులగు కొందఱిట్టివి ప్రకల్పించుటం జేసి కాదె యీ పవిత్ర భారత దేశమిట్లధోగతి పాలై బానిసతనమున కొడిగట్టినది! ఆత్మ తత్త్వమును వర్ణించుచు నుపనిషత్తు లటనట్ల నయ్యది 'రహస్యం' 'గోప్యం' అని వివరించుట నిగూఢమై యున్న దాని నెఱుంగుట కెల్లరు నుద్యమింపవలయునని ప్రబోధించుట కేగాని నేటి సామాన్యపండితులు చెప్పునట్లు దానిని రహస్యముగా దాచియుంచవలెనను నభిప్రాయమ్మునఁ గాదు. 150

తన కాలి క్రింద వేఱొక
రణగి మణగియుండఁ గోరునతఁడెన్నడు ముం
దునకుఁ రాకయె దేశముఁ
బొనుగువడఁ జేయు ద్రోహమున కాస్పదమై. 151

కుల మత వర్ణ విభేదము
వలనని యీ భారతమ్ము పతనావస్థన్
బలిసెను పాశ్చిక మత సం
కులమున దాస్యమ్ము ప్రబలి కూలారెఁ గటా! 152

మత కర్తలు మువ్వురు స
త్కృతులయి యాత్మావబోధ మెఱిఁగించిర య్యే
గతి సంఘ విభేదమ్ముల
మతిఁ దలపరు చిత్రమిది సుమా! తలపోయన్. 153

తా నెట్టితరుల నెంచునొ
వాని నొరుల్ దలతురట్టి వసుధా స్థలిలో
నీ నియతి దైవశాసన
మౌను సుమీ! యిద్ది తప్పునా యెంతైనన్. 154

ఋషి సంతానములారా! పరుల యాత్మోన్నతి కడ్డు వోకుండుటయు, అందులకై వలయు సాహాయ్య మొసర్చుటయు, తన యాత్మోన్నతికిఁ దవిలిన యడ్డుం దొలగించుకొనుటయు సనాతనధర్మమగును.

సత్యధర్మముల నన్వేషించి యనుష్ఠించుటయు, తాను తరించి యితరులను తరింపఁజేయుటయు, ఆత్మ నిత్య సత్య శుద్ధ బుద్ధ ముక్త స్వరూపమని యెఱుంగుటయు, ద్వంద్వములను జయించుటయు, గురుసేవయే పరమవిధ్యుక్తమగు నీశ్వరసేవ యని భావించి భజించుటయు సనాతనమతమగును.

ఒక చెవితో నుపనిషత్ప్రతిపాద్య బ్రహ్మమును వినుటయు, రెండవ చెవితో దీనుల దుఃఖాలాపములను విని తన్నివృత్తికొఱకు ప్రయత్నించుటయు; ఒక దృష్టితో బ్రహ్మము ననవరతము దర్శించుటయు, రెండవ దృష్టితో ప్రాణికోట్ల హృదయ పరితాపములను గమనించుటయు యథార్థమైన తపస్సును, ఋషిమతము నగును.

దేహేంద్రియాదులచే విధి ప్రయుక్త సత్కర్మముల ననుష్ఠించుచుండియు నట్టి కర్మలకు విలక్షణుఁడై యుండుటయు నిజమైన కర్మయోగము, జ్ఞానయోగము నగును.

కులమత వర్గాది భేదములు గుణకర్మ విభాగముచే మాత్రమే యేర్పడినవను పరమసత్యము నెఱుంగుటయు, సుగుణసంపన్నులైన జిజ్ఞాసువు లెల్లరకు దైవసాక్షాత్కారమున కర్హత కలదను నిక్కము గుర్తించుటయు సనాతన సత్యమగును.

ఈ శాశ్వత సత్యమును మఱచి లేనిపోని భేదములం గల్పించుకొని సోదర మానవుల హీనదృష్టిం జూచుటచేత నే

నేఁడు హిందూమతస్థులెందఱో పరమపావనులగు ఋషులచేఁ బ్రవర్తితమ్మైన తమ సనాతనమతముం బరిత్యజించి యితర మతములలో కలసిపోవుచున్నారు. కావున నికనైన తెలివి తెచ్చుకొని భేదవాదమ్ములు మఱచి సహజానురాగ సంపత్తిం బొంది యొండొరులు నైకమత్యమ్మున ప్రాచీన ఋషి పుంగవులు జూపిన పవిత్ర మార్గమ్మున పురోగమించి మేలుఁ గనుడు. మేలుకొనుడు" అని ప్రబోధించి వెండియు ననేకవిధమ్ముల జన్మజాతి వాదమ్మును ఖండించి గుణజాతివాదము మాత్ర మంగీకార్యమ్మగునని తెలియంజెప్పి ముముక్షుజనుల కెల్లరకు నాత్మవిద్యయం దధికారము గలదని నిరూపించిన — 155

నాఁటి సభాతలమ్మున జ
నమ్ములు నిమ్ముల నమ్మునీంద్రు వా
గ్ధాటికి సూటిగా నలరి
తన్మయభావ పరీత చిత్తులై
నేటుగ సంచరించిరి వి
నీతమహోపనిషద్విచారులై
చాటిరి స్వార్థభావుల ప్ర
చారరహస్యము మాటిమాటికిన్. 156

ఇట్లు వేదాంతజ్ఞాన సభాముఖమ్మున నిర్విరామమ్ముగా నాధ్యాత్మిక విద్యాప్రచారమ్ము సాగించుచు శ్రీ మలయాళ యతీంద్రుండు రాజమహేంద్రవరమ్మున నొకసారి సనాతన

ధర్మప్రబోధమ్ము గావించు నవసరమ్మున నెవరో కొందఱు స్వార్థాశయులు స్వామిపై కల్పించి చెప్పిన నిందావచనమ్ములు నిజమ్ములని నమ్మి. 157

నిలువెత్తు పొత్తములు తల
పొలమునఁ గొలువుండు రాణి మొదలకుఁ గుదురై
వెలుఁగొందు పేరు పెంపుం
గల తెలుఁగు కయ్యాసరుండు కచ్చెకు వచ్చెన్. 158

రాణ్మహేంద్ర సనాతనార్ష సభలందు
శ్రీపదుఁడు కృష్ణమూర్తి శాస్త్రి యెదురొడ్డి
తర్కమొనరింపవచ్చి తుదకు యతీంద్రు
దివ్యభావమ్ము గుర్తించి తెలివిసెందె. 159

ఎదురొడ్డి వాదులాడఁగ
మదినెంచిన కృష్ణశాస్త్రి - మార్పొంది రసా
భ్యుదిత స్తుతి వ్రాసి సభన్
పదింబదిగ గురుని భవ్య - పదముల వ్రాలెన్. 160

జయమందిన మదిఁ బొంగడు
నయమునసె విపక్షి జన మ - నంబుల నొవ్వన్
రయమునఁ దీర్చు విపక్షి
ప్రియ సూక్తులు పలుకుఁ దత్త్వవిదుఁడు గురుఁడహో. 161

ఇట్టులూరనూర హిత మహితమ్ముల
నెదురు కోలుసేసి మదిఁ గఱంచు
నాత్మతత్త్వమెల్ల యాంధ్రోర్వరనుఁ జాటి
ప్రజలకొఱకు నెన్నొపాట్లు వడియె. 162

పాక్షికవాదుల మతభేదమ్ములు
పర్విన యాంధ్రి వివేక విరా
గక్షయమై నిజమారయఁ జాలమిఁ
గ్రాంతినిఁబాసి పరాశ్రయమై
కక్షలకొగ్గి ఋతమ్మెడఁబాయుటఁ
గాంచి దయామతి వేచుఫలా
పేక్ష వహింపక పీడితలోకము
వేగమ ప్రోచిన మౌనివరా!

ఇది శ్రీ వైద్య విద్వత్పండిత సత్కవి నారు నాగనార్య మహాశయ
విరచితమగు మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వామి
చరిత్రమునందు పంచమ ఘట్టము.





మహర్షి సద్గురు

# శ్రీమలయాళస్వామిచరిత్రము

అను

# అసంగానంద విజయము

## షష్ఠ ఘట్టము

కులమత వర్గవిభేద
చ్ఛల నిర్జిత దీనజన వి - శంకట శంకా
కుల చిత్త సంస్కరణ కృ
ల్లలితో ద్బోధస్వరూప ! - లసదుద్దీపా !

క్రమశిక్షాఽభ్యాస పరి
శ్రమ వ్యాసాశ్రమమునందె - జతపడుఁగానీ
యమరున వేఱొకచోనని
గుములు గుములు స్వామి చెంత - కుంబ్రజచేరన్. 1

తొలు దొలుత బాలురకువలె
బలితపు దిద్దుబడి నేర్పు - వ్యాసాశ్రమమే
తెలుఁగు పొలమందు తద్యశో
మలవియె పొగడంగ నా బృ - హస్పతికైనన్. 2

అట్టి మహామహుండు గురు
డంచల పంచలజేరి భక్తితోఁ
గట్టుపకాసులో బుధుల
గట్టిగ సత్క్రమశిక్షనిచ్చి వా
రిట్టులఁ జేయుకంటెఁ బ్రబలు
తింపఁగఁజాల్ పరమార్థసాధనా
హట్టములందధీశ్వరులు నై
పెను పొందఁగఁ జేయు మాయురే! 3

దగ్గఱఁ జేరువారిని య
థామతి సంస్కరణమ్మొనర్చి యీ
గగ్గులకాడు సంసృతి నె
కాయెకిఁబో విరజిమ్మి నిత్యమై
నెగ్గిన జగ్గు నిగ్గయి మ
నీషి హృదంతర సన్నికృష్టమై
వెగ్గలమై వెలుంగుఁగను
విప్పొనరించు గురూత్తముండహో. 4

కొందఱు ప్రబుద్ధులసహాన
మందీభూతులయి తత్త్వ - మార్గ విముఖులై
బందిఁబడు పశుగణమ్మటు
పొందరు సద్గురు హితాను - భూతి యదేమో. 5

అరవింద మందిరము కడఁ
బరగియు మండూకమెట్లు పరిమళముగొనన్.
సరిపడదొ తద్విధిన్ జడ
పురుషులెఱుంగరు పరార్థ - మును ప్రకృతి రతిన్. 6

వినుత వివేకులు సద్గురు
మణిసన్నిధినాత్మ తత్త్వమార్గ సుముఖులై
మనుదురుపదేశ సుధఁజే
కొనుదురు భక్తి ప్రపత్తి - గురుతరదీక్షన్. 7

—: పాఠశాలా నిర్మాణము :—

ఇతః పూర్వమే నిజపర్యవేక్షణ ప్రవిలసితమైన చతుర్భాషాప్రబోధ పాఠశాల నిర్మించి దానికై వలయు కట్టడములు పరికరమ్ములు సంపూర్ణముగా సమాయత్తపఱచి పండిత పామర - ధనిక దరిద్ర - కులమతవర్గాది విభేదము లిసుమంతయు లెక్కగొనక యేకొఱంత రానీయక ప్రతిఫలాపేక్షారహితుండై యవిరళ దీక్షాదక్షుండై గురుతర కర్మయోగిపుంగవుని సేవ కనుసెప్ప వేయుక చూచుచు నిరంతరము తదభివృద్ధికై పాటువడ నందసంఖ్యాకులగు విద్యార్థులు సుశిక్షితులై వినీతులై విద్యావేత్తలు, ఉభయ భాషా ప్రవీణులు, వేదాంతాచార్యులు, వ్యాకరణ సాహిత్యాది వివిధ వాఙ్మయ శాఖాశిరోమణులు, పట్టభద్రులునై వెలుగొందిరి. వారిలో ననేకులు వివిధ విద్యాలయములలో నాచార్యులై సంస్కృతభాషా ప్రచారకులై విలసిల్లిరి.

—: యథార్థభారతి — పత్రికా స్థాపనము :—

అట్టి పట్టున నానాప్రదేశములనుండి శ్రీ వ్యాసాశ్రమమున కరుదెంచిన శిష్యగణం బొక్కెడ దేశికుదరిఁ జేరి — "మహాత్మా! దేశమున తమ దయచే నాధ్యాత్మిక ప్రబోధము మలయమారుతముంబోలె ప్రసరించినది. కాని యందులకు ముమ్మరముగాఁ బ్రచారము సాగించుటకై నేటి కాలమున పత్రికా నిర్వహణ మెంతేని సులభమార్గంబు. లౌకిక ప్రబోధ పత్రిక లెన్నియున్నను నేతత్ప్రబోధమున కనుగుణముగా లేనందున ప్రకృతము తమ దివ్యసందేశములు నలుమూలలకు వెల్లివిరియుటకొక యాధ్యాత్మిక పత్రికా స్థాపనం బత్యవసరంబని భక్తి పూర్వకముగా విన్నవించుచుంట్టిమన ధీరోదారుండగుట దూరమాలోచించి కొంత వడికి కృతనిశ్చయుండై — 8

తత్త్వబోధలఁగూర్చి యథార్థవాణిఁ
బ్రచురణ మ్మొనర్చుట పాడి యంచు
స్వామి యందుల కీకొని ప్రచురపఱచె
పత్రిక "యథార్థభారతీ" ప్రఖ్యతోడ. 9

ప్రతిమాసము పరమార్థ
ప్రతి యనఁ దత్త్వార్థవిషయ – పరిగతమై యం
చితమై గురుసూక్త్యమృతా
న్వితమై పత్రిక వెలింగె – విధి విహితమ్మై. 10

విమల గురూపదిష్ట బహు
విశ్రుతబోధలు దివ్యగాథలున్
క్రమపరిణామసాధనల
ఖండ నిజానుభవైక తత్త్వముల్
ప్రముదిత వాగ్వి శేషము ల
పారతపో విభవమ్ము లింద్రియా
ర్థముల జయించు వార్తలు స
దా ప్రకటీకృతమాటఁ బత్రికన్. 11

పలువురు గొని చదువుటచే
తెలుఁగు పొలమ్మంత నాల్గు దెసల మసలె వె
న్నెల నాఁటి హాయిఁబలెఁ బలి
కిలకయ్యది జిలుఁగు వెలుఁగు – తన మొడఁగూర్చన్. 12

సవ్యాపసవ్యకరమ్ముల శరమ్ములు ప్రయోగించు సవ్యసాచివలె నొక వంక సనాతన వేదాంత జ్ఞాన సభా సమావేశములును, మఱొక వంక యథార్థభారతియు (అతఁయ మాఘమాస పూర్ణిమ దినమున ప్రారంభింపఁబడినది) నిరుగెడలఁ దోడు నీడయి చేదోడు వాదోడుగా జతఁగూడి శ్రీ సద్గురు స్వామి సముద్దిష్ట కార్యకలాపమ్ము లభ్యంతరమ్ము లధిక్షేపణమ్ములు లేక నెగ్గుచున్న యట్టి గట్టిపట్టున సంగర రంగమ్మున విజయాభూతుండగు సార్వభౌముని చందమ్మున సముజ్జృంభిత కార్యకలాపప్రవణుండై — 13

తెలుగు దేశమ్ము నలుగడల్ తిరిగి తిరిగి
రండు రండాత్మ విద్యఁ గైకొండటంచు
విజయభేరి బజాయించి వెల్లడించు
బ్రహ్మవిద్వరుఁడాత్మతత్త్వప్రబోధ. 14

—: బహుళాశ్రమ స్థాపనము :—

తెలుఁగు మాగాణముల నెల్ల తెలివి జిలుఁగు
వెలుఁగు వెల్లిక లెసరేగి విరివిఁ జెంద
నాశ్రమ స్థాపనం బొండె యనువటంచు
నెంచి స్థాపింపఁ బూనె యతీంద్రుడంత. 15

అటనట బోధనా పరవ
శాత్ములు కొందఱు గుంపుగట్టి మి
క్కుటమగు శ్రద్ధఁ బూని తెనుఁ
గుం బ్రజ బాగుపడంగ నచ్చట
చ్చట బహుళాశ్రమమ్ములను
స్థాపనముం బొనరింప స్వామి చెం
గట కరుదెంచి తత్ప్రథిత
కార్యకలాపము నిర్వహింపఁగన్. 16

కావలసిన సదుపాయము
లే విషయము లేని తెలిసియే చేసికొనం
గా పయిన మెఱిఁగి మెలకువ
తో వెడలిరి గురుని యాన తొరపడని మదిన్. 17

ధనికులందు బుధులఁ దత్త్వవిత్తముల డా
యంగఁ జేరి యాశ్రమావసరము
లెల్ల నచ్చఁ జెప్పి హితమిత మధురాతి
రమ్యసూక్తులాడి రమణ మీఱ. 18

పలుచోట్ల పలువితమ్ముల
ఫల్గుపేరుల నాశ్రమముల వడి నెలకొల్పఁ
దలకొని గుర్వాశ్రయమున
బలపడిరా భక్తవరులు పరమార్థమతిఁ. 19

తెలుఁగు వెలుంగు లోకమ్మొగి
తీవరపాటున నల్వలంకులఁ
వెలువడఁ జేసి 'తత్త్వమసి'
విశ్రుత సత్యసమావలోకన
మ్ముల నెలకొల్పి యాంధ్రధి నోక
భూరి తపోవన భూమిగా సము
జ్జ్వలచరితమ్ము నిల్పునటు
సాధనలం బొనరించునట్లుగఁ. 20

అవిరళ దీక్షాదక్షత
వివిధ స్థానములఁ బ్రజకు – విరివిగ బోధల్
వివరింప నాశ్రమమ్ములఁ
బ్రబలమ్ముగ నిల్పె గురుఁడు – ప్రజ్ఞాధికుఁడై. 21

కోటంబేడు, మేనకూరు, మాంబట్టు, కనుపర్తిపాడు, తాడేపల్లి, ఘంటసాలపాలెము, తెనాలి మున్నగుచోట్ల ఆధ్యాత్మిక విద్యా ప్రచార కేంద్రములగు ననేకాశ్రమములు స్థాపింపంబడియె.

కడల నాల్గింట నాది శంకరుఁడు మున్ను
పీఠములు నెలకొల్పి వి - వేక గరిమ
బోధ సేయించినటు లాంధ్ర - భూమి గురుఁడు
నలు వలంకుల నాశ్రమములను నిలిపె. 23

నలు మూలలనుండి మహో
జ్జ్వల శక్తి యొకండు రేఁగి - చలితదరదమ్ముఁ
బలెఁ జరచర పారాడెఁ
నిలువక తచ్ఛక్తి తెలుఁగు - నేలం బ్రాకెఁ. 24

ఆవేశోన్నమిత ప్రభావజనితం
బై యావదాంధ్రప్రజల్
ప్రావీణ్యం బెసరేఁగ స్వామి చరణా
బ్జాతద్వయీ సేవనా
వ్యావిద్ధ ప్రథితాత్మ సంయమన శా
ర్యా విష్టులై ద్రష్టలై
వేవేగఁ గురుసూక్తి మౌక్తికము ల
న్వేషించుచుం గాంచరే. 25

మలయాళ దేశికేంద్రుని
బలితపు టొజ్జందనమ్ము ప్రబలుట ఛాత్రుల్
వెలసిరి సకలకళాసం
కలిత ప్రతిభా విభా ప్ర - కర్షోపజ్ఞుల్. 26

స్వామి శిష్య వతంసు లెచ్చటను జూడ
నెపుడు మదిలోన గర్వమింతేని లేక
సాధు సత్ప్రవర్తులయి వికసత్ప్రసన్న
పుండరీకములటు కీర్తినిండి యుంద్రు. 27

కుదురగు నా చరణమ్మును
చదురగు వాగ్మితయు శీల - సంపదయెందుర్
బ్రిదులని మనుగడ స్వామికి
నొదవిన శిష్యులగుణమ్ము లొప్పెసలారుల్. 28

—: స న్న్యా స స్వీ కా ర ము :—

పవిత్ర భారతదేశమున సన్న్యాసము శాస్త్రవి[...]తమ్మును, ఋషిజన సమ్మతమ్మును, బహుజనామోదితమ్మును, చిరకాలానుగతమ్మును, సంప్రదాయ సిద్ధమ్మునగుటచేఁ దన చెంతకు వచ్చి సన్న్యాస స్వీకరణ యోగ్యాసూత్రణ పదులగు శిష్యులు కొందఱర్థించుటం జేసి శాస్త్రనిగదితానుక్రమమునఁ దానంతకుమున్నే విద్వత్సన్న్యాసియయ్యును, పరమహంసాసీక సమక్షమున యథావిధి పరివ్రాజకత్వ స్వీకరణమింతకు

మున్ను లేమింజేసి శిష్యప్రార్థనానుసారముగా దానికి వలయు పరికరమ్ములు సేకరించి యుత్తమతపోనిధుల సమక్షమ్మున నిరంతర నిరతిశయ తపోఽధికుండును. వారాణసీక్షేత్ర వాసియు, సన్న్యాస క్రమదీక్షా దక్షుండును, వేద విద గ్రణియు, సాధు శీలుండునగు శ్రీ శంకరానంద యతీంద్ర గురువరుని ద్వారమున విరజాహోమాదిక బహుళ కార్య క్రమముల ననుష్ఠించి శాస్త్రీయముగా 1936 వ సం॥ ఫిబ్రవరి నెల 3-వ తేదికి సరియగు యువనామ సంవత్సర మాఘ శుద్ధైకాదశీ సోమవారమున సన్న్యాసదీక్షం బరిగ్రహించి యఖండ తేజో విరాజితుండై భూమవిద్యా వరివస్యుండై పావనంబైన శ్రీ మదసంగానందుఁడనెడు నూతనాభిధానమున నొప్పె. తద నంతరము కాలక్రమమున తెలుఁగు నేల నలుమూలలనుండి వచ్చు సాధుపుంగవుల నియమ పటిష్ఠుల పెక్కండ్రను ప్రస్థానత్రయ తద్వ్యాఖ్య విదగ్రిములం గావించుచు సన్న్యాసస్వీకార యోగ్యులంజేయుచు దివ్యమంత్రోపదేష్టయై సత్యాభిరతుండై విలసిల్లె. మఱియు కనీసము శ్రీ పాతంజల యోగదర్శనము, కఠోపనిషత్తు, శ్రీ మద్భగవద్గీతయను గ్రంథ త్రయమ్మును కంఠస్థముఁ జేసికొని సర్వవ్యాపక దివ్యప్రాణ శక్తిగల నాగరలిపి నేర్చుకొని యొక సంవత్సరకాలము గురుకులవాసమొనర్చిన యోగ్యులగువారికి మాత్రమే కాషా యాంబరధారణమున కనుమతి నొసంగ దగునని నియమము గావించె. అంత సకలాంధ్రప్రపంచము సంతోష వారాశి

వీచికలందొప్పుఁదోఁగ. మంత్రోపదేశములును, బిడ్డలకు నామ
కరణమ్ములును, అక్షరాభ్యాసములును మహనీయులగు
శ్రీవారినుండి చేయించుకొనిన శుభోదర్కముగా నుండునని
పలువురు ప్రసిద్ధ కుటుంబములవారు పర్వదినములలో చేయిం
చుట పరిపాటియైన యలవాటగుటచేఁ బై కార్యక్రమము
లసంఖ్యాకములుగా నొనర్చి భక్తావళి మోదముం బొరయం
జేసెను. 29

రామబాణమ్మునకు గల ప్రౌఢిమమ్ము
విష్ణుచక్రమునకుఁగల విపులశక్తి
అల్ల మలయాళమౌని వాగమృతమందె
నిలిచి జడులఁ బ్రబోధి ని - ధుల నొనర్చె. 30

నేఁటి విశాలాంధ్రమ్మున
బోటులకు ద్విజేతరులకు - పొనుగుపడుటఁగా
చాటగు తత్త్వమ్ము నిరా
ఘాటముగాఁజాటె నేఁటి - గద గురుఁడెన్నఁగ 31

—: బ్రహ్మవిద్యా ప్రబోధము :—

తొంటి బ్రహ్మానుభూతి నిస్తుల నిజాత్మ
తత్త్వచింతన మెల్ల నస్తంగతమ్ము
నగుటజూచి మహర్షి తా మిగుల వగచి
బ్రహ్మవిద్యాభివృద్ధికై ప్రాటుపడియె. 32



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ శంకరానందస్వాములవారు

వారాణసి

తురీయాశ్రమ ప్రదాతలు.

బ్రహ్మవిద్యా పరీక్షలేర్పఱుపఁ దలఁచి
బ్రహ్మ విద్యార్థులకు నొక పాఠశాల
నొసపరింగూర్చి తత్త్వవిద్యోపలబ్ధి
కెంతయు విశిష్ట సాహాయ్యంబు సంతరించె. 33

తెలుఁగు పాలంబునం దెచట
తీరిచి దిద్దు పరార్థసాధన
మ్ముల కిరవౌ ప్రబోధములు
పూర్ణముగా వెలుగొందుచున్కి నీ
స్థలమున తత్కళా విలసి
త ప్రచుర ప్రవిబోధ సాధనల్
వెలయఁగ శ్రద్ధ నెక్కొలిపి
వేయి కనుల్ గొని చూచె ప్రేముడిన్. 34

—: గీతా ప్రచారము :—

మఱియు సర్వమత సమ్మతమై విశ్వజనీనమై మహోత్కృష్టమై సర్వసమతా ప్రయోజన మూలమై శ్రీకృష్ణ పరమాత్మ వదనారవింద వినిర్గత మకరందమై యొప్పు శ్రీమద్భగవద్గీత సర్వకాల సర్వావస్థలయందు సముచిత ప్రబోధ యోగ్యమై యున్నందున తత్ప్రచార మాత్మవిద్యా ప్రబోధమున కెంతేని సహాకారకమని తలంచి దానిని స్వీయ సమగ్ర వ్యాఖ్యాసమన్వితముగా ప్రచురించి నిరంతర మొక తెఱపి లేని ప్రచార మొనరించెను. 35

ఒక నిముసమేని వృథసే
యక తిని కూర్చుంట పాప - మని రేపవలున్
సుకమాసింపక గీతా
ప్రకటన తద్భావబోధ - పరుఁడై మెలగెన్. 36

గీతాప్రచార కార్యా
స్వీతుండయి యాంధ్రభూమి - వివిధ మతములన్
బ్రీతిఁ బ్రతిష్ఠించియును ని
రాతంక మహోద్యమాభి - రాముండయ్యెన్. 37

జనులాధ్యాత్మిక తత్త్వతత్పరులుగా
సర్వాంధ్ర దేశమ్మునం
దున నెక్కొల్పఁదలంచి యాశ్రమము లెం
దుం జూచినన్ స్వామివే
యన భూయిష్ఠ వరిష్ఠ నైష్ఠికుల శిష్య
శ్రేణిఁ బంపించి బో
ధనలన్ గూర్చు నసంగ సంవిదుఁడు గీ
తాతత్త్వబోధాప్తికై. 38

గీత పఠియింపఁదగదు స్త్రీజాతి కంచు
మించి వాదించి సభల గర్హించు వంచ
కులు మతాధిపులకు బుద్ధి కలుగునట్లు
లెల్ల స్త్రీలకు గీత బోధించు గురుఁడు. 39

ఊరూర వాడ వాడల
నారీమణులెల్ల రర్థు - న విషాదముతోఁ
బ్రారంభింతురు గీతా
వార మపారాంతరంగ - భక్తి శ్రద్ధన్. 40

పిల్లలు యువకులు ముదుసలు
లెల్ల పరాభక్తియుక్త హృదయమ్ములతో
పెల్లుగ నేర్చిరి గురుకృప
వెల్లి విరియ గీతఁ గలుగు వేద్యాంశమ్ముల్. 41

మహిళామండలి గీతా
మహిత సవిత్రిని భజించె - మధురాశయ ని
ర్వాహణాసక్తిని గురుకృప
వహియించిన నేమి పట్టు - వడదు ధరిత్రిన్. 42

—: స్త్రీ జనోద్ధరణము :—

స్త్రీ జన విద్యాసమృద్ధికై తత్ప్రతి
బంధమ్ములకుఁ బరిపంథి యగుట
స్త్రీ జన భావ్యభివృద్ధికై మహిళా మ
హోద్యమమ్ముల సముద్యుక్తుఁడగుట
స్త్రీ జన తత్త్వవిభ్రాజిత జీవిత
భాగధేయముఁ గూర్పఁ బ్రతినఁ గొనుట
స్త్రీ జనులబలలన్ జిన్నచూపునఁ జూచు
జగము మార్పాటందఁ వగపు గనుట

స్త్రీ జనమ్ము పరమ్ము సాధించి మించ
వలయు సదుపాయములు గూర్ప గలుగుటనెడు
మహితకార్యంబు లొనరించి మానివరుఁడు
స్త్రీ జనమ్ముల పాలిటి దేవుఁడయ్యె. 43

నలుగురిలో నిలంబడి ఘ
నంబుగ గీతఁ బఠింప నాత్మలోఁ
గల తలఁపుల్ స్ఫుటమ్ముగఁ బ్ర
కాశితముం బొనరింప ధైర్యముల్
గలుగని బేలలన్ గుఱిచి
కంట తడింగొను నెంత జాలియో
వెలయుట; స్వామి చిత్తమది
వెన్నకెటుల్ సరిపోల్పనౌనొకో. 44

తన యభిమతమునుఁ జాటఁగ
తన స్వత్వము బ్రకటపఱుప తగ వేదికలన్
గను నారీలోకముఁ గని
మనమునఁ జింతించువారి - మనుపఁదలంచెన్. 45

స్త్రీల సముద్ధరింపఁగ వి
శిష్ట విధానుగమప్రవర్తియై
మేలి సభాప్రచారములు
మేటికృతుల్ రచియింపఁజూనుటల్

చాలిన వాఙ్ముఖమ్ముల నొ
సంగుటలుఁ మఱి ప్రతికాదులం
దోలి ప్రబోధ సల్పుటలు
నొయ్యన సద్గురునైజకృత్యముల్. 46

ఆ యతిపతి వెలిఁగించిన
దే యీ దివ్వెయని యింట - నింట సతుల్ జే
జేయని మ్రొక్కెదురు బళి
రా! యనఁ దమ పాలిదేవుఁ - డా స్వామి కదా! 47

వెలిగించిన దీపంబిక
మలగదు పో నిశ్చయమ్ము మహిళలకిది తా
వెలుఁగు నొడఁగూర్చె నంతయు
మలయాళస్వామి కరుణమై కోలుసుమీ! 48

స్త్రీలల్లో నాదరమ్ము విశిష్టమైన
నీతి నియతి యనుష్ఠాన నిష్ఠ బ్రహ్మ
చర్యశీలనమును శిష్టకార్యపరత
స్వామి యతిశయ దయచేత సంభవించె. 49

కన్నతండ్రి బదుల్ గురుఁడన్నయట్లు
శిష్యురాండ్రెద నెంత్రు తచ్ఛిష్య సమితి
నెపుడొ కనిపెంచి విద్యజెప్పించు నట్లు
గురుఁడుఁ దలపోయు నిది స్వతఃస్ఫురణశక్తి. 50

"వీరె కనఁబడు దేవతల్ వీరె మాతృ
మూర్తు లివ్వారె పావన భువన సృజన
మూలహేతువు లివ్వారిఁ - దూల నాడ
పుణ్యగతి చెడు నరకము పొందువగును". 51

అని కనుఁగవ వెలిదమ్ముల
దొన దొనయై యశ్రుజలము దొతెంచఁగ నె
మ్మనమునఁ దనిసని సంతస
మునఁ బలుకుక్ స్వామి స్త్రీల - భూనుత గుణముల్. 52

—: సా ధు మా త :—

స్త్రీలసాధుమతమ్ము ని - ర్మించినట్టి
సాధుమాత పొరింబొరి - స్వామి సన్ని
ధానమున కేగి ప్రణతి శ - తమ్ముఁగూర్చి
తదుపదేశ విశేష మెం - తయు గడించు. 53

గో గర్భమున తప మొనర్చునప్పుడే సాధుమాత శ్రీ స్వాములవారిని దర్శించి తదీయ మహానుభావతం గుర్తించి యుండెే. అదిమొదలప్పుడప్పుడా పుణ్యచరిత్ర భక్తి శ్రద్ధలతో శ్రీవారిసన్నిధికరుదెంచుచుండెడిది. స్వామియు నుత్తమతపస్వినియగునన్నారీమణియెడ నవల్పాదరమ్ముఁ బ్రదర్శించుచుండెే. 54

ప్రతి సంవత్సరమందు నుత్సవముల్ బ్ర
 బ్రత్యగ్రజాగ్రత్ప్రథా
మతినే తెంచి సమస్తకార్యములు ని
 ర్మాణైక దీక్షాసమం
చితభక్తిన్ నెఱవేర్చి స్వామికెలమిన్
 సే కూర్చియానంద సం
గతిఁ బొల్పారిన సాధుమాతయన వి
 జ్ఞాన స్వరూపమ్మె కా! 55

చిన్నతనమ్ము నుండియు వి
 వేక విరాగ విశేషసంపదల్
గ్రొన్నన తావులై దెసల
 గొల్లానరింప మెలంగ శిష్య సం
పన్నత వృద్ధిసేసి విభవం
 బెసలారె పరార్థతత్త్వ సం
ఛన్న మనోజ్ఞపూర్ణ విల
 సన్నవరూపిణి సాధుమాతయే. 56

—: కన్యాగురుకుల ప్రతిష్ఠ :—

మఱియు నమ్మలయాళ యతీంద్రుండు మహిళా సమాజసముద్ధరణ మాత్మీయ విశిష్టలక్ష్యంబులలో ప్రధానంబు కావున తత్సాధన సంపత్తికై యుపక్రమించి స్త్రీలకు సంస్కృత భాషాజ్ఞాన మావశ్యకమ్మని తలంచి కన్యాగురుకుల

ప్రతిష్ఠఁగావింపనెంచి యందులకై శ్రీసాధుమాతగారిని రావించి తన్మాలమ్మున నొక పవిత్ర లగ్నమ్మున * సర్వ జనామోదమ్ముగా తద్గురుకులమున్నెలకొల్పి ప్రాచీనార్ష సంప్రదాయ విశిష్టముగా నడుపుచుండిన యవసరమ్మున నందు — 57

నేలయీనినట్లు నింగిపై చుక్కలు
నేలవ్రాలినట్లు నిజమనీష
రూపుఁదాల్చినట్టు లేపునఁజేరిరి
కన్యకా జనమ్మనన్యమతిని. 58

పత్రికయు పాఠశాలయు బహుళకావ్య
రచనములు గురుకులములోఁ గొంత ప్రొద్దు
సాగుచుండెను శుక్ల పక్షమ్మునాఁటి
సోమలతికా సమృద్ధిమై గోము మీఱ. 59

మఱియు నప్పరమర్షి. 60

వచ్చుచుఁ బోవుచుండు నిజ
భక్తులకుః బహుళోపదేశముల్
మచ్చిక మీఱనిచ్చుఁ బర
మమ్ము నెఱుంగఁ దలంచువారలై

* దుర్ముఖినామ వత్సర - కార్తీక - బహుళ విదియ (1-12-1956)

హెచ్చుసభల్ పౌనర్వ మది
    నెంచుజనావళి కోర్కి దీర్చుచు బై
పెచ్చుప్రజోపయోగమగు
    పెక్కు కృతుల్ రచియించు నోపికన్. 61

పలుమాటల్ పని యేల? ధీగరిమ సం
    భావించు సత్కార్యముల్
విలసత్తత్వ నిబోధముల్ సుకృతులున్
    విద్యా వివేకార్జనల్
పలు యోగాశ్రమముల్ పరివ్రజనముల్
    బ్రహ్మానుభూతుల్ మహా
జ్వలరీతిన్ నెలకొంటకా ప్రభుని ప్ర
    జ్ఞానమ్మొ మూలమ్మగున్. 62

—: గ్రంథ విరచనము :—

ప్రతి వత్సర కార్తికమున
వ్రతమటు విడువకయ నూత్నరచన మొనర్చున్
జతనము గొని కావించె మ
హిత చరితుఁడనేకకృతుల - నెంతయు దీక్షన్. 63

మున్ను గోకర్ణక్షేత్రముననే శుష్క వేదాంత తమో భాస్కర నామక గ్రంథ రాజమ్మును రచించియుండెఁ. తదనంత రంబును బహుళజనోపయుక్త సదుపదేశ మహిమ్ములగు

స్వబోధ సుధాకరము, బాలయోగిని, లోకోద్ధారకము, ఉప దేశామృతము, ధర్మసేతువు, ఈశ్వరకృప, నిర్వాణనిలయము మున్నగు విఖ్యాతగ్రంథములెన్నేని స్వయముగ రచించియు, పండిత ప్రకాండులచే యోగవాసిష్ఠ - పాతంజల యోగ సూత్ర - వివేకచూడామణ్యాద్యుద్గ్రంథముల ననువదింపం జేసియు ప్రకటింపంగోరి నిరుపహతముగా తన గ్రంథ ప్రచు రణోద్యమము సాగి ప్రచారము నొందుటకై యొక ముద్ర ణాలయ మవసరమని తలంచె. మఱియు 64

## —: ముద్రణాలయ స్థాపనము :—

పత్రికా నిర్వహణమునఁ బ్రతిదినమ్ము
నచ్చుగ్రుచ్చుటలో హెచ్చులొచ్చులొదవ
మిగుల గమనించి యపవాదమగునటంచు
నెంతయును చిత్తమందున నెంచె గురుఁడు. 65

తానొనరించిన యే పని
యైనఁ బ్రజోపకృతి సేయునని యెంచి పురా
జ్ఞానానుభూతి పరతఁ
బ్రీణిత మతి సాధు గతిని బ్రెస్సును నిల్పెన్. 66

ముద్రాక్షరశాలా నిరు
పద్రవ నిర్వహణమునకు పరికర సమితిన్
భద్రముగఁ గూర్చి సకలజ
నద్రవిణోపాధి కారణమ్ముగఁ జేసెన్. 67

అదియ చిత్తూరున శ్రీ వేదవ్యాస ముద్రణాలయము
పేరంబరగు. 68

తలచినవి పుస్తకాకృతి
వెలసిన వచ్చోట సకలవిధ సదుపాయ
మ్ములు ముద్రణావసరములు
బలితమ్మై తనివి సని సెబాసనఁ బొలిచెన్. 69

—: సంస్కృత భాషా ప్రచారము :—

సంస్కృతంబటన్న చాలెనలేని ప్రే
మానురాగరసము మానితమయి
దరుల నొరసి పారుఁ దనివోక నలవోక
స్వామి చిత్తవృత్తి సహజరీతి. 70

జగమునందెల్ల భాసల మిగులు సుమ్ము
సంస్కృతము దాని పేరులో సకలమలరు
మాననీయ మనోజ్ఞ విజ్ఞానదాయి
సర్వతో భద్రమని పల్కు స్వామి సభల. 71

అనువదింపంగ జేసె తా నమరభాష
నలరు గ్రంథమ్ము లెన్నియో తెలుఁగునందు
చెంతఁ జేరిన బాలకశ్రేణి నెల్ల
పండితులఁ జేసె నా దేవ భాషయందు. 72

సాహిత్య మహిత సేవా
సాహిత్య విలాసలాలస - మనీషులందా
స్నేహానురాగ పూర్వక
సాహాయ్య మొనర్చి గురుఁడు - సంరక్షించెన్. 73

—: ఆ శ్ర మ వా తా వ ర ణ ము :—

ఇట్లు నానావిధాధ్యాత్మిక ప్రచారములకుఁ కేంద్రమై
యశస్సాంద్రమై వెలయు శ్రీ వ్యాసాశ్రమంబున — 74

ఆశ్రమ నిర్వహణాదిక కర్మక
లాప మంతయును సౌలభ్యపఱచి
పాఠశాలాదిక భార ధూర్వహావృత్తి
బాగుగా నెఱవేర్చు లాగుఁజూచి
పత్రికాపుత్రికా పరిరక్షణోద్యోగ
సాగరమీఁదఁ గాల్సఱచి నిలిచి
అతిథి ప్రజాభోజనావశ్యకోన్నత
సదుపాయముల నెల్ల చక్కఁజేసి

రాకపోకల భక్త వారమ్మునకును
వినుత వేదాంత సందేశమున ముదంబుఁ
గలుగఁజేయుచు నానిత్యకర్మయోగి
సంగరాహిత్య పదవి నాసంగె నౌర! 75

వచ్చు సాహ్వానముల కంది యిచ్చునట్టి
స్వాగతములకు లెక్కడ సాధ్యమగునె
కాని వానను ముఖ్యమ్ములైనవాని
కాదనక ప్రీతి సద్గురుండాదరించు. 76

పరమశివుని భక్తి పరవశత భజించి
మనసు నప్పగించి తనివిసెంది
నిత్యనిర్మలైక నిర్వృతినందు న
ప్పరమయోగిఁగూర్చి పలుకవశమె? 77

ఒకవంకఁ బరమేశ్వరోపాసనాక్రమ
మొక ప్రక్క నిత్య పూజోపగమము
నొకపొంత గురుయజ్ఞ హోమధూమాదిక
మొకచెంత వేదనాదోపగీత
మొక యెడ బాలబాలికల విద్యాగోష్ఠి
యొకతేవ ప్రణవశబ్దోద్గమమ్ము
నొక చక్కి రాట్నంపు టోంకృతిధ్యానమ్ము
నొక ప్రక్క భక్తుల యుగ్రనిష్ఠ

యొక్కెడ పరార్థ సాధన యోగముద్ర
లొక్కయోరను సారవిద్యోపలబ్ధి
అన్నియునుఁ జేరి యాశ్రమమయ్యెనొక్క
యనఁగ వ్యాసాశ్రమంబు పొల్పారెనౌర! 78

అతిథు లభ్యాగతులునయి యాశ్రమమ్ముఁ
జేరువారికి భోజన సిద్ధికొఱకు
రసవతిన్నెలకొల్పె నప్పసము మఘువు
పాకశాలకు నిది సరివచ్చు ననఁగ. 79

పఠన పాఠనయోగ్యమై వఱలు సరళ
కావ్య పీయూషపాన సంగ్రహులకెల్ల
నచట నిర్మించె స్వామి గ్రంథాలయమ్ము
వివిధ విజ్ఞాన నిలయమ్ము విశ్రుతమ్ము. 80

కమ్మని జలమును మృదుమధు
రమ్మగు భోజనము నవస - రమ్మగు పరత
త్త్వమ్మిచ్చు గురుఁడు గల భా
గ్యమ్మచ్చట తప్ప పొందఁ - గలమే యెందున్. 81

కోరిన వారల కోర్కెలఁ
దీరుచు సురధేనువట్లు తృప్తినొసఁగు నా
త్మారామంబగు నాశ్రమ
మారా! యని వేడ్కపడుదు రఖిల జనమ్ముల్. 82

ఆంధ్రులకు నెల్ల ధ్రువతారయై యుపాస్య
దైవమై శ్వాసకోశమ్మునై వెలుంగు
బళిర! వ్యాసాశ్రమమ్ము తత్స్వామితోడ
సదృశముపమింప నెందఱీజగతిఁ గలరు ? 83

వసుధైక కుటుంబాశయ
విస్మృమర సుగుణోపరత వి - వేకానందుం
డసదృశుఁడంతర్ముఖుఁ డ
వ్యసనుఁడసంగుండఖండ - భావుండగుటన్. 84

పరమర్షి భావఫలములు
పరిణత మాధుర్య ఫణితిఁబరిథవిలెన్ సుం
దర బంధుర నిజసేవా
పరిచిత భాగ్యమున గురుతపమ్ములు పండెన్. 85

తెలుఁగంచలు పంచలె గా
దలముకొనెన్ వేదవిద్య - హరిదంతములన్
నెలకొని వెన్నెల గాసెన్
బలితపుటజ్ఞానతమము ప్రతిహతమయ్యెన్. 86

ఎచ్చటఁజూచిన నుపనిష
దుచ్చారణ మొకటి తప్ప - నొండేదియు లే
కచ్చొత్తినట్లు తత్త్వము
విచ్చలవిడిఁజెప్పుకొనిరి - వెరవార నరుల్. 87

మలయ పవనుండు వేదాం
తుల గోష్ఠిన్ మరగి యింటి - త్రోవయె మఱచెన్
బళి! యాశ్రమాంతరమ్ముల
నలమెన్ వేదాంతగంధ - మ ప్రతిహతమై. 88

ఆశ్రమద్వారబద్ధ ధ్వజాగ్రసీమ
కొసరి కొసరి కుహూ కుహూ కూజితముల
హెచ్చరించెను కోయిల యెమ్మెలాడి
రండు రండు పరమ్ముఁ గైకొండటంచు. 89

ఆశ్రమ ద్వారసీమ విహారి భూరి
భైరవులుగూడ విశ్వాసపరులఁ దప్ప
లోనికిం జేరనీయ వాజ్ఞా నిబద్ధ
పశులవలె గురు కార్య తత్పరతఁ జేసి. 90

నానాటికి హెచ్చిన వి
జ్ఞానము సకలాంధ్ర మలమి సభ్యజనుల్ పె
ల్లై నిరతిశయానందము
తో నిత్యలజీవితమ్ముఁ దులదూఁచి రొగిన్. 91

అఖిలజీవహృదార్తి దివ్యౌషధమ్ము
దురిత తాపోపహతులకుఁ దుహిన జలము
ప్రథిత జిజ్ఞాసువులకు దివ్యప్రబోధ
మహిత జని శ్రమమ్ము వ్యాసాశ్రమమ్ము. 92

జన్మశత కోటి వార్ధి నిస్తరణ తరణి
కలుష నిబిడాంధ కార రాకా శశాంక
మంధ విశ్వాస నిశకుఁ సూర్యోదయమును
శిష్టనుత భవ్య శ్రమమ్ము వ్యాసాశ్రమమ్ము. 93

ముక్తికాంతానుషంగ సమ్మోహమంత్ర
మమలచరిత నిబద్ధ దివ్యప్రబంధ
మురుతరానంద జలధి చంద్రోదయమ్ము
నపగతార్తిభరమ్ము వ్యాసాశ్రమమ్ము. 94

మధుర భక్తి ప్రబోధ సంపద్విపంచి
యాచరణ యోగ్య విమల బోధామృతమ్ము
నతుల సర్వోదయాభిమతానుషంగ
మపగతాఘశ్రమమ్ము వ్యాసాశ్రమమ్ము. 95

శాంతి శివ సుందరమ్ము లెసంగు తావు
నిరతిశయ భక్తి భావ నిర్భరపు తావు
అతుల దేశ హితైక కార్యముల ప్రోవు
సాధు జన కలితమ్ము వ్యాసాశ్రమమ్ము. 96

అట్లనల్ప వైభవముల కిరవై యొప్పు నాశ్రమమున
కధిపతియైన యయ్యోగీశ్వరుండు — 97

సకల సుఖప్రద పరికర
నికరము జత పడియు గుణవినీతుండయి జీ
వికకెచ్చుం గోరక తే
లిక మనుగడ నడపు సంగలేశరహితుఁడై. 98

కట్టడమ్ములు భర్మ్యముల్ గలవవెన్నొ
యవ్వి శిష్యులకే భోగ్యమగును గాని
తాను మాత్రము పూరింటఁ దగవసించు
ప్రాక్తనర్షుల యాచారపరత విడక. 99

పండ మంచ మెఱుంగడు పరుపెఱుఁగడు
దిండెఱుంగడు నేల నిద్రించు గాని
చెప్పఁగా నేల కాలికి చెప్పు లేని
దొడిగి యెఱుఁగని నిష్ఠావ్రతుండతండు. 100

సకల సంపదలుండియు జనక విభుఁడు
తొలు కోలింత యెఱుఁగక తనరినట్లు
నాగరక యుగమందు జన్మమ్ముఁ గొనియుఁ
దగులు పాటింత యెఱుఁగఁడా జగమగండు. 101

ఆశ్రితుల మేలు గిల్లు తా నరయుఁగాని
యాశ్రమ పురోభివృద్ధి తా నరయుఁగాని
యాత్మ సంయమనమ్ము తా నరయుఁగాని
తన సుఖమ్మును లవలేశమునుఁ దలఁపడు. 102

ఆత్మరాజ్యోపలబ్ధిఁ దానరయుఁగాని
యమర భాషాభివృద్ధిఁ దా నరయుఁగాని
యాశ్రిత జనాఘ ముడుపఁ దా నరయుఁగాని
తన సుఖమ్మును సుతరాముఁ దలఁపడింత. 103

అర్థిజన వాంఛఁ దీర్పఁ డా నరయుఁగాని
అరిజన సుఖమ్మునైనఁ డా నరయుఁగాని
అంతరరివర్గ విజయమ్ము నరయుఁగాని
తన సుఖమ్మునుఁ గాసంత తలఁపఁబోడు. 104

నిరతము పరోపకృతికై
దురితమ్ముల నెదిరికొనఁగఁ దోడ్పడు; తా దు
ర్భరతర కష్టము లెన్నియొ
పరువడి సహియించియైనఁ బటుతర దీక్షన్. 105

ఆడంబర మింతేనియు
జూడని జీవితము గడపుచున్ లోకు లెదన్
జూడని చూపును తనలో
జూడం దలపోసి చూచు – శుద్ధాత్ముండై. 106

ప్రణవ జప ధ్యానమ్మును
మననమ్ము నిజాత్మతత్త్వ మార్గగమనమున్
ఘన పరమార్థము నిచ్చును
తనుఁ జేరినవారికెల్లఁ దద్దయు శ్రద్ధన్. 107

ఆర్షమత ముద్ధరించిన – యనఘుఁడతఁడు
ధర్మమత ముద్ధరించిన – ధన్యుఁడతఁడు
సాధుమత ముద్ధరించిన – సౌమ్యుఁడతఁడు
అమల గుణభూమి (శ్రీ) మల – యాళ సామి. 108

—: సత్పురుష సమాగమము :—

స్వాతంత్ర్య సమరదీక్షాకంకణముఁ దాల్చి
పర్వెడువేళ నాంధ్రోర్విలోని
బందరు భోగరాట్పట్టాభిరాము గే
హమునందు గాంధీమహాత్మునకును
అధ్యాత్మవిద్యా విహారి శ్రీ మలయాళ
యతికి సమాగమమ్మతులరీతిఁ
గలిగె తత్త్వానందు కతమునను; స్వారాజ్య
మునుగూర్చి స్వారాజ్యమును గుఱించి

మహితచారిత్రు లిద్దఱు మంజులముగ
కలసి మెలసి మదిఁ గల తలపులొలసి
వెలుఁగు విరజిమ్ము సంభాషణల వెలార్చి
రైక్యభావప్రదీప్త దివ్యానుభూతి. 109

నిరతము పరతత్త్వాలో
కరతమహాభాగవతుఁడు జ్ఞానాకృతి ని
ర్భరతత నైష్ఠిక తత్పరుఁ
డురుతర హార్దాబ్ధిఁదోగుచుండెడి యతియున్. 110

మడుగులో స్వామి యనునట్టి మాన్యచరితుఁ
డడపదడప శ్రీ స్వామికి నండదండ
నవ్వేళాలు బొనర్చు ప్రజ్ఞానభూమి
మీఱి పరమార్థ సంచారహారి కాఁడె. 111



బందరులో శ్రీ భోగరాజు, పట్టాభిసీతారామయ్యాగారి గృహమున
గాంధీ గురుదేవులు సమావేశమైన దృశ్యము.

బుంగవంటి బొజ్జ పొడవగు నెమ్మేను
బట్టతల ప్రశాంతి యుట్టిపడెడి
మోముదమ్మి హాస్యమున కాటపట్టగు
మడుగుసామిఁదలఁప నెడఁద పొంగు. 112

అవధూత లెందఱెందఱొ
ప్రవిమల భక్త్యంతరంగ పరమాదృతిపై
నవనవ కుతుకోన్నత మా
ర్దవ సౌహార్దములఁ జేర రాప్రేమ మెయిన్. 113

[illegible]
పరమతపస్విని త్యాగిని [illegible]
పరమార్థ రహస్య వినుత భావోన్మనియై
కురుమద్దాలమ్మయు సం
బరపడి దర్శించు మాటి మాటికి స్వామిన్. 114

రేపల్లె నివాసినులై
యాపోజ్యోతి స్వరూప మాత్మానుభవం
బై పాలించిన యవధూతలు
శ్రీపతి పదసేవనా విశిష్టచరిత్రల్. 115

చిన్నమ పెద్దమయను పే
రన్నగడి వివేకమును విరాగమ్మును లో
గొన్న తపస్వినులును గురు
సన్నిధికరుదెంచి సుజన సన్నుతిఁగొనరే. 116

మండలేశ్వరుండు మాహేశ్వరాభిఖ్యఁ
దనరువాఁడు శిష్యతతి యుతుఁడయి
వచ్చి స్వామిఁజూచి హెచ్చిన తృప్తిఁ ద
త్సాధు మతము నెంతొ సన్నుతించె. 117

వారు వీరననేల యెవ్వారలాత్మ
తత్త్వజిజ్ఞాసకయి జీవితమువ్యయింతు
రట్టి వారెల్ల గురువరునండఁ జేరి
యతులితానందకందళితాత్ములైరి. 118

అనవరతము స్వామిని దర్శింపఁగోరియు, తదీయోప
దేశ సుధంజవిగొన నుద్దేశించియు వచ్చుచుండు ప్రజానీక
మ్ములతో నాశ్రమమ్ము కళకళ లాడుచుండెను. ఆశ్రితభక్త
జనమ్మునకు తత్తదవసరోచితముగ గురువరుండిట్లు నానా విష
యమ్ములంగూర్చి యుపదేశించుచుండు. 119

—: ఉ ప దే శ వా క్య ము లు :—

పొదుపు తనమ్మునుఁ గోరిక
లెదఁ గోరకయుంట యుపవ - సించుట మఱియుఁ
వదలని ప్రేముడి యుడుకువ
మదిఁ బొదలుట లీసులేమి - మహితగుణమ్ముల్. 120

ఎందును నిర్లిప్తత గల
డెందం బాత్మోపరతి గ - డింది వహించుఁ
సందియ మిందును లేదు ప
సందగు మానవుల కివ్వి - సహజగుణమ్ముల్. 121

నిత్యానుష్ఠానక్రియ
లత్యంత శ్రద్ధఁబూని - యహరహమును సం
స్తుత్యగతి సేసినంతటఁ
బ్రత్యక్షంబగు నిజాత్మ - పరమార్థమ్ముల్. 122

పరమపితకయి సర్వమ - ర్పన మొనర్చి
టదియ బత్తియనందగు - నెదఁగుదించి
కోరికలు లేక తా మిన్న - కుండుటదియె
వెదకుట యనంగఁ దగునని - విదితమె గద 123

ఎన్ని దినములు బ్రతికి సా - ధింప నేమి
ఎంత లేసి సుఖమ్ము ల - ర్థింప నేమి
ఎంత యో రాజ్యమేని జ - యింప నేమి
యవ్వి తుది వీడి మృతినొందు - టరయ నిజము. 124

కాటికిఁ గాల్సాచిన నరుఁ
డాఁటది కనబడిన నిక్క - యటునిటుగను తాఁ
జేటొత్తు మదినిఁ బరముని
మాటెప్డు తలంచుటేఁక సు - మాళపు టెడఁదన్. 125

కామమ్మును ప్రేమమ్మని
ప్రేమమ్మును కామమనుచు - భేద మెఱుఁగకే
నేమించు ప్రబుద్ధుల నెపు
డే మాత్రము నమ్మఁదగద - హితకరులగుటన్. 126

పనిలేక యూరకుండెడు
మనుజుఁడు మనుజుండె యనుచు - మఱికొందఱు వ
క్కణముం గూర్తురు మనసున
పనిలేనితనమ్మదెంత - పావిత్ర్యమ్మో. 127

హెచ్చు తక్కువ లీశ్వర - సృష్టియందు
లేవు స్వార్థాశయుల తుచ్ఛ - లేశ బుద్ధి
వలన గలిగి 'తుఫాన' దె - ట్లలజడిని ఘ
టించునటు భేదదృష్టి గ - ల్పించె నరుల. 128

కొందఱు జాతిగూర్చి మఱి
కొందఱు వంశముగూర్చి యింకనుం
గొందఱు మున్నతాదికము
గూరిచి ప్రశ్నలొనర్తు జ్ఞానమిం
పొందమి జాతి వంశములఁ
బొందునే? మేలు పరమ్ము జెందునే?
ఛాందసులీ తెలుంగు విడఁ
జాలమి దేశము గాసి జెందెడున్. 129

గుణకర్మ విభాగమ్మున
గొఱకొని బోధించు గీత - కు నపార్థమ్ముఁ జే
సిన జాతి శతభవమ్ముల
తున్తెన యొకొంది కీడుఁ - గోల్పడఁ గలదే? 130

ప్రతి విషయము సంశయ సం
గతమగుట క్షణక్షణమ్ము – గతియింప వ్యవ
స్థితి గననేరని శంకిత
మతులకు జీవితమసహ్య – మలినావృతమౌ. 131

డెందము నందున సందియ
మందినమం దేహములిందు – నందునఁ గుందున్
జెందుట నైజము కావున
సందేహము మాని చనుడు – సత్యపథమునన్. 132

తెవులొదవెనేని మందెటు
లవసరమో జన్మరోగ – హరణార్థము శ్రీ
ధవు నెఱుఁగు తెఱఁగు మఱిగుట
యవసరమగునన్ని జనుల – కందఱకు నిలన్. 133

పుట్టి నట్టి ప్రాణి గిట్టక తప్పదు
కాన ముందు ముందె జ్ఞానమూని
పుట్టు వొందనట్టి చట్టముఁ గనిపెట్టు
పట్టుఁబట్టుటెంత గట్టితనము? 134

తక్కిన మాతృభాషలు ప్ర
ధానముగా గమనించి నేర్చుచున్
దక్కక సౌరభాష సము
దగ్రవిధానత నభ్యసించుచోఁ

బెక్కు విశేషముల్ దెలియు
వేదరహస్యము లాకళింప వీల్
జిక్కు ననంత లాభములు
సేకురుజోక మెయిన్ బుధాళికిన్. 135

ఉపనిషద స్తర్వాణీ
కృపచేఁ దత్త్వోపలబ్ధి - పృథులమ్మయి జ
న్మపరీతవాసనలు విడి
యపునర్భవసిద్ధి గలుగు - నని మఱువకుడీ! 136

తన మతమే హెచ్చని త
క్కిన మతములు లొచ్చటంచు - కృత్రిమ మతమ
త్త నియంతృపదాధిష్ఠితు
లనుదినము వచింత్రు నమ్మ - నగునే వారిన్, 137

అఖిల మత సమన్వయాభిమతమత మ్మొ
శ్రేష్ఠమదియ విశ్వసింపఁదగును
హితముఁ గడకు నెట్టి వెతలను ఘటియించు
మతము మందమతుల మతము సుమ్ము. 138

మతి యుండిన మతముండును
మతి యుండనియెడల లేదు మతమెందేనిన్
మతి యుతుల మతమె మతమగు
మతి రహితుల మతము విమతమతమగుఁ గాదే. 139

సకల మతాది మూలమగు
    సత్త్వైకమే యని భిన్నదృష్టి యిం
చుకయును లేక దైవముఁ గ
    నుంగొన సాధన మాత్రమే జగత్
ప్రకటిత నైకరూపమత
    భావములంచు సమత్వదృష్టితో
సుకృతి తలంచుచుండు మతి
    శూన్యులకిద్ది యగోచరంబగుఁ. 140

మతము మతమ్మటంచుఁ బలు
    మారు సభల్ ప్రతిరావమీన నీ
క్షితి వెతఁగూర్పఁ బల్కెదరి
    సీ! మతమెక్కడినుండి వచ్చె నే
మతికది యేమి మేల్పఱచె
    మానవసృష్టికి పూర్వమద్ది యే
గతిఁ బొలుపారెఁ దన్మధుర
    గాథ లెఱుంగక ప్రేలఁ జెల్లునే? 141

మతమని పేరుఁ బెట్టుకొని
    మారణహోమము లెన్నొ చేసి దు
ర్మతులకి దురంత దుష్కృతికి
    ...రి కర్తవచో గతికిఁ దురుద్యమో

న్నతికిని సాధు నిష్కృతికి
నైకకళావినికృంతనాది దు
ర్గతికిని హేతుభూతులగు
కష్టచరిత్రుల నేమనందగున్? 142

రణరంగమ్ములు రక్తపాతములు సా
మ్రాజ్యార్జనౌద్ధత్యముల్
రణదుద్యత్ప్రతికూల ఘోషములు వ్య
ర్థస్పర్థలున్ స్వార్థసం
జనితాహమ్మతి పూర్ణభాషలును స్వే
చ్ఛాపూర్వకోద్వేగముల్
గణనాతీత విషాదవేదన లహా!
కర్గెన్ మతావేశతన్. 143

రాజ్యము లెన్నొ పూజ్యమయి
రాణఁదొలంగె ననేకసంస్థలున్
ద్యాజ్యములాయె దైవ నిల
యమ్ములు వమ్మయిపోయె నగ్నియం
దాజ్యము వోలె; నీ భువన
మంతట భిన్నమత ప్రసక్తిచే
వ్యాజ్యములాయె నింకయిన
నాత్మల శాంతి వహింపఁ జెల్లదే! 144

నా మతమే సనాతనము
నా మతమే బహుధాశరణ్యమున్
నా మతమే మహోన్నతము
నా మతమే పరిశుద్ధ బుద్ధమున్
నా మతమే సమగ్ర మింక
నా మతమే పరిపూర్ణమంచు నీ
యామతనైష్ఠికుల్ తగవు
లాడుదు రెంతయు బుద్ధిహీనతన్. 145

మతము నెఱుంగ లేనిమతి
మాలిన వారొక కొందఱూరకే
మతము మతమ్మటంచుఁ గొఱ
మాలిన కేకలు వెట్టి దానితో
మతము సముద్ధరింతుమని
మత్తిలి దుష్పథగాములై మహో
న్నత పదవీ విదూరులయి
నాఁడును నేఁడలయింత్రు లోకమున్. 146

మతరక్షో బలిపీఠి మూర్ఖజన స
మ్మర్దమ్ము క్రమ్మందించి త
ద్గతరక్తా సవపాన మత్తమతులై
తత్రత్యజీవాసువుల్

ప్రతినిత్యమ్ముఁ బోరిం బోరిం బోరిఁగొనన్
బ్రత్యక్షరక్షస్సులై
వెతలన్ బాటలఁబట్టి పోదురకటా!
విభ్రష్టులై దుష్టులై. 147

ఈ యున్మాదము దేశదేశముల నెం
తేఁ బ్రాకి సార్వత్రికం
బై యుచ్చైర్నినదమ్ములుం జలుపు చ
త్యంతమ్ముఁ జైతన్యసు
శ్రీ యోగమ్మడఁగించుచున్ బ్రబలె వి
చ్ఛేదించి దీనిన్ బ్రజా
శ్రేయోమార్గముఁ జూపఁగా వలయు ర
క్షింపందగున్ దీనులన్. 148

మతమన్నన్ బరతత్త్వమున్ దెలియు స
న్మార్గమ్ము సుమ్మద్ది దు
ర్మతి స్వార్థాశయ పాశికస్థితికి, ధ
ర్మగ్లానిఁ జేకూర్చు ప
ద్ధతికిన్ హేతువుగాదు సర్వజనతా
దర్శైకసూత్రమ్ముగా
క్షితిఁ బెంపొందఁగలేని తక్కుమతముల్
శ్రేయోవిఘాతమ్ములౌ. 149

ఇట్లపార కృపాసముద్రుండగు సద్గురుదేవుండమోఘ
ములగు ననేక దివ్యవచనము లుపదేశించుచు — 150

తన వేదాంత మతోద్యమానుగత వి
ద్వద్గోష్ఠులన్ బోధనల్
మనసారన్ వచియించు సమ్మతిఁగొనన్
మాద్యద్విషద్భావ గ
రణమున్ సేయు నఖండవైదికమత
ప్రావీణ్యముంజూపు భూ
జన సర్వోదయ సమ్మతమ్మౌ మతమున్
సత్యమ్ము స్థాపింపగన్. 151

మత దురహంకృతిన్ జెఱుప
మంచితనమ్మునుఁ బెంపఁబూని జీ
వితము సతమ్ము ప్రమ్మిన వి
వేకముతో హితబోధఁ జేసి శి
ష్యతతిని దిద్దితీర్చి విపు
లాంధ్రికి నప్పనఁ జేసి లోక స
న్నుతిగొని స్వామి పొల్పెసఁగ
నూతన తేజము దిక్కులంటఁగన్. 152

అనుదిన శిష్యబోధనల
యందు నిజాత్మ విచారమందుఁ బ్రా
జ్ఞుని జననిత్య జీవిత ని
బోధనలందుఁ బరార్థసాధనా

ద్యానుపమ సద్విచారముల
యందు గురుండు ప్రజావనోద్యమ
ప్రణిహిత భక్తిమార్గములు
పల్కఁగనుంగవనశ్రులొల్కుచున్ 153

సర్వభూతహితావహ సరణిఁ జనుచు
మహిత విద్యుక్త ధర్మ నిర్వహణబెనుచు
జీవితమ్మును గడపుట శ్రేష్ఠమనుచు
బోధలొనరించు మలయాళ బుధవరుండు. 154

జగమే నిత్యమటంచు నైహికమునన్
స్వార్థాశయోద్యోగమే
మిగులన్ సౌఖ్యమటంచు భౌతికమౌ మే
ల్మిన్ హాయిఁ జేకూర్చు నం
చుఁ గడున్ నెమ్మదినమ్ము నేతరులకున్
జోతమ్ము సేకూర్చు వి
శ్వగుణాదర్శము బోధసేయు గురుఁడి
చ్ఛాపూర్వకోద్యన్మతిన్. 155

బహువిధ సేవాసాధన
సహజామగు దేహమ్ము దైవసాక్షాత్కృతికై
వహియింపని భోగేచ్ఛా
వహులం ఘటియించి స్వామి – వగచు నెడందన్. 156

ఆతతాయియైన హంతకుఁడైన స
ర్వాఘకారియైన నజ్ఞుఁడైన
గురుని జేరి మ్రొక్కుకొని వేఁడఁ గరుణార్ద్రి
చిత్తుఁడగుచు వానిఁ జేరి ప్రోచు. 157

అది యిది యంచుఁ బల్కుఁదర
మా యధునాతనముల్ సదాతనం
బిదియని నొక్కి పల్కు వివిధే
తరసంస్థలు, సత్రయాగముల్
మది గరగించు సాధు జన
మండలులుల్ బహుళోద్యమమ్ములుల్
సదమలవృత్తి నేర్పఱచె
సార్వజనీన మహోపకారముల్. 158

ఎవరేమన్న నదేమి చేసిన మతే
యెగ్గాడినన్ గాని బి
ట్టవమానించిన ద్వేషమూనిన వసూ
యం బొందినన్ మాఱు దా
నవలంబింపక సామ్యబుద్ధియయి ధ
ర్మాద్వైతసిద్ధాంతియై
ప్రవణుండై ప్రణవామృతాబ్ధియయి పా
ల్పారుం గురుండెప్పుడున్. 159

తెలుఁగు పొలమ్మున నలువలఁ
కుల వెలుఁగులవలెను వెలయు – గురుబోధన లు
జ్జ్వలమై యాశ్రమరూప
మ్ముల బహుళవ్యాప్తిఁ జెందె – మోహాపేతుఁ. 160

గ్రంథ నిర్మితులెన్ని యాశ్రమములెన్ని
సద్వ్రతములెన్ని యాచారసరణులెన్ని
సాధుశీలములవి యెన్ని బోధలెన్ని?
అన్ని యిన్ని యటంచుఁ బల్కఁడవశమె? 161

నాయకులెల్లఁ జేరి యధు
నాతన వేళ నొనర్చు సత్కృతుల్
పాయక సద్గురుం డొకఁడ
పారకృపిం బొనరించి మాతృదే
శాయత సేవఁ జేసె ఫలి
తార్థముఁ గోరక స్వార్థభావముఁ
డాయక త్యాగభావ మె యె
డందఁ గడింది వహించె నద్దిరా! 162

నారదమహర్షినుండి యీ నాటివరకు
సర్వతోభద్ర పరతత్త్వసాధనమ్ము
భక్తి ననుభూతికిం గొని బయలుపఱచు
సద్గురుండన మలయాళసామి యొకఁడె. 163

కరుణకు నాలవాలమగు
గౌతమబుద్ధుఁ డహింసయే పారిం
బారి నిజజీవితాశయ వి
భూతి విశేషముగాఁ దలంచి ని
ర్భరకృషి జేసి తత్ఫలిత
భాగ్యము నొందినచంద మాంధ్రితో
నరమర లేని కూర్మి మల
యాళ మునీంద్రుఁ డౌనర్చె మాయురే. 164

బుద్ధుని జీవితమ్మునకు
పోల్పనగుంగద స్వామి జీవితం
బిద్ధచరిత్రుఁడాశయ మ
హిష్ఠుఁడు సత్కరుణామయుండు వ్యా
విద్ధ కదర్థ్యమానవ వి
వేకగుణప్రదుఁడార్యధర్మ సం
బద్ధ హిత ప్రవర్తకుఁ డ
పార తపోవిభవుండు నాటచేఁ. 165

ఈతండొకఁడే సరి యని
గౌతమబుద్ధు నుపమింపఁగాఁదగు భరత
ఖ్యాతలి నసంగ గురునకు
పూతా హింసాచరిత విభూతిఁ ఖ్యాతిఁ. 166

కాదని వాదించినచో
మూదలయగు గాంధి యొకఁడె ముఖ్యుఁడహింసా
పాదకమగు నడవడిలో
ప్రోదిఁ మఱియొకని నెట్లు పోల్పంగ నగుఁ. 167

తెలుగు పొలమ్ము నల్దెసలఁ
ద్రిమ్మరినన్ మలయాళ సద్గురున్
గొలిచిన శిష్యకోటి
గుణగుంఫిత తాత్త్విక సూత్త్ర వాఙ్ముఖ
మ్ములె వెలయున్ సదా గతినిఁ
బోలి నిరంతర తత్త్వచింతనా
ఘుతె తెలుఁగించ పంచలనుఁ
దుంపెసలాడె నదేమి చోద్యమో! 168

తెలుఁగున ధ్రువమండలమటు
వెలిగెన్ గురుకీర్తి యాత్మ-విద్యా మహిమల్
బలిసెను తపస్వి తపములు
ఫలియించెను భక్తజనుల-భాగ్యము పండెన్. 169

క్రాంతబుద్ధిగల కారుణికాగ్రణి! దేశమం
దెంతో పాక్షిక మతాశయవృత్తుల నెల్ల బి
ట్టంత మొందునటు చేయఁగలట్టి ప్రబోధ మ
శ్రాంతమిచ్చి గురుదేవ! ప్రశాంతినిఁ బెంపవే! 170

ఇది శ్రీ వైద్య విద్వత్పండిత సత్కవి నారు నాగనార్య మహాశయ
విరచితమగు మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వామి
చరిత్రమునందు షష్ఠ ఘట్టము.



మహర్షి సద్గురు

# శ్రీమలయాళస్వామిచరిత్రము

అను

# అసంగానంద విజయము

## సప్తమ ఘట్టము

పరమ పదాధిష్ఠానా!
పరతత్త్వ నిధాన! ఘనకృపాపూర్ణ! సదా
పరహిత చింతన తత్పర!
చరాచర సుఖాభిలాషి! సంయమివర్యా!

పూర్వ ప్రవర్తనానుసారముగా సనాతన వేదాంత జ్ఞాన సభలు ప్రతిసంవత్సరము బహుళ ప్రదేశముల నిర్వహించుచు, ఓంకార సత్రయాగములు, సాధు సప్తాహములు, ఋషియజ్ఞములు, జ్ఞానయజ్ఞములు, చాతుర్మాస్య వ్రతములు మున్నగాగల మహోన్నత కార్యములు నిర్వహించుచు భక్తజనులచే మహర్షి ముఖ్యుండని సంభావింపబడుచు ప్రజానీకమెల్ల నమందానందతుందిల హృదయారవిందమగునట్లొనర్చుచు పత్రికా నిర్వహణ గ్రంథ నిర్మాణాది కార్యములలో

నే మాత్రము లోటు రాకుండఁజూచుచు నిజపాదపద్మము లాశ్ర యించిన బాలబాలికలను పవిత్రమగు సంస్కృతభాష నభ్య సింపఁజేయుచు ముముక్షువులకు మోక్షమార్గముంజూపుటకై బహుళోపనిషద్గ్రంథములలోని దివ్యవచనములను వివరిం చుచు నమష్ఠానమును మించిన తపము లేదని ప్రబోధించుచు నిజపవిత్రాశయము సఫలమగు నట్లొనరించి తనివిసెందె. ఆ స్వామికరుణచే నక్షరజ్ఞాన శూన్యులక్షరతత్త్వమరయం జాలిరి. అబలలని హీనముగాఁజూడబడిన స్త్రీలాధ్యాత్మిక జ్ఞానబలముఁ జేకూర్చికొని విద్వత్సభలలో పూజ్యత నందిరి. శుష్క వేదాంతులును, జాత్యహంకారగర్వితులును, అచలవాదులును, తమ తప్పు తాము గుర్తెఱింగి మిన్నకుండిరి. భారతావనియందలి పవిత్రాశ్రమములలో శ్రీ వ్యాసాశ్రమ మగ్రగణ్యమై భాసిల్లె. స్వామియొనర్చిన సత్కార్యములవలన దీనానాథజనులెందఱో సముద్ధరింపబడిరి. 1

అదియిది యంచుఁబల్కఁతర
మా ప్రజకెయ్యది సానుకూలమో
ముదమొదఁగూర్చునో పలుకు
పొందికఁబేర్చునొ మేల్మిఁదార్చునో
యెదఁగఱఁగించునో హృదయ
మీశ్వరుపై తగిలించునో పదిం
బదిగ తదీయ కార్యములు
స్వామి యొనర్చె తదేకనిష్ఠమై. 2

ఒకవంకఁ బ్రజల కొఱకిం
కొకవంక స్వతంత్ర నిష్ఠయున్నమితంబౌ
టకు నుగ్రతపమొనర్చును
స్వకీయ సత్యోపలబ్ధి జార్చుండెందుఁ. 3

—: నే త్ర చి కి త్స :—

అట్లు పరోపకారైక నిరతుఁడై ప్రవర్తిల్లు నమ్మహ
నీయునకు 4

కంటిజబ్బుదగిలి కనరాని యెనలేని
బాధతోడఁజూపు పేదవడుట
యెఱిఁగి తిరిగి సురిగి కరగి చికిత్సకై
పాటువడిరి శిష్యభక్తవరులు. 5

అట్టియెడ 'గీతాప్రవచనము' నాంధ్రమున ననువదించి
శ్రీవినోబా మెప్పు వడసినవాఁడును, శ్రీ మహాత్మగాంధి
యనుయాయియు, నేత్రచికిత్సాదక్షుండును, సాత్త్విక
గుణావిష్టుండునగు శ్రీ వెంపటి సత్యనారాయణునొద్ద చికిత్స
నొందం గోరి — 6

తనయాత్మారాముని ప
జ్జను వదలక సహజధిషణఁ - జాలింపక యా
తనువునఁ బొడమిన తెవులున
కనువైన చికిత్స కొఱకు - నచటికిఁ బోయెఁ. 7

నేత్రచికిత్సకోసమయి
నిండిన పండు తెనాలి వెంపటా
స్పత్రిఁ బరుండె నౌర! సహ
జమ్మగు నిద్ది విధి ప్రభావమిా
ధాత్రి నెపండు తప్పకొను
తత్ జ్ఞుఁడు గావున నయ్యతీంద్రుడే
మాత్రము తల్లడం పడడు
మాయురె! తన్మహిమం బదెట్టిదో! 8

కాలమిట్లు గడపి — కారలలో బంది
చంద మంది చేరె — స్వాశ్రమమ్ము
రాళ్లవానఁ గురిసి — రాత్రిం దివమ్ములు
విడిసినట్లు బెడద — లుడిగెఁ గొంత. 9

నానాఁటికి క్షీణించిన
మేనన్ గుతుకమ్ము తగ్గ — మికిఁ జిత్తమునన్
ప్రాణాశ లేమికిని బ్ర
హ్మానంద పరత్వసిద్ధి — నందుటె కతమా. 10

కొన ముక్కున నూపిరి యా
శివ దయకర్ నియమనిష్ఠ — దీప్తయుపక ప్రా
కృణతిన్ స్వస్వాకృతితోఁ
దనరెన్ మలయాళ ముని య — దంచత్కీర్తిన్. 11

ఎవరెన్ని యడుగుచుండినఁ
దవులాటంబింత లేక – తత్రత్యులతో
సవిమర్శంబుగఁ బలుకును
వివిధ పదార్థములఁ గూర్చి – విస్తృతభంగిన్. 12

తన యభిమత మెయ్యదియో
పనిఁగొని యేమేమి సేయ – వలసిన యదియో
మునుఁ జెప్పఁదగిన దెదియో
మనసున డాపండ దెట్టి – మర్మజ్ఞుండో. 13

ఆశ్రమమ్ములు గ్రంథాల – యమ్ము లచ్చు
కూటములు నుపదేశముల్ – కోట్లకొలఁది
ఛాత్రసమితినిఁ గూర్చుట – సత్కృతులను
సేయుటలు మున్నుగా స్వామి – చేయు పనులు. 14

సహజములు నిరవధికముల్ – శాశ్వతమ్ము
లతిశయ కృపోపలబ్ధమ్ము – లంచితములు
దీనమానవసేవా ని – దానములగు
స్వామి కార్యమ్ములెల్ల శు – భప్రదములు. 15

చిక్కని పలుకులు మదికి ఖ
చిక్కను శబ్దార్థభావ – సిద్ధి ప్రదమా
చక్కని సంస్కృతి గల యతి
జిక్కుట సాధ్యమ్మె? లోక – సేవాదృతికై. 16

తనువు పరిణామదశఁ బొం
దిన కొలఁది నిజాత్మనిష్ఠ - నిలనాటుకొనన్
గొనసాగిన జతనమ్మున
ననితర సత్యానుభవ మహోబ్ధి మునింగెన్. 17

లోకమ్మంతయుఁ బరత
త్త్వాకీర్ణమ్మయి ప్రహృష్ట - మై వైరాగ్యై
త్నేకమ్మయి యాత్మామృత
సేకమ్మయి పొదల స్వామి - చిరము తలంచున్ 18

అంతం గొంత కాలము కడచనిన పిమ్మట 19

—: ఆ మ య ము :—

ముదుసలితనమ్ముపైఁ గప్పి యదను దప్పి
తెవులుపై ఱొప్పి నరుల బందిగ నొనర్చు
సాజమిది స్వామికైన రుజాభరమ్ము
తప్పదాయెను విధి చెయిదమ్ములౌర. 20

పేదవానిచేతి విడిముడి వడువున
కాలమెల్లసెల్లె గాయ యష్టి
సన్నగిల్లెనదియ చక్కెర తెవులని
నాఁటి వెజ్జులెల్లఁ జాటినారు. 21

రోగము శరీరమునకే
యోగించును గాని మనసు - నూటార్చునే మి
థ్యా గతి దాని గణింపరు
యోగీశ్వరులట్లు స్వామి - యున్న పెంపొందెన్. 22

ప్రణవధ్వని విను శ్రుతులకు
వినఁబడె గీగీరవమ్ము - విస్ఫుటమయి తే
యునుఁ బవలును భీప్రదరవ
మును వినియును జంకుఁ గొంకు పూనఁ డొకింతన్. 23

నానాటికి తనువంతయు
మ్రానువడెన్ కర్ణశూల మఱి మఱి హెచ్చెన్
గ్లాని పెనుపొందెను చికి
త్సానియతు లెఱింగి చేయఁ - దగిన చికిత్సల్. 24

విడువక విడుమర గొనకయె
బడి బడి వెజ్జులనుఁ బిల్చి - పరిశోధనముల్
కడు శ్రద్ధఁ జేయఁబడినను
కడకది సాధ్యమ్ముగాక - కష్టము గూర్చెన్. 25

తనువు రుజాగ్రస్తమ్మ
య్యును లక్ష్యమ్మాత్మపై ప్రయోగించుటచే
తను రుక్కష్టావళి మన
సునకుఁ దోఁపదిది పెద్ద - చోద్యము గాదే! 26

—: వేలూరులో చికిత్స :—

వేలూరు చికిత్సాలయ
మాలోచనముం బొనర్చి - రందఱు కడకం
దేలక్ష్యముంచి కదలిరి
వైలాయము లక్ష్యశుద్ధి - ఫలితం బిడదే? 27

సుప్రసిద్ధంబగు నా వైద్యాలయంబున నతినిపుణంబుగా చికిత్స గొనసాగుచుండ నంతకుమున్నే నిర్ణయింపబడియుండిన విజయవాటికాంతర్గత పాహికాపురమున జరుపవలసిన సనాతన వేదాంత జ్ఞానసభ కాహ్వానమందె. ఆరుజావస్థలో వైద్యాలయము వీడి చనుట తగదని వైద్యులు నిరోధించినను అంగీకృత కార్యభంగమునేమాత్రము సహింపని యమ్మహర్షి వారినట్లో సమ్మతింపంజేసి యాశ్రమముం జేరినంతట వ్యాధి ఘుమ్మరం బ్రాటంజేసి శిష్యజనులు సభకు పయనించుటెంత మాత్రము తగదని గట్టిగా వారింపంబూనిరి. గురువర్యుండు వారి మాటలువిని సన్న్యాసి ధర్మమున కయ్యది విరుద్ధమనియు, అట్లైనచో గృహస్థులకును, సన్న్యాసులకును భేదమేముండు ననియు, ఏది యెట్లైనను సభకు బోవక తప్పదనియు వారిని శాసించి యెట్టకేలకు తన యభిమతము నెఱవేర్చుకొన పాహికాపురంబున కరిగి యచటి సభను జయప్రదముగా నిర్వహించి సకలజనసేవితుండై తిరిగి వైద్యాలయమునకుం జనియె. ఆహా! ఆ కార్యదీక్ష నేమని కొనియాడ నగును! "అంగీకృతం సుకృతినః పరిపాలయంతి" యనుసూక్తి కింతకంటె చక్కనియుదాహరణ మేముండును? 28

కొన్నాళ్ళు చికిత్సాదుల
కున్నిలయంబైన తనువు - గ్రొస్సియుఁబిదపన్
మన్నికఁగొన నారోగ్యము
క్రన్నన లభియించి ముదము - గైవసమయ్యెన్. 29

జడమును విడి చైతన్యము
తోడంబడం జెలరేగినట్లు – తోడ్తోగురుండ
ప్పుడ వెడలి యాశ్రమమ్మున
బడలుడిగెఁ గొన్ని మేలి – పనులొడంగూడెఁ. 30

విడిచిన రాజ్యమ్మును బ
ల్విడిం జేకొన దండయాత్ర – వెడలినటుల్ మున్
విడిచిన ప్రబోధకృత్యము
లుడుపక పునరుద్ధరింప – నుద్యోగించెఁ. 31

మఱల నొకసారి తానాంధ్ర – మండలముల
విజయయాత్రం బలెఁ ధార్మి – కజయ యాత్ర
సేయ మొదలిడె నెదిరి వ – చించువారు
లేరు మందునకైన గా – లించి చూడ. 32

వినుత వేదాంత సందేశమున విశిష్ట
సంఘసంస్కరణమ్మున జనులకెల్ల
హితముం గూర్చుచు మలయాళ యతివరుండు
సంగరాహిత్య పదవి నెసంగె నార! 33

సకలాంధ్ర విజయయాత్రా
దికమున వేదాంతభేరి – దెసల మ్రువంజేశా
పిక మ్రోయ విశ్రమించెను
ప్రకట వ్యాసాశ్రమాంతర – కుటీరమునఁ. 34

—: శ్రీ చిన్మయానందు నిరాక :—

అత్తఱి శ్రీవివేకానందుని యపరమూర్తియో యనఁదగి ఖండఖండాంతర ప్రశస్తిఁగొన్న శ్రీ చిన్మయానంద యోగీంద్రుఁడు స్వామి యనారోగ్య వార్తనెఱింగి హుటాహుటి శ్రీ వ్యాసాశ్రమమునకుఁజనుదెంచి శ్రీ వారిని పరామర్శించి తదీయాధ్యాత్మిక కార్య కలాపముల కెంతయు నలరి నానావిధ తత్త్వ గోష్ఠ్యర్థము లెన్నియో మనసు విప్పి మాటాడుకొని చనియె. 35

తన వచ్చిన పని ముగిసిన
వెనుక క్షణార్ధమ్ము నిలువ - వీలగునే యీ
మనుజుల కనుసూచనమో [illegible]
యనఁదనువున మాటల నామ - యమును పోడమా [illegible]. 36

నాఁడు నాఁటికి మెయి వసి వాడెఁ దేవులు
జాడ పసిపట్టి వీల్గాక కాడుపఱచె
వెజ్జు గమికైన నేమి యీ వింగడమ్ము
దైవకృత వికృతులరయఁ దరమగు నొకో? 37

అంతగదియయ్యుఁ బరికించు - నాశ్రమమున
జరుగు విషయమ్ములెల్ల వి - శ్రాంతి లేక
యడుగు సందియముల బడు - లాడి తీర్చు
కొఱత నొందుదు రానీక - యరయుచుండు. 38

పరిపూర్ణ హృదయ కమలాం
తరనిర్యన్మధుర మృదు సు - ధారసధారా
నిరవధికాను భవాత్మో
పరతిఁ గను స్వామి యెంత - పరిణతమతియో! 39

(శ్రీ) మదసంగానంద
స్వామి శరీరమున రుక్ప్ర - సారమ్మగుటన్
క్షేమారోగ్యము లెఱుఁగం
గా మఱి మఱి కోరి రాంధ్రిఁ - గల జనులెల్లన్. 40

వేలూరు వైద్యశాలను
శీలించుటకో యనంగఁ జేరెను గద మ
ల్యాళ యతీంద్రుఁడసంగుఁడు
చాల గృశీ భూత దేహ - జవసత్త్వుండై. 41

రుగ్వి నిశ్చయమునకు ని - రూఢవైద్య
వరులు ప్రోవయి చర్చాను - సరణ మర్థిఁ
జేసిరత్యంత దారుణ - చింతనీయ
గద వినిగ్రహవైద్య సం - పద నమర్చి. 42

వాకున కందక మనసుం
బోకకుఁ బొందక పరాను - భూతివలెఁ దేవుల్
సోకి యిదమిత్థ మనియును
వాకొన వీల్గాని దెస విప - ద్దళ యలమెన్. 43

అలలు చెలరేగి సంద్రమ్ము - నలు దెసలను
కలఁత పఱచినఁగాని లో - పలి యడుగున
నిస్తరంగగభీరమై నిలిచినట్లు
ఆమయమునఁ గలంగఁడు స్వామి సుంత. 44

అగదంకార చికిత్సలున్న మితమై
యా మూలచూడమ్ము బా
గుగ సాగెన్ ఫలితమ్ము శూన్యమయి క
క్కుర్తిన్ రుజావృద్ధి బి
ట్టగఁ జాట్లున్ బలుపాట్లకిక్కయియు మి
థ్యాసర్వ్రయత్నమ్మునై
ప్రగతిన్ జూపక నిల్చె నట్టియెడఁ బ్ర
త్యాశల్ చివుర్వెట్టమిన్. 45

ఆ విపత్సమయ సన్నివేశమందయినను వైదేశిక మతానుయాయులగు భిషగ్వరు లసంగానంద యతీంద్రుని సన్నిధిం జేరి "స్వామీ! బాధగానున్నదా? భయఁపడితిరా?" యను ప్రశ్నమ్ము లొనరింప ధీరోదారుండగు నప్పరమర్షి "యలంతి బాధకలదుగాని యయ్యది శరీరమునకే ఇక భయమెందులకు? 'జాతస్య మరణం ధ్రువమ్' అను వాక్యము నాకే కాదు లోకమున కంతటికిని తెలిసినదియే. మఱియు మరణ భయము మాయాశ్రిత జంతువులకు సైతముండ"



శ్రీవారు వ్యాధిగ్రస్తులై వేలూరు వైద్యాలయములో
శయనించియున్న చిత్రము.

దని సహజగంభీర నిర్భరనర్మ గర్భోక్తులతోఁ జమత్కరింప వైద్యశాల యందెల్లవారును సంతుష్ట స్వాంతులైరి. అట్టి పట్టున — 46

—: ఉ త్త రా ధి కా రి ని య మ న ము :—

పలువురు శిష్యవర్యు లొక
పట్టునఁ జేరిన యప్పుడెల్ల రా
గలతటి గుర్వనంతరము
కాఁగల యాశ్రమ పీఠికాధిపుఁ
దెలియుట లెస్స యంచు గురు
దేవున కేమని దీనివాకొనన్
గలమని రొండొకళ్లు తమ
కంబున సంశయమందఁజొచ్చియున్. 47.

నసకొట్టిరి రుసకొట్టిరి
బుసకొట్టిరి వేడి పాల - పొంగుంబలె వె
క్కస పడి కకక్కసపడి య
క్కసపడి వసపడిరి పాశ్చ - కపు బుద్ధి మెయిన్. 48

గుజగుజ వోయిరి కడకది
గజిబిజియై విప్లవాత్మ - కంబయి శిష్య
ప్రజల కశాంతిం బేర్చిన
నిజమునుఁ గనె స్వామి కొంత - నిలకడ మీఁదన్. 49

తలపుం దరగల యురవడి
బలగపు సద్దడఁచి పోయి పైకొను గురు నం
దలవోక చిత్తజల్లటు
చెలరేగెఁ దలంపు పాలఁ జేసిరి వోలెన్. 50

అంత నయ్యతీంద్రుండు పరిసరంబులు పరికించియు, శిష్యసమాజ చిత్తవృత్తి నన్వేషించియు, సమీప సమీహిత ప్రజాహృదయ సమీచీనత్వము సమీక్షించియు, తద్విష యమై యుప్పెనవలెఁ జెలరేగు నానావిషయమ్ము లుపలక్షించియు నిరుగెడల సత్యాధర్మములఁ దులనిడి తూచి నిజాంత రంగ సముద్వేల భావపరంపరా సూచిక భారవహంబయి ప్రెుగ్గతిలుట వీక్షించియు నోరులకెఱుంగరాని తన మదిలో బహువిధ తర్జన భర్జనమ్ముల లక్షించి యందు తీర్ణమైన సర్వ శ్రేయోదాయకమ్మును, సర్వాంగీణమ్ము నగు నొక సునిశ్చి తాభిమతంబును సముద్రగర్భనిక్షిప్తంబగు నమృతకుంభంబు డంబున డాచి యద్దానిని శాసనబద్ధం బొనర్ప సంకల్పించి యందులకై వలయు నేర్పాట్లు గావింప నతిసన్నిహితులగు వారిని నియమించి భక్తశిష్య జనులందఱు నేకోన్ముఖముగా పరమాత్సుక్యముతో ప్రతీక్షించుచుండ నతిబాల్యమునందే గురుపాదసన్నిధి సేవాపరుండై విద్యాభ్యాస మొనర్చుచు నాశ్రమముననే చాలకాలముండినవాఁడును, తదుపరి గుర్వా జ్ఞానుసార మున్నతవిద్యాఽభ్యాసమునకై కాశీక్షేత్రమ్మున

కరిగి యందిరువది సంవత్సరములు వసించి యున్నతవిద్యయం దుత్తీర్ణుఁడైనవాఁడును, మూర్తీభవించిన గురుభక్తియో యన నొప్పారుచు గుర్వనుగ్రహమునకుఁ బరమపాత్రత్వ మును భజించినవాఁడును, వివిధ గ్రంథ నిర్మాణదక్షుండును, వినయ వివేక శీలాద్యావి సద్గుణంబులకెల్ల తావలమైనవాఁ డును, చత్వారింశ ద్వర్ష వయః పరిమితుండును, సర్వభూత హిత శ్రేయోఽర్థియు నగు శ్రీకృష్ణచరణాభిధుండు శ్రీ వ్యాసా శ్రమ సర్వస్వమును సర్వతోముఖముగా సర్వతంత్ర స్వతంత్ర ముగా నిర్వహించుకొనులాగున నుత్తరాధికారిత్వంబును శాసన నిబద్ధం బొనరించె. అది యెఱింగిన భక్తశ్రేష్ఠులెల్లరు గురుదేవుని నిర్ణయమునందలి యౌచిత్యమును గుర్తించి యమందానంద మొందిరి.

అనంతరంబు కొంత కాలంబునకు శ్రీ స్వాములవారి యనారోగ్యము తీవ్రమగుటెఱింగి సరాసరి వారాణసినుండి యరుగుదెంచిన శ్రీకృష్ణచరణుని పరామర్శించి గురుదేవుండా శిష్యాగ్రణినట నిలుపుట యత్యున్నత విద్యా పట్ట ప్రదాన సమయ సముచిత కార్యకలాపమునకీ షద్వ్యతిరేకమని తలంచి యాశీః పురస్సరముగా మఱల కాశికి మఱలించె. 51

స్వామి మెయి నామయము పెను
బామయి ప్రాము నెడఁ జూడవచ్చిన శిష్య
గ్రామణి కృష్ణచరణమున
కేమాత్రము గురుఁడు దెలుపడేమి మతమ్మో. 52

తడవుల నిడుపడు గయికొను
సుడిగాలిం బోలి యదను - సుడివడి చెల్లన్
వడి నాశ్రమాధికృతి చే
పడ దలఁచెదు జడుల కోర్కె - బలపడి సుడిసెన్. 53

భగవత్కరుణావాప్తికిఁ
దగు సాధకుఁ డెవ్వఁడతఁడె - తత్పదవి గొనం
దగు నర్హుఁడొరున కెట్లగు
సుగమంబిది యార్షధర్మ - సూత్రంబగుటన్. 54

తొక్కలు గట్టుకొన్నటుల
జివ్వన మింటఁ జరించు కాలమున్
పక్షి పెనంకువల్ దెలియ
బ్రహ్మకునైన వశంబె మానవుం
డొక్క నిమిత్తమాత్రమగు
యోచనలన్ ఫలమెట్లు గల్గు న
మ్మక్క! భవిష్యదర్థ నిరు
పాధికలబ్ధి కెవండు కర్తయో! 55

సకలము నాకే రావలె
సకలాధిపుఁడగుట కేన - చాలుదునను కో
రిక నరునకుంట సహజము
సకలేశుఁడు జ్ఞప్తిరాని - జడుఁడై యుంటన్. 56

కనఁబడు నీ సర్వజగ
మ్మునకు నియామకుఁడొకండు పోలుచు తదాజ్ఞా
విని బద్ధులు గద జీవులు
కనఁబడకయె తాను బ్రోచు కనఁబడు జగతీ. 57

—: ఆశ్రమమునకు తిరిగి వచ్చుట :—

భగవద్విభూతి యట్లఖండముగా భువనమున ప్రకా
శించుచుండ — 58

శ్రీమదసంగానంద
స్వామిని వేలూరు నుండి - ఛాత్రులు భక్తి
ప్రామాణ్యబుద్ధి నాశ్రమ
సీమకుఁగొని వచ్చి రధిక - సేవాధిషణ౯. 59

పరిచర్యాలోపమ్మును
బొరయక తేఁబవలు శిష్య - పుంగవులతి ని
ర్భర భక్తి పురస్సరముగ
పొరిం బొరిఁ గొల్చిరంత - బుధనుతు గురుని౯. 60

శరవేగమ్మున కాలమిట్లు గడువ౯
స్వామ్యంతరంగమ్ము ని
ర్భర కౌతూహల వర్ధమానమయి పో
ల్పారె౯ దనూగ్లాని దు

మిచ్చినట్లు భావించి (శ్రీ) రాజశేఖరానందుఁడు (రాజయ్య) మున్ను సుజాత బుద్ధదేవునకు త్రావించినట్లు గోక్షీరమొకింత త్రావించెను. స్వామికదియే చివరి యాహారము. శిష్యున కదియే కడపటి పరిచర్య. ఆహా! ఎంత భాగ్యము! తరువాత కొంతసేపటికి నమ్మహాపురుషుండు మహామహస్సున ప్రస్థాన యాత్ర సాగించినాడో యన మెయి నాడి సన్నగిల్లినది. హృదయస్పందన మాగినది. లోకమంతయు నిదురించిన తఱి మేల్కొన్నవాఁడు, లోకము నంతయు నిదురనుండి మేల్కొలిపిన వాఁడు, నిద్దురలో సయితము మేలుకొనువాఁడు, మేలు కను వాఁడు జగము కన్ను గప్పి తాను కన్ను మూసికొనెను. అంత దిక్కులేని పక్షులవలె, తల్లిలేని పిల్లలవలె నగతికులై యాశ్రమ నివాసులు గోడు గోడున పలవింపసాగిరి. అంతియ గాదు. లోకమంతయు శాకి శోకమున మునిగెను. తెలుగు మండలము దీపములేని యిల్లైనది. ఇఁక నేమున్నది? ఈ కటిక చీఁకటిలో వెలుఁగుఁ జూపించువా రెవ్వరు? ప్రకృతి యింత నిష్కరుణముగా ప్రవర్తిల్లునని యెవ్వరును తలపోయ రైరి. అక్కటకటా! కాలగర్భమున నింకను నెట్టి యెట్టి హృదయ విదారక సన్నివేశము లుత్పన్నముగా నున్నవో! ఎట్టి యెట్టి వింగడపుఁ జెయిదములు రానున్నవో యెవ్వరి కెఱుక? అయినను మానవజీవితము మహత్తరాశాద్యోతకము గావున నిఁక నెట్టి మహాపురుషులీ యుగమున నీ యాశ్రమ వాతావరణమున నుత్పన్నము కాఁగలరో! ఎవ రెఱుంగుదురు?

కాలపురుషుని హ స్తరేఖలు పరిశీలింప సమర్థులెవ్వరు? అతని ఘంటారవము గుర్తింప నెవరి తరము? పవిత్రభారతమ్మున నార్షమతానుసారముగా జ్యోతిష విద్యా పారీణులు గుణించి గుర్తించిన మహత్తర కాల సన్నివేశమున సుముహూర్తము లెన్నియో ప్రవచింపంబడియె. అందొకానొక సుముహూర్తమగు నుత్తరాయణ శయనైకాదశీ గురువాసరముతోఁగూడిన పుణ్యాదినంబున నిశీథ సమయంబున — 67

పది తొమ్మిది వందలు యరు
వది రెండవయేట నేడ - వ నెలను దినముల్
పదిరెండవు నడిరేయిన్
* వదలె శరీరమ్ము యోగివర్యుండకటా! 68

మలయాళ స్వామి కడచన
తెలుఁగు జగంబెల్ల కలఁగి - దీప్తి యడంగెన్
కల కలము పొంగె భక్తా
వళియెల్ల ననంత దుఃఖవార్ధి మునింగెన్. 69

స్వామి నిర్వాణవార్త దిశాంతములకుఁ
బ్రాకె గ్రీష్మాతపోత్తప్త పవనుమాడ్కి
వినిన భక్తులు విననట్లు వెడలిరపుడ
గురుని భౌతిక కాయమే నరయుకొఱకు. 70

* 12-7-1967 శయనైకాదశి గురువారము రాత్రి 12-5 గం॥ మహాసమాధి.

ఈ దుర్వార్త సమస్త భక్తతతి కెం
తే హృద్విదారక్రియా
ప్రాదుర్భావకమై కలంప పితవో
వన్ దుఃఖవారాశిలో
సీదన్నేరని బిడ్డలట్లు చెడి యా
యీ చోట్లంబర్వెత్తి యె
ట్లో దర్శించిరి యాశ్రమమ్ము గురు భ
క్త్యుద్రేక చిద్రూపులై. 71

భౌతిక దేహముంగని వి
పర్యయవృత్తి నికృత్తభూజసం
ఘాతము రీతిడిల్లవడి
శాఖ్యని చిక్కులు పిక్కటిల్ల నా
యా తతి నేదియెట్లొ తెలి
యందగి చేయుటెఱుంగ లేక దుః
ఖాతిశయమ్మునన్ మునిగి
యందఱు సందడి దందడించినన్. 72

అట్టియెడ కింకర్తవ్యతావిమూఢులగు భక్తజనులు భవితవ్యమాలోచింప నేరక వారాణసి యందున్న శ్రీకృష్ణ చరణ మహాత్ముని సమాగమమునకై నిరీక్షించుచుండ.

మనసుకంటె రయోద్ధతిఁ – దనరు తంతి
చేరనపుడె విమానమ్ము ద్వారమునను
కృష్ణచరణుండు చెన్నపురిం గమించి
చేరె వ్యాసాశ్రమమ్ము విచారపరత. 73

గురుని మహోన్నతాశయని
గూఢ విచారపరంపరాలసత్
గురు తరభారధూర్వహత
కున్ దగు నీతఁడె యన్నటుల్ స్వతః
స్ఫురణ మఖండధైర్యము ప్ర
భూత గుణప్రచయమ్ముగల్గి తా
న్మఱిమఱివెల్గె కృష్ణచర
ణమ్ము సమీహిత కార్యదక్షుఁడై. 74

అట్లమ్మహామహుండు హుటాహుటి నరుదెంచి స్వామి భౌతిక దేహము నవలోకించి నిర్వేదంబొంది వెంటనే తెప్పిరిల్లి శ్రీ గురుదేవుని మూలమున తురీయాశ్రమస్వీకార భాగ్యమునకు నోఁచుకొననైతిని గదా యని తద్దయుఁజింతించి విధి విధానము దురతిక్రమణీయమని సమాహితచిత్తుండై 14—7—1962 నాటి ప్రాతఃకాలమున కాశీబుగ్గ తీర్థంబున సుస్నాతుండై శ్రీ గురుదేవుని భౌతిక దేహసన్నిధిని హోమాది క్రియలు యథావిధి నిర్వర్తించి శ్రీగురుదేవుని హస్తకమలము లందుంపఁబడిన కాషాయాంబరము స్వీకరించి ధరించి తదాది

శ్రీ విమలానంద స్వామి యను నభిధానమున విలసిల్లె. పిదప భక్తజనుల నోదార్చుచు కాలోచిత ప్రజ్ఞాధురంధరుండై శాస్త్రోక్తవిధిని సంస్కారమునకు వలయు ద్రవ్యముల సమకూర్చి తద్భౌతిక కాయంబు నాశ్రమావరణంబున నలువలంకుల నూరేగించి తదనంతరము విషణ్ణవదనులై యెల్లవారలుఁజూచుచుండ భజనకీర్తనాదులు, మంగళవాద్య ఘోషములు, భక్తుల హృదయావేదన ధ్వనులునొండొండ పెనంగొని దెసలద్రువ ప్రతిధ్వనించుచుండ మున్నొక సందర్భవశమ్మున శ్రీ గురుదేవుండు సూచనాప్రాయముగా వెలిఁబుచ్చినయభిప్రాయంబు ననుసరించి తదీయ ధ్యానకుటీరంబగు నిష్ఠాశ్రమ ప్రదేశంబునందు శాస్త్రోక్త విధానమ్మున సమాధిం బొనర్చె. అంత నా ప్రదేశంబు మహనీయమగు దివ్యక్షేత్రంబులలో నొకటియై భక్తులకు కొంగు బంగారమై విరాజిల్లె. 75

గోలు గోలున నెల్లరుఁ గూడి యేడ్వ
జంతువులు సైతమును మనశ్చింత బర్వ
ప్రకృతియంతయు వికృతిభావమున నార్వ
నాఁటి లోకము వగపు మున్నీట మునిఁగె. 76

ఆశ్రమస్థిత జీవధనాదికమ్ము
కంట నీర్వెట్టి లేట మొగమ్ము వడియె
పరిసరములెల్ల దుఃఖభావమున బడలె
నాఁటి ప్రజ దురవస్థ కనోప్పటుఁ గూర్చె. 77

విరసమై యాంధ్రి నీరస పరిణతిఁ గని
యడలె సాధులు బోధకుల్ బడలు వడిరి
స్వామి సుగుణాళి వేనోళ్ల సంస్మరించి
నాయకులు విభ్రమ భ్రమణమునుఁ గొనిరి. 78

భగవద్గీతకు భాష్యం
బగు శ్రీమలయాళ స్వామి యాచరణమిమ్మ
యుగమున నంచు హృషీకే
శగత శివానంద యతియు సన్నుతిఁ జేసెన్. 79

ఆ నాఁడు పరమతత్త్వని
ధానంబగు గురునకై యుదారవదాన్య
శ్రీ నగ్గఁ దత్సమాధికి
దానమ్మొనరించి రతులిత ధనము భక్తుల్. 80

గురుదేవుని గుణములు వే
వురు పరి పరి గతుల నత్తి పొగడిరి మును శం
కర గురువరు వినుతించిన
వరశిష్యులకరణి మదిని వారని భక్తిన్. 81

పిదప మహోన్నత స్థాయితో శాస్త్రోక్తవిధిగా జరిగిన శ్రీ గురుదేవుని మండలారాధనమునకు భక్తులెల్లరు తండోప తండములుగా నరుదెంచి శ్రద్ధాంజలి ఘటించి తమ భక్తి ప్రపత్తుల నివేదించుకొని యమందానందమంది ధన్యాత్ములైరి.

—: శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతి :—

అంత శ్రీ విమలానందస్వామి శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపత్యంబు వహించి 82

గురుదేవుఁ డాశ్రమంబే
తెఱగున నడిపించెఁ దద్విధిన్ లవమేనిన్
నెరసులు బొరయక తేబవ
లరయుచుఁ బాలించె భక్తులౌరా యనఁగన్. 83

గురుఁ డాచరింప నేర్చిన
పరమార్థ విశేషములను ప్రస్ఫుట ఫణితిన్
గుఱు తెఱుఁగ బలికి తన యా
చరణమ్మున నిలిపె సాధుజన సన్నుతుఁడై. 84

అకలంక ప్రతిభా విభుండు గురురా
డంఘ్రిద్వయీ సేవనా
ధిక సక్తుండు రుశాంతి దాంతి సుగుణా
ధిష్ఠానచారిత్రుఁడా
ష్టిక లోకోపిదుఁ డాశ్రమోద్ధరణ దీ
క్షా దక్షుఁడై దం యుగీ
న కృతాఘౌఘు నిశ్శ్రాంతమందు విమలా
నంద సుందరుండు వెల్గొందెడున్. 85



శ్రీవ్యాసాశ్రమ సంస్థాపకులు :
మహర్షి సద్గురు శ్రీమలయాళస్వాములవారు.

శ్రీ వ్యాసాశ్రమ సంచాలకులు :
శ్రీ విమలానందస్వాములవారు.

గురుతరభక్తి పట్టుదల
　　కూరిమి పేరిమి కార్యదీక్ష ని
ర్భరతర యోచనాద్రఢిమ
　　భక్తశుభోదయకాంతి భారతీ
పరమకృపాప్రసాద విభ
　　వాత్త విశిష్ట కవిత్వ తత్త్వ వి
స్ఫురణము నేఁటి యాశ్రమ వి
　　భుండగు స్వామి గుణమ్ములద్దిరా! 86

సాహిత్యాచార్యుండు మి
తాహారుండౌపనిషదతత్త్వజ్ఞుండున్
సోహం పరుఁడురు కరుణా
వాహిని పీఠాధినేత వంద్యుఁడు గాడే! 87

—: శ్రీ సద్గురు స్తుతి :—

జిలుగు వెలుంగులు తెలుఁగున
వెలుగువలుకు నీ యశమ్ము – విధురవితారా
విలసనముగ భువి నిలుచును
మలయాళమునీ! అసంగ మానీ! జ్ఞానీ! 88

పరమపదాధిపా! భవద
　　పార కృపాపరిపాకలబ్ధ ని
ర్భర నవతార సోచిత వి
　　రాజిత సత్కవితామతల్లి నీ

చరణములందు నిల్పి మన
సా తనివోవ భజించినాడ నీ
కరుణయె నా యదృష్టమిఁకఁ
గాఁగల దెన్నఁడు దప్పు సద్గురూ! 89

ఆచంద్రతారకమ్ముగ
నీ చరితంబాంధ్రజాతి – నిలిచినవఱకున్
వాచంయమి సముపాస్యం
బై చెలఁగుత సుకవి కీర్త్య – మగుత మునీంద్రా! 90

నీవున్నావనియే తలంతు నిపుడే
నీ దేహమే లేదు కా
నీ విశ్వాంతర సన్నివేశమతి నా
యీ తావులం గాక యె
చ్చో వేదాంత సభా సమాగమము లె
చ్చో భక్తసంఘమ్ము లె
చ్చో విశ్వేశ్వర పూజలున్ జెలఁగు న
చ్చో నచ్చు మీ వుండవే? 91

ఆశయసిద్ధికై యహర
హమ్ము నిజోద్యమవృద్ధికై కృపా
వేశము నొంది యీ తెల్గుఁగు
వెల్గుల దెప్పుడు స్వాత్మరూపతన్

దేశము నల్వాలంకులనుఁ
    ద్రిమ్మరుచుందువు నీదుశాంతి సం
దేశము మానవావళికి
    తేజముఁ గూర్పక పోదు సద్గురూ! 92

అదియేమో నినుగూర్చి వ్రాయునెడ భ
    క్త్యావేశముప్పొంగి యి
ప్పిదపుం భావపరంపరల్ వెలసియే
    వృత్తమ్ములైనన్ సరే
యొదవుం దీవ్రశరప్రవాహగతులట్లున్
    యుత్కృష్ట మాహాత్మ్యమే
మదికిన్ నూత్నముదమ్ముఁ గూర్చి కవితా
    మార్గమ్ముఁ జూపున్ గురూ! 93

కలవెన్నో నినుఁగూర్చి లోకమున
    వఖ్యాణింపఁగానైన గా
థలు కానీ యనభిజ్ఞుఁడేమి యెఱుఁగున్
    త్వజ్జీవితానూన వా
ర్తలు క్వాచిత్కమెఱింగియుంట నిటు ప
    ద్యాలల్లినాడన్ మహ
ర్షుల చారిత్రము లన్న భావిజనతా
    సూత్రార్థ సంపన్నిధుల్. 94

కలకాలమ్ము త్వదాశయమ్ము వెలయం
గా; తత్త్వబోధోన్నతుల్
గలుగంగాఁ గతమా సదాశ్రమములు
ద్గ్రంథావళుల్ గూర్పఁగాఁ
బలుచోట్లన్ బహుళాత్మసాత్త్విక సుధా
వారాన్నిధుల్ పొంగగా
బలితమ్మా మహితాశిషమ్ము సమకూ
ర్పన్ వేడెదన్ సద్గురూ! 95

నాఁటికి నేఁటి కొక్కమొగి
నవ్యవిచార విలాసభాస్వమై
సాటి వచింప వీల్పడని
చక్కని చిక్కని పెక్కు నిక్కముల్
సాటు త్వదాశ్రమావళులు
స్వార్థవిచారుల దుష్ప్రచారవా
గ్ధాటుల రాటులేక భవ
దాశయసిద్ధిని గూర్చుతం గురూ! 96

నానాదేశసమాగ తార్యజనులా
న్నత్యాద్వయాతత్త్వ వి
జ్ఞానాపేతు సమాశ్రయించి కొలువ
న్మన్నించి మేలెంచి మెం

తే నిర్ణ సత్యసమితిస్థ భక్తజనసా
హిత్య ప్రసన్నోన్నరుస
మ్మానార్హ ప్రవిబోధ గూర్చితి; సుధీ
మాన్యుండవై సద్గురూ! 97

తెలుఁగుల పుణ్యమా యని య
దేపనిగా మలయాళ దేశ మం
దొలసిన నీవు వచ్చి యెటు
లో మముబోంట్ల సముద్ధరింపఁగా
వెలసితి వీర! నీవలన
వేనకువేలు తెలుంగువారు ము
క్తులయిరి యింతకంటె మదిఁ
గోరఁగ వేఱొకఁడున్న సద్గురూ! 98

నీ వొనరింప నెంచి గమ
నించి కృపామతిఁగాంచి – పెద్దగాఁ
గావలె నంచుఁ బెంచిన జ
గద్వినుతాశ్రమపాళి సొంపుఁ బెం
పావహిలంగ నేఁడు విజ
యధ్వజ మెత్తెఁ దెలుంగునేల నీ
దీవన లెంత చేయవు య
తిప్రవరా! మలయాళ సద్గురూ! 99

నాయకులెల్ల రేకమయి
నాఁడును నేఁడునుఁగూడ సుంత యే
జేయఁగలేని కార్యమఱి
చేసెఱవేర్చితి విచ్చగించి యే
సాయము లేనివాఁడవయి
సారతరప్రవిబోధమాత్ర ని
శ్రేయస బుద్ధి నీకుపమ
జెప్పుట కెట్టులు సెల్లు సద్గురూ! 100

నీవు నిర్మించిన – నిఖిలాశ్రమమ్ముల
భ్యంచితబోధఁ గావించు వఱకు
నీవు రచించిన – నిఖిలోపదేశముల్
ప్రజల కాధారమై – ప్రబలువఱకు
నీవు బోధించిన – నిర్మల తత్త్వమ్ము
భక్తమనోవీధిఁ – బరగువఱకు
నీవు గావించిన – నిభృత సత్కృతులు లో
కోపకారకములై – యొప్పువఱకు

నీదు శిష్యప్రశిష్యులు – నెగడు వఱకు
నీవు లేవనుమాటయే – నిజముకాదు
కలవు సామర్థ్య మలగని – వెలుఁగు వగుచు
దివ్యగుణసాంద్ర! – మలయాళ దేశికేంద్ర! 101

ప్రాచ్యవేదాంత సద్గ్రంథావళిఁ బ్రచు
రించినావు ప్రకృతిఁ - బెంచినావు
బహుళాశ్రమమ్ము లేర్పఱచి శిష్యుల దిద్ది
తీర్చినావు రిపుల - గూర్చినావు
అజ్ఞానతమము వా - యఁగ జ్ఞానబోధఁ గా
వించినా వసమునఁ -డించినావు
మూఢవిశ్వాస ప్రబుద్ధుల మార్పాటొ
నర్చినావు జయమ్ముఁ బేర్చినావు
ఆత్మజిజ్ఞాస రేకెత్తు - నట్లు తెలుపగ
పొలము వెలుఁగులఁ బండింప - బూనినావు
నీకు సాటి యెవండు భూ - నేలయందు
దీపితాసంగ ముఁనిచంద్ర! దేశికేంద్ర! 102

నాగరకమ్ము ప్రమమ్ము యథు
నాతన వేదవిరుద్ధ బద్ధ మి
థ్యాగత కామ సంవృతక
దధ్యచరిష్ణుల భ్రాంతిమూలదు
ర్యోగము రూపుమాప జని
నొంది సనాతన దివ్యతత్త్వముఁ
బాగుగ విప్పిచెప్పిన శు
భ ప్రదమూర్తివి నీవు సద్గురూ! 103

ఈశ్వరాంశజాతు - లెది యెంచి కావింతు
రది ఫలించి సిద్ధి - నందు టసదె
పరమ గురువరేణ్య! - పావనాశయము బో
ల్వారు చోట శక్తి - మీరు గాదె! 104

ఎవఁడో యొక్కవివేకి దప్పు యెఱుఁగం
డీయాంధ్రిలో 'గీత' పే
రవురా! యేమని వ్రాసుకొంటివో ప్రబో
ధావశ్యకం బెంచినేఁ
డవలోకించిన మారుమూలలను గీ
తా భ్యాసకుల్ హేయజ
న్మవిశేషోగ్ర నిరాసకుల్ గలరు శ్రీ
మల్యాళమౌనీశ్వరా! 105

ఆశ్రమమన్న మానులన
నాత్మవిచారమటన్న నెక్కడో
విశ్రమభూములన్ జడలు
బెంచి నిరంతరమౌన ధారణో
పాశ్రయులైన వారిపని
యంచుఁ దలంచిరి మున్ను నేఁడు నీ
యాశ్రయమంది సత్యపథ
మందు జరింపఁగ నేర్చిరో గురూ! 106

సౌవర్ణస్థగితాబ్జరాగ కలశ
 స్యంది ప్రభామాధురీ
వ్యావృత్తామృత బిందు బృందసమహా
 వ్యాహారముం గూర్చి "యో
హో విద్వత్కవి నాగనార్య!" యని యెం
 తో ప్రేమన్ బిల్చుత్వత్
ప్రావృణ్మేఘ గభీరకంఠరుతి శ్రా
 వ్యంబిప్డుఁ బోదో గురూ! 107

ఆర్షసిద్ధాంతమ్ము – లోమాల చూడమ్ముఁ
 జూచినావు తమమ్ము – నేచినావు
బహుశాస్త్రమమ్ము లే – ర్పఱచి శిష్యానీక
 ముంచినావు హితమ్ముఁ – బెంచినావు
గురుకుల విధులు నెక్కొల్పియార్యమతమ్ము
 నిలిపి నావాదృతిఁ – గొలిపి నావు
ప్రాచ్యసంస్కృతి నేర్పు – పాఠశాలలు నెల
 కొల్పినావు యశమ్ము – నిల్పినావు

భారతీయ సనాతన – పథ నిదాన
బహువిధాన నిబోధనా – పరతఁ గూర్చి
తెలుఁగులకుఁ బున్నెపుం బంట – తీరు వెలసి
నావు నినుఁ గొనియాడఁగా – నాతరమ్మొ! 108



శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు

శ్రీ విమలానందస్వాములవారు.

నిత్యము శుద్ధము బుద్ధము
సత్యమగు త్వదాత్మకింక శాంతి వలయునా?
గత్యంతర మున్నదె ప్రా
క్సత్యమ వీవగుటచే న – సంగానందా! 116

పరమపదాధినాథపద
పంకజ పాంసుపరీత మానసాం
బురుహారజోవ్రజస్థగిత
పూతచరిత్ర! పవిత్రభారతీ
చరణ సరోజ బంధుర వి
చారణ మార్గ నిజాత్మత త్త్వవి
స్ఫురిత మహాస్వరూప! శివ
సుందరశాంతినిధాన! సద్గురూ! 117

—: ఉ ప సం హా ర ము :—

భావనే పథ్య నటనా ప్రభావితుండు
శ్రోష్యశిష్యుండు పొంగును క్రుంగులేని
స్వామి చరణారుణాంబుజ పాంసు భరిత
శీర్షుఁడం దించె నీకు జేజేలు తండ్రి! 118

పలుకు వెలఁది సాయ – పడినట్లు నెమ్మదిఁ
దోఁచినట్లు బత్తి – లేచినట్లు
కలము సాగినట్లు కైతలు నేనిట్లు
కూర్చినాడ నలఁతి నేర్చినట్లు. 119

స్వార్థేతర ధిషణన్ వి
ద్యార్థి హితార్థమయి విరచి - తమ్మిది వెలుఁగన్
స్వార్థన్యాభము పూతము
నిర్ఘాతాఘమ్ము ఘనము - నీపావహమున్. 120

పరమార్థసార వి స్తృతిఁ
బరిపూర్ణమ్మైన దీన - బహు దోషమ్ముల్
బెరసినను పరిహృతమ్మగు
గురుకరుణం బడయరాని - గుణములు గలవే? 121

పరతత్త్వాలోకనత
త్పరమతి శ్రీ నాగనార్య - పండిత కవి భా
సురకృతి పరిపూర్ణమ్మయి
పరగు సభా మధ్య నాత్మ - పరిశోధనమై. 122

పది తొమ్మిది వందల య
ర్వది తొమ్మిదవ సమనైద - వ నెలను ఘటి యి
ర్వది యెన్మిదవ దినమ్మున
పొదలెన్ సద్గురు కృపాను - భూతి సుకృతియై. 123

శ్రీమదసంగానందా!
యో మలయాళ గురు చంద్ర! యుజ్జ్వల సద్బో
ధామృతరసని స్తంద్రా!
ప్రేమాళయ సాంద్ర! భ క్తి వివశ మునీంద్రా! 124

మణిమాల

పరమార్థ సక్త హృదయాబ్జ
భానుకిరణా! నమోస్తు కరుణా
వరుణాలయా! నిరుపమాన
భక్తహృదయాధినాథ! రమణా!
కరణీయకార్య నిచయాధి
కారా! జితభక్తకల్మష గుణా!
పరిపూర్ణతత్త్వ! పతిపూత
భావ! పరిపక్వబోధకరుణా! 125

ఆసంగానందవృత్తము

దేవా! త్వత్పాదపద్మద్వయిన్ దెల్పుభక్త్యన్వితా
ద్దీపశక్తిన్ మదిన్నే
నీవాడన్ నమ్మియున్నాడ నా నేరముల్ ద్రోపదన్
నమ్మంగా పాడలేవా
ద్యావాపృథ్వ్యంతరాలన్ బుధాధారతన్ నిల్పునా
ధారయావే కదతుల్యా!
రావయ్యా! ప్రోవ జాగేల తా రావులన్ మాటలతో
రక్షింపడన్ వేడుకొంటిన్. 126

ఇది శ్రీ వైశ్య విద్వత్పండిత సత్కవి సార సాగర సార్య మహాశయ
విరచితమగు మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వామి
చరిత్రమునందు సప్తమ ఘట్టము. సంపూర్ణము.

శ్రీ సద్గురు పరబ్రహ్మార్పణమస్తు. శ్రీ హ్యభయాత్. ఓం తత్సత్.

శ్రీ

# పంచరత్నములు

రచయిత:_ మహామహోపాధ్యాయ - కవి సార్వభౌమ

బ్రహ్మశ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు, (రాజమంద్రి)



౧

శ్లో॥ ఓమిత్యేకాక్షరం యత్ప్రణవమభిహితం
బ్రహ్మతత్త్వం సమస్తమ్
తద్ధ్యానైకాగ్రచిత్తస్తదభవదమలం
యస్తపస్తప్తదేహః।
జ్ఞానానన్దస్వరూపం ఘనతరకరుణా-
సాగరం సర్వగమ్యం
మల్యాళిస్వామినం తం మహిత గుణయుతం
మన్త్రమూర్తిం భజేఽహమ్।

౨

శ్లో॥ బ్రంహాంశాత్సంప్రభూతః సదసదవగతో
వ్యాసభట్టారకోఽస్మిన్,
ఆంధ్రే గోగర్భనామ్నా గిరివర విదితా-
దద్య భక్తావనార్థం।

సంజాతః కాశిబుగ్గ ప్రథిత మునినుత
క్షేత్రవాసీ పునర్యో
మల్యాళస్వామినం తం మహిత గుణయుతం
మన్త్రమూర్తిం భజేఽహమ్ ॥

3

శ్లో॥ సాధూనాం పాలనాయ ప్రబలదురిత వి-
ధ్వంసనా యాన్ధ్రభూమౌ
ధర్మాణాం రక్షణాయ ప్రభురఖిల జగ-
న్నాయకోఽద్యావిరాసీత్ ।
బ్రహ్మశ్రీ శంకరార్యః పునరితి చ యతిం
యం వదన్తీహ సాధుం
మల్యాళస్వామినం తం మహితగుణయుతం
మన్త్రమూర్తిం భజేఽహమ్ ॥

౪

శ్లో॥ సన్న్యస్యేహ స్థితానాం గృహధనవనితా
వాహనానాం సుసంగం
సోఽహం బ్రహ్మేతి వాచా శ్రుతిషు కలితయా
వ్యాహరన్యో రరాజ ।
తం సాక్షాచ్ఛంకరం సంయమి జన పరమం
వ్యాసనామాశ్రమస్థం
మల్యాళస్వామినం తం మహితగుణయుతం
మన్త్రమూర్తిం భజేఽహమ్ ॥

౫

శ్లో॥ అహమస్మి బ్రహ్మ సోఽస్మీత్యనుపదమపరం
బ్రహ్మ సాక్షాదభూద్యో
విలసన్మూర్తిస్ఫూర్తిర్నిజపదకమల
ధ్యాన సక్తోత్తమానాం।
లలితం విజ్ఞాన తేజోబలకలితమహాం
నిర్మలం నిర్వికారం
మలయాళస్వామినం తం మహితగుణయుతం
మంత్రయానం భజేఽహమ్ ॥

౬

శ్లో॥ శ్రీపాదకృష్ణ కవినా రచితం పరమార్థదం।
మల్యాళస్వామినః స్తోత్రం జీయదాచంద్రతారకమ్ ॥

ఓం తత్ సత్.

ఉపబంధము — (2)

# "శ్రీవారి జీవితములోని కొన్ని ముఖ్యఘట్టముల కాల వివరణము"

1. "జననము" 29—3—1885.

2. "తిరుమల గోగర్భములో తపస్సు" 12 సం॥ 5 మా॥ 13 రోజులు.

3. "శ్రీ వ్యాసాశ్రమ స్థాపనము" స్వస్తిశ్రీ అక్షయ నామ సం॥ వైశాఖ బహుళ సప్తమి గురువారము 2—6—1926.

4. "శ్రీ వేంకటేశ్వర సంస్కృత పాఠశాల" స్థాపనము అక్షయనామ సం॥ శ్రావణ బహుళ విదియ 25—8—1926.

5. "శ్రీ సనాతన వేదాంత జ్ఞాన సభా" ప్రారంభము అక్షయనామ సం॥ భాద్రపద బహుళ దశమి శుక్ర వారము 1—10—1926.

6. "యథార్థభారతి" పత్రికా ప్రారంభము అక్షయనామ సం॥ మాఘ పూర్ణిమ 16—2—1927.

7. "తురీయాశ్రమ స్వీకారము" యువనామ సం॥ మాఘ శుక్ల ఏకాదశి సోమవారము 3—2—1936.

8. "ప్రథమ చాతుర్మాస్య మహావ్రతము" (కృష్ణలంక – విజయవాడ.) సర్వధారినామ సం॥ ఆషాఢ శుద్ధ ఏకాదశి 16-7-1948 నుండి 13-11-1948 వఱకు.

9. "శ్రీ వ్యాసాశ్రమ రజతోత్సవము" వికృతినామ సం॥ మాఘ శుద్ధ పూర్ణిమ 21—2—1951.

10. "ద్వితీయ చాతుర్మాస్య మహావ్రతము" (సీతంపేట – రాజమండ్రి) ఖరనామ సం॥ ఆషాఢ శుద్ధ ఏకాదశి 15—7—1951 నుండి కార్తీక శుద్ధ ద్వాదశి శనివారము 10—11—1951 వఱకు.

11. "కన్యాగురుకుల శంకుస్థాపన" స్వస్తిశ్రీ జయనామ సం॥ జ్యేష్ఠ శుద్ధ దశమి గురువారము 10—6—1954.

12. "తృతీయ చాతుర్మాస్య మహావ్రతము" (కృష్ణలంక – విజయవాడ) జయనామ సం॥ ఆషాఢ శుద్ధ ఏకాదశీ ఆదివారము 11—7—1954 మొదలు కార్తీక శుద్ధ ద్వాదశి ఆదివారము 7—11—1954 వఱకు.

13. "కన్యాగురుకుల స్థాపనము" స్వస్తిశ్రీ మన్మథనామ సం॥ కార్తీక బహుళ విదియ గురువారము 1-12-1956.

14. చతుర్థ చాతుర్మాస్య మహావ్రతము (శివగిరి ఆశ్రమము) స్వస్తిశ్రీ హేవిళంబినామ సం॥ ఆషాఢ శుద్ధ ఏకాదశి ఆదివారము 7-7-1957 నుండి కార్తీక శుద్ధ ద్వాదశి సోమవారము 4—11—1957 వఱకు జరిగిన చాతు

ర్మాస్యవ్రతములో నెల రోజులు మాత్రము అనగా
ఆశ్వయుజ శుద్ధ ఏకాదశి 4—10—1957 నుంచి
4—11—1957 వఱకు ఉండిరి.

15. పంచమ చాతుర్మాస్య మహావ్రతము (రాజమహేంద్ర వరము) స్వస్తిశ్రీ విళంబినామ సం॥ అధిక శ్రావణ శుద్ధ ఏకాదశి శనివారము 26—7—1958 నుండి కార్తిక శుద్ధ ద్వాదశి 22—11—1958 వఱకు.

16. "మహానిర్యాణము" శుభకృత్ నామ సం॥ ఆషాఢ శుద్ధ ఏకాదశి గురువారము 12—7—1962.

17. "మండలారాధన" శుభకృత్ నామ సం॥ శ్రావణ కృష్ణ పంచమి సోమవారము 20—8—1962.

18. శ్రీ సద్గురు అధిష్ఠాన మందిర శంకుస్థాపన తేది 20—8—1962.

ఓం

# శ్రీ సనాతన వేదాన్త జ్ఞానసభలు జరుపబడిన ప్రదేశముల వివరము.

| సంఖ్య | సంవత్సరం | జరిగినచోటు | జిల్లా | ఆంగ్ల సం॥రం |
|---|---|---|---|---|
| 1. | అక్షయ | పాలమన్నూరు | చిత్తూరుజిల్లా | 1927 |
| 2. | ప్రభవ | అరవపాలెం | నెల్లూరుజిల్లా | 1928 |
| 3. | విభవ | పామర్రు | కృష్ణాజిల్లా | 1929 |
| 4. | శుక్ల | గూడూరు | నెల్లూరుజిల్లా | 1930 |
| 5. | ప్రమోదూత | రాజమహేంద్రవరం | తూర్పుగోదావరిజిల్లా | 1931 |
| 6. | ప్రజోత్పత్తి | [illegible] | కృష్ణాజిల్లా | 1932 |
| 7. | అంగిరస | ఏర్రకపల్లి | చిత్తూరుజిల్లా | 1933 |
| 8. | శ్రీముఖ | రావూల | ఉత్తరఆర్కాట్ జిల్లా | 1934 |
| 9. | భవ | కోలారు | కోలారుజిల్లా (మైసూర్) | 1935 |
| 10. | యువ | ఉంగుటూరు | కృష్ణాజిల్లా | 1936 |
| 11. | ధాతు | పోడూరు | పశ్చిమగోదావరిజిల్లా | 1937 |
| 12. | ఈశ్వర | చింతగుంట | చిత్తూరుజిల్లా | 1938 |
| 13. | బహుధాన్య | యలమంచిలి | విశాఖజిల్లా | 1939 |
| 14. | ప్రమాది | ఘంటసాలపాలెం, (తాడేపల్లి) | కృష్ణాజిల్లా | 1940 |
| 15. | విక్రమ | తపోవనము | చిత్తూరుజిల్లా | 1941 |
| 16. | వృష | రాజమహేంద్రవరము | తూర్పుగోదావరిజిల్లా | 1942 |
| 17. | చిత్రభాను | దిగువమాగము, శ్రీశివగిరిఆశ్రమం | చిత్తూరుజిల్లా | 1943 |
| 18. | స్వభాను | నందివనపర్తి | హైదరాబాద్ జిల్లా | 1944 |
| 19. | తారణ | విడవలూరు | నెల్లూరుజిల్లా | 194[illegible] |
| 20. | పార్థివ | [illegible] | తూర్పుగోదావరిజిల్లా | 194[illegible] |

| సంఖ్య | సంవత్సరం | జరిగినచోటు | జిల్లా | ఆంగ్ల సం॥రం |
|---|---|---|---|---|
| 21. | వ్యయ | మామండూరు | పశ్చిమగోదావరిజిల్లా | 1947 |
| 22. | సర్వజిత్తు | నందిమండలం | కడపజిల్లా | 1948 |
| 23. | సర్వధారి | తేలప్రోలు | కృష్ణాజిల్లా | 1949 |
| 24. | విరోధి | కేశవపట్నం | కరీంనగర్ జిల్లా | 1950 |
| 25. | వికృతి | రాజోలు | తూర్పుగోదావరిజిల్లా | 1951 |
| 26. | ఖర | తాపేశ్వరం | ,, | 1952 |
| 27. | నందన | నల్లగొండ | నల్లగొండజిల్లా | 1953 |
| 28. | విజయ | కాళహస్తి | చిత్తూరుజిల్లా | 1954 |
| 29. | జయ | అగరం | కోలారుజిల్లా(మైసూర్) | 1955 |
| 30. | మన్మథ | తిమ్మరాజుపాలెం | పశ్చిమగోదావరిజిల్లా | 1956 |
| 31. | దుర్ముఖి | తేరేడుపల్లి | నల్గొండజిల్లా | 1957 |
| 32. | హేవిళంబి | పెద్దవడుగూరు | అనంతపురంజిల్లా | 1958 |
| 33. | విళంబి | వీరఘట్టం | శ్రీకాకుళంజిల్లా | 1959 |
| 34. | వికారి | సికిందరాబాద్ | హైదరాబాద్ జిల్లా | 1960 |
| 35. | శార్వరి | పాహీశాపురం, (విజయవాడ) | కృష్ణాజిల్లా | 1961 |
| 36. | ప్లవ | షాద్ నగర్ | మహబూబ్ నగర్ జిల్లా | 1962 |
| 37. | శుభకృతు | దోనేపూడి | గుంటూరుజిల్లా | 1963 |
| 38. | శోభకృతు | గట్టుదుద్దెనపల్లి | కరీంనగర్ జిల్లా | 1964 |
| 39. | క్రోధి | ప్రొద్దుటూరు | కడపజిల్లా | 1965 |
| 40. | విశ్వావసు | దువ్వ | పశ్చిమగోదావరిజిల్లా | 1966 |
| 41. | పరాభవ | అగ్రహారం | కరీంనగర్ జిల్లా | 1967 |
| 42. | ప్లవంగ | ముడినేపల్లి | కృష్ణాజిల్లా | 1968 |
| 43. | కీలక | వీరఘట్టం | శ్రీకాకుళంజిల్లా | 1969 |
| 44. | సౌమ్య | సికిందరాబాద్ | హైదరాబాద్ జిల్లా | 1970 |
| 45. | సాధారణ | ప్రాయిరెడ్డిగూడెం | మహబూబ్ నగర్ జిల్లా | 1971 |

ఓం

# శ్రీవారి గ్రంథ సూచిక

20. గృహస్థాశ్రమధర్మము (దివ్యజననము) ... 2-00
21. నిర్వాణనిలయము ... 2-00
22. శ్రీ నారదభక్తిసూత్రములు ... 2-00
23. శ్రీ వ్యాసాశ్రమ రజతోత్సవ సంచిక ... 8-00
24. ముక్తిసోపాన దినచర్య ... 1-62
25. జ్ఞానోదయడైరి ... 1-50
26. బ్రహ్మచర్యము ... 1-25
27. గురుభక్తి ప్రభావము ... 1-25
28. ఉపదేశామృతము (ప్రథమభాగము) ... 1-00
29. ,, (ద్వితీయభాగము) ... 1-00
30. ,, (తృతీయభాగము) ... 1-50
31. ,, (చతుర్థభాగము) ... 1-50
32. ,, (ఇంగ్లీషు) ... 2-00
33. స్త్రీలకు బ్రహ్మచర్యమునకు, సన్న్యాసమునకు అధికారము కలదా? ... 1-12
34. కర్మసిద్ధాంతము ... 1-00
35. నిర్విఘ్న యోగసిద్ధి ... 1-00
36. మాయను మాయము చేయుట ... 0-75
37. గుణత్రయము, గుణత్రయాతీతము ... 0-75
38. శ్రీ మలయాళయతీన్ద్రగీత ... 8-00
39. మహామన్త్రాతీత ప్రభావము ... 0-75
40. శ్రీ చాతుర్మాస్య మాహాత్మ్యము ... 0-75
41. శ్రీ భగవద్గీతా ప్రభావము ... 0-50

| | | | |
|---|---|---|---|
| 42. | యజ్ఞమున పశుహింస సమ్మతమా ? | ... | 0–50 |
| 43. | ప్రారబ్ధకర్మ | ... | 0–60 |
| 44. | గీతాగమనము | ... | 0–40 |
| 45. | వైరాగ్యబోధోపరతులు | ... | 0–37 |
| 46. | జీవన్ముక్తి | ... | 0–37 |
| 47. | ప్రమాదము నొందకుడు | ... | 0–50 |
| 48. | జ్ఞానయజ్ఞము | ... | 0–31 |
| 49. | 'యథార్థభారతి' చిన్నపొత్తము | ... | 0–19 |
| 50. | శ్రీ భగవద్గీతాష్టాదశాధ్యాయము క్తిసోపానము | ... | 0–[illegible] |
| 51. | మహావాక్యములు | ... | 0–20 |
| 52. | ఉపదేశ అష్టోత్తరశతి | ... | 0–20 |
| 53. | సమాధి చేయు విధానము | ... | 0–20 |

## శ్రీ వారి అనువాద గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 54. | శ్రీ మద్భగవద్గీత – (పదవిభాగ, ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషార్థసహితము.) గీతార్థము విశదమగునట్లు తేలికమాటలతో సులభ శైలిలో శ్రీవారు "గీతార్థప్రకాశము" అను పేరుతో విశేషార్థమును రచించిరి | ... | 8–00 |
| 55. | శ్రీ మద్భగవద్గీత (తాత్పర్యసహితము) | ... | 2–00 |
| 56. | కఠోపనిషత్తు | ... | [illegible] |
| 57. | ముండకోపనిషత్తు | ... | [illegible] |
| 58. | మాండూక్యోపనిషత్తు | ... | [illegible] |

## శ్రీ స్వాములవారిచే సంగృహీతములు

| | | |
|---|---|---|
| 59. జ్ఞానామృతము | ... | 0–10 |
| 60. నిత్యప్రార్థన | ... | 0–20 |
| 61. స్తోత్రమఞ్జరి | ... | 1–00 |
| 62. శ్రీమద్భాగవతసారము | ... | 1–00 |
| 63. శ్రీరామ నామామృతము | ... | 0–10 |
| 64. బీజాక్షరవర్ణమాలికాస్తోత్రము | ... | 0–10 |
| 65. శ్రీ బుద్ధోపదేశము | ... | 0–12 |
| 66. శ్రీ వ్యాసాశ్రమస్థలమాహాత్మ్యము | ... | 0–25 |
| 67. గురుధ్యానము | ... | 0–20 |
| 68. గీతార్థసారకీర్తనము | ... | 0–20 |
| 69. శ్రీ గాయత్రీమన్త్రము | ... | 0–75 |

## శ్రీ యోగవాసిష్ఠము

| | | |
|---|---|---|
| పూర్వార్ధము (రెండు భాగములు) | ... | 30–00 |
| ఉత్తరార్ధము (రెండు భాగములు) | ... | 30–00 |

★

## యథార్థ భారతి

కర్మ, భక్తి, యోగ, జ్ఞానములను తెలిపెడు
ఆధ్యాత్మిక మాసపత్రిక. సం॥ చందా 5–00

లభించువారు:— మేనేజరు శ్రీ వ్యాసాశ్రమము,
వ్యాసాశ్రమము - పోస్టు, ఏర్పేడు మార్గము,
చిత్తూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్, అని వ్రాయవలయును.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ




వ్యాహరన్మామనుస్మరన్ ।

యః ప్రయాతి త్యజన్దేహం

స యాతి పరమాం గతిమ్